అపరాధ పరిశోధన అనుబంధం—70

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## హాతుడెవరు? హంతకుడెవరు?
రచన : వసుంధర

## స్నానాలగదిలో శవం
రచన : సికిందర్

## అగ్నిజ్వాల?
రచన : ఏ. వీ. మోహన్రావ్

## 'మృత్యుకిరణాలు'
రచన : అంధవరపు మల్లిబాబు

అడుగు ముందుకువేస్తే చస్తావ్!
పదవ భాగము - రచన : వసుంధర

అపరాధ పరిశోధన సప్లిమెంటు—70
అక్టోబర్, 1979
వెల ; రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ :
ప్రగతి ఆర్ట్ ప్రింటర్స్,
హైదరాబాదు-4

# హాతుడెవరు? హంతకుడెవరు?

వసుంధర

ధర్మారావు కిళ్ళీకొట్టు దగ్గర ఆగి ఓసోడా కొట్టించుకుని తాగి—"అబ్బ—ఎండలు మండిపోతున్నాయి—" అన్నాడు.

"అవునండి. ఈఏడాది మాబేరాలు కూడా జోరుగానే ఉన్నాయి—" అన్నాడు కొట్టుఆసామి. ఆ ఆసామీకి డబ్బిచ్చి 'ఈకొట్టు నదిరోడ్డు మీదుంది. ఇక్కడా ఎండలు మండిపోతున్నాయి. కొట్టేమీ ఎయిర్ కండీషన్డుది కాదు. ఆసామీ చెమటలు కక్కేస్తున్నాడు కానీ తను ఒక్క సోడాకూడా తాగడంలేదు. వ్యాపారమంటే ఇదేకాబోలు—' అనుకున్నాడు.

వ్యాపారం గురించి ధర్మారావు అలా ఆలోచించడానికి కారణం లేకపోలేదు.

అతని తమ్ముడు శంకర్రావు వ్యాపారం చేస్తున్నాడు. వ్యాపారం ప్రారంభించి అయిదారు సంవత్సరాలయింది కానీ ఇంతవరకూ దానివల్ల కలిగిన ప్రయోజనం తెలియ లేదు.

ధర్మారావు, శంకర్రావు-ఇద్దరూ అన్నదమ్ములు. చాలా అన్యోన్యంగా ఉంటారు. ధర్మారావుకు పెళ్ళయింది. భార్య అనుకూలవతి. ఇద్దరు పిల్లలు. శంకర్రావుకు పెళ్ళిసంబంధాలు వస్తున్నాయి కానీ వ్యాపారంలో స్థిర పడితే తప్ప పెళ్ళిచేసుకోనంటున్నాడు. శంకర్రావుకు పాతికేళ్ళు దాటాయి.

అన్నదమ్ములకు ఉమ్మడిగా పాతికెకరాల మాగాణీ ఉంది. ఊళ్ళో రెండిళ్ళున్నాయి. ధర్మారావు కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాడు. అది ప్రయివేట్ కాలేజీయే అయినా జీతాలు సక్రమంగానే ఇస్తారు. జీతం కాక ధర్మారావుకు ప్రయివేట్ల రూపేణా ఆదాయం బాగానే వస్తోంది.

శంకర్రావు సంగతే ఎటూ తేలకుండా ఉంది. అత గాడు హైస్కూల్లో సెకండ్‌ఫారం రెండుసార్లు ఫెయిల్ కావడంతో పరువు తక్కువని ప్రయివేటుగా మెట్రిక్ చదివించారు. అది మూడుసార్లు తప్పేక శంకర్రావు మరి పరీక్షలు రాయనని మొండికేశాడు.

ఆ తర్వాత అతడి దృష్టి వ్యాపారం మీదకు పోయింది. ముందేవో అవీ ఇవీ చిల్లర వ్యాపారాలు చేసి చిల్లర దెబ్బలు తిన్నాడు. ఆ సమయంలో ఒక ఏడాది తేడాలో తలిదండ్రులిద్దరూ పోయారు. ఇంటికి ధర్మారావే పెద్ద అయ్యాడు.

ధర్మారావు ఇంటి పెద్దకావడం శంకర్రావుకు ఇంకా లాభించింది. స్వతహాగా ధర్మారావు మెతకమనిషి. అత నికి తమ్ముడంటే వల్లమాలిన అభిమానం. శంకర్రావుకు అన్న దగ్గర బాగా చనువుంది.

"చిల్లర వ్యాపారాలు చేసి చిల్లర దెబ్బలు తిన దల్చుకోలేదింక-" అన్నాడు శంకర్రావు అన్నతో.

"అంటే పెద్దవ్యాపారంచేసి పెద్ద దెబ్బతినాలనా?" అన్నాడు ధర్మారావు నవ్వి.

"వ్యాపారం చేస్తే దెబ్బతినడ మొక్కటే ననుకున్నావా?" అన్నాడు శంకర్రావు కోపంగా.

"పరీక్షలు రాస్తే ఫెయిలవడమూ, వ్యాపారాలుచేస్తే దెబ్బతినడమూ- ఇదే కదా నీ రివాజు"

"అలా అనకు అన్నయ్యా- ఒక్క అయిదువేలియ్యి- రెండేళ్ళలో లక్షాధికారిని అవుతాను-"

ధర్మారావు నవ్వి- "సరే - తీసుకో-" అన్నాడు. ఏం వాప్యాపారమని అతను అడగలేదు. శంకర్రావూ చెప్పలేదు. డబ్బుతీసుకొని శంకర్రావు వెళ్ళిపోయాడు.

గత అయిదు సంవత్సరాలుగా అతను ఇంట్లో ఒక్క పైసా కూడా ఇవ్వలేదు. పండుగలకూ అప్పుడూ తమ్ముడికి బట్టలుకూడా ధర్మారావే తీయించేవాడు. వ్యాపారం ఇబ్బందుల్లో ఉన్నదని ధర్మారావు దగ్గర శంకర్రావు అప్పుడప్పుడు డబ్బు తీసుకుంటూండేవాడు. ఆ విధంగా ఆ వ్యాపారం మీద ఇప్పటి వరకూ పాతిక వేల వరకూ ఖర్చయింది.

"ఇలాడబ్బయిస్తే అతను పాడైపోతాడండీ- అసలేం చేస్తున్నాడో తెలుసుకోండీ" అంటూ శాంత ఒక పర్యాయం భర్తను మందలించింది.

"వాడి గురించి నాకు తెలిసిందల్లా ఒక్కటే. వాడికే దురలవాట్లూ లేవు. ఆఖరికి సిగరెట్ కూడా తాగడు. క్లబ్బులమ్మట తిరగడంలేదు. పేకాడి డబ్బు తగలే

యడంలేదు. అంతవరకూ హామీ ఇవ్వగలను నేను''- అన్నాడు ధర్మారావు.

"హామీ నా కివ్వడమెందుకూ- అతడు చెడిపోతాడన్న భయం కొద్దీచెప్పాను. ఈ వయసులో బాధ్యతలు తెలియకపోతే కష్టంగదా-" అంది శాంత.

"శాంతా! ప్రస్తుతం వాడు చేస్తున్నఖర్చు వాడి ఆస్తిమీదవచ్చే ఆదాయం కంటే తక్కువగానే ఉంది. వాడు మరీ దుబారాగా ఉంటే తప్పకవారించే వాణ్ణి. ఆ తర్వాత వాడికేమీ లేకపోయినా వాణ్ణి జీవితాంతం పోషించగల శక్తి మనకుంది. అందుకే వాడిగురించి నేనంతగా బెంగపెట్టుకోలేదు. ప్రస్తుతం వాడిరోజులు బాగాలేవు. అందుకని వ్యాపారంలో అడ్డే పైకిరాలేకపోతున్నాడు. ఏదో ఓరోజున అదృష్టం తన్నుకువచ్చి వాడు చాలాగొప్పవాడై పోతాడు. ఇది తప్పక జరుగుతుంది-" అన్నాడు ధర్మారావు.

భర్త మాటల్లో శాంతకూ సబబు కనిపించింది. మరిది గురించి మరీ అంత ఇదైపోవలసిన అవసరం లేదని ఆమె గ్రహించింది.

అయితే శంకర్రావు వారి అంచనాలను తారుమారు చేశాడు. నెలరోజుల క్రితం శంకర్రావు ఇంట్లో చాలా దిగులుగా కనిపించాడు. విషయమేమిటని అడిగితే ఓ పట్టాన చెప్పలేదు. బాగా నొక్కించి అడగ్గా-"జీవితంలో వేయకూడని తప్పటడుగే వేశాను. రెండు మూడు నెలల్లో వ్యాపారం పుంజుకునే అవకాశం ఏర్పడిందనుకొనే టంతలో ఈ ఇబ్బంది వచ్చింది." అన్నాడు.

"నీ మాటలు నాకర్థం కావడం లేదురా. వివరంగా

చెప్పరా''-అన్నాడు ధర్మారావు.

"నా మాటలు నీ కర్థం కాకూడదన్నయ్యా - అర్థం చేసుకోవడానికూడా ప్రయత్నించ వద్దు. నేను చిక్కుల్లో పడ్డాను. అవి నీవల్ల తీరేచిక్కులు కావు. ఎలా వాటిలో పడ్డానో అలాగే వాటిలోంచి బయట పడ్డానికి ప్రయత్నిస్తాను. కనీసం అంతకాలం మీరు నా గురించి పట్టించుకోకండి-" అన్నాడు శంకర్రావు.

తమ్ముణ్ణి నొక్కించి ఏ విషయమూ అడగడం చిన్నప్పట్నించీ ధర్మారావుకు అలవాటు లేదు. అందువల్ల అతడికి తమ్ముడి గురించి బెంగగా ఉంది. తమ్ముడి చిక్కులన్నింటికీ వ్యాపారం పిచ్చి కారణమని తెలియడం వల్ల ఎక్కడైనా ఎవరైనా చక్కగా వ్యాపారం చేసుకుంటూంటే చూసి నిట్టూరుస్తుంటాడతను. ఎక్కడ ఎవర్ని చూసినా చక్కగా వ్యాపారం చేసుకుంటున్నట్లే కూడ అతడికి అనిపిస్తుంది.

ప్రస్తుతం ధర్మారావు తన బావమరిది ఇంటికి బయల్దేరాడు.

ధర్మారావు బావమరిది రమణమూర్తి ఆ ఊళ్ళోనే ఉంటున్నాడు. అతనికా ఊళ్ళో పేరున్న ప్రెస్ ఉంది. వ్యాపారం చక్కగా నడుస్తున్నా రమణమూర్తి ఎక్కువగా ఇంట్లోనే కాలం గడుపుతూంటాడు.

అతను కాస్త కులాసా పురుషుడు. బ్రతికిన నాలుగు రోజులు ఏ బాదరా బందీ లేకుండా హాయిగా జీవించాలంటాడు. అలా అని చెప్పుకోదగ్గ దురలవాట్లేమీ అతనికి లేవు. కొడుకు పుట్టు వెంట్రుకలు తీయించే కార్యక్రమం ఒకటుంది. ఆ విషయంలో కుర్రాడి మేనమామతో

సంప్రదిద్దామని ఇప్పుడు ధర్మారావుఅక్కడికి బయల్దేరాడు.

సోడాతాగి కొంతదూరం నడిచేక ధర్మారావుకు ఒక ఇంట్లోంచి హడావుడిగా బయటకు వస్తున్న తమ్ముడు శంకర్రావు కనబడ్డాడు.

"ఒరేయ్ శంకర్రావ్-" అని గట్టిగా పిలిచాడు ధర్మారావు. శంకర్రావు ఆ పిలుపు విననివాడిలా అక్కణ్ణించి హడా విడిగా వెళ్ళిపోయాడు.

ధర్మారావుకు ఆ ఇల్లెవరిదో తెలుసు. ప్రముఖ కాబరే నర్తకి మేనకది ఆ ఇల్లు. ఆమె అసలు పేరు మేనక కాదు. కానీ నర్తకిగా ఆ పేరుతోనే వ్యవహరించబడు తుందామె. అందచందాలలో, అవయవ పుష్టిలో ఆమెకు అప్సరసలు కూడా దీటురారని అంతా చెప్పుకుంటారు. తన అందాన్ని డబ్బు సంపాదించుకోవడానికామె వినియో గిస్తున్నట్లు జనం అంటారు.

ఇప్పుడు శంకర్రావు బయటకు వచ్చిన ఆ బంగళా చూడ్డానికి చిన్నదే కానీ అందులో లేని సదుపాయాలుండ వంటారు. దాని ఖరీదు పదిహేను లక్షల వరకు ఉంటుందని అంచనా. ఆ బంగళా ఎంత పలుకుబడిగలది అంటే అక్కడ ఉన్న సిటీబస్ స్టాప్‌ను చాలామంది "మేనక బంగళాస్టాప్!" అంటారు.

ధర్మారావు ఆలోచనలు పేరు. శంకర్రావు ఆ బంగళా లోంచి ఎందుకు వస్తున్నాడు? అతడికి ఆ బంగళాలో పని ఏమిటి? మేనకకూ అతడికీ ఉన్న పరిచయం ఎలాంటిది? శంకర్రావు ఇప్పుడెదుర్కొంటున్న సమస్యలకూ మేనకకూ సంబంధం ఉందా?

ఒక్క ప్రశ్నకూ్కడా ధర్మారావుకు జవాబు

దొరక లేదు.

## 2

ధర్మారావు వెళ్ళేసరికి రమణమూర్తి ఇంట్లోనే ఉన్నాడు. అతనూ మరొకతనూ కలిసి చదరంగం ఆడు తున్నారు. ధర్మారావు కూడా చదరంగం అంటే మంచి ఆసక్తి. అతను వెళ్ళేసరికి ఆటమంచి పట్టులో ఉంది.

"కూర్చో బావా!" అన్నాడు రమణమూర్తి.

ధర్మారావు తనూ ఓకుర్చీ లాక్కుని కూర్చుని "అర్జంటు విషయం కాదులెండి. ఆట ఆపకండి" అన్నాడు ఇద్దర్నీ ఉద్దేశించి.

ఇద్దరూ సీరియస్‌గా ఆడుతున్నారు. ఒక పరిస్థితిలో ధర్మారావు చూస్తు ఊరుకోలేక అపరిచిత వ్యక్తిని ప్రమాదము నుంచి హెచ్చరించి చిన్న సూచన ఇచ్చి రమణమూర్తి వంక చూసి "సారీ!" అన్నాడు.

"మరేం ఫరవాలేదు. ఇద్దరి మీద ఆడుతుంటే నాకు చాలా సంతోషం" అన్నాడు రమణమూర్తి

అపరిచిత వ్యక్తి ధర్మారావు చెప్పిన ఎత్తులో రమణ మూర్తి గుర్రాన్ని తీసుకున్నాడు. రమణమూర్తి ఆట ఇబ్బందిలో పడింది.

"అనుకోకుండా మీరు నాకుసాయపడి మీవాడిగుర్రాన్ని చంపడానికి సహకరించారు" అన్నాడు అపరిచిత వ్యక్తి.

"బావా-నీవాడికి నువ్వు వ్యతిరేకంగా సలహాలివ్వటం బాగోలేదు." అన్నాడు రమణమూర్తి నవ్వుతూ. ఆ ఎత్తు నుంచి తప్పించుకోవడానికి అతనికి చాలా సేపు పట్టింది.

మొత్తం మీద ఆట డ్రా అయింది.

"రమణా- శంకర్రావు నీ దగ్గరకు తరచూ వస్తూం టాడు కదా। వాడి వ్యాపారానికీ మేనక బంగళాకూ ఏమైనా సంబంధముంటుందంటావా?" అన్నాడుధర్మారావు.

"ఇదేం అనుమానం ?" అన్నాడు నవ్వుతూ రమణ మూర్తి.

అపరిచితుడు నవ్వి "మీరు నాకు ఆటలో సాయం చేశారు కాబట్టి చెబుతున్నాను. మేనక బంగళాతో సంబంధ మున్న వ్యాపారస్థులందరూ నాకు తెలుసు. ముందు ఆ శంకర్రావెవరో చెప్పండి।" అన్నాడు.

"అన్నట్లు నేను మీ ఇద్దరికీ పరిచయాలే చేయలేదు కదూ. ఈయన మా బావ-నా చెల్లెల్ని పెళ్ళి చేసుకోక ముందునించీ కూడా పేరు ధర్మారావు అని అపరిచితుణ్ని ధర్మారావుకు చూపిస్తు-'ఈయన ఇన్‌స్పెక్టర్ భానోజీరావు స్నేహం అనే పదానికి అసలుఅర్థం ఈయన వల్లనే నాకు తెలిసింది.' అన్నాడు.

"ఇప్పుడు చెప్పండి - శంకర్రావెవరో ?" అన్నాడు భానోజీరావు.

అతను పోలీసు ఇన్‌స్పెక్టరని తెలియగానే ధర్మారావు కొంచెస్త భయం వేసింది. కొద్దిగా తటపటాయించాడు. ఈలోగానే రమణమూర్తి—'శంకర్రావు ధర్మారావు గారి ఏకైక సోదరుడు' అన్నాడు.

"అయ్యేస్- ఆయనేం వ్యాపారం చేస్తూంటారు?" అన్నాడు భానోజీరావు.

"ఎజం చెప్పాలంటే నాకేమీ తెలియదు. వాడిది వచ్చీ రానివ్యాపారం. కొంత డబ్బుతీసుకుని వ్యాపారంపేరుతో

తగలేస్తూవుంటాడు. వాడేం వ్యాపారం చేస్తూంటాడో తెలియదు కానీ కొద్దికాలంగా దిగులుగా కనబడుతున్నాడు. వాడేమైనా చిక్కుల్లో పడ్డాడేమోనని అనుమానంగా ఉంది అనుకోకుండా మీ పరిచయం లభించింది. మావాడి వివరాలు చెబుతాను. వాడి గురించి తెలుసుకోగలరా ?" అన్నాడు ధర్మారావు.

"నేను ప్రయివేట్ డిటెక్టివ్‌ను కాననుకోండి. కానీ అటు వ్యాపారరీత్యా కానీ, ఇటు నేరాలరీత్యా కానీ ఇటీవల నేనెప్పుడూ శంకర్రావు పేరు విని ఉండలేదు. మేనక కస్టమర్సు పేర్లు చాలావరకూ నాకు తెలుసు. అందులో శంకర్రావు పేరులేదు. ఎటొచ్చీ ఆమె బంగ ళాకూ, మీ తమ్ముడి వ్యాపారానికీ ఏమైనా సంబంధ ముంటుందని ఎందుకు భావిస్తున్నారు ?" అన్నాడు భానోజీరావు.

ధర్మారావు క్షణం మాత్రం తటపటాయించి— 'ఇక్కడికి వచ్చేముందు నేను వాడిని ఆ బంగళాలోంచి వస్తూండగా చూశాను—'' అన్నాడు.

"టైము చెప్పగలరా?" అన్నాడు భానోజీరావు.

"పదిం పావు అవుతుంది-" అన్నాడు ధర్మరావు.

"సరేలెండి. నేను మేనక దగ్గర్నుంచి వివరాలు సంపాదించడానికీ సమాచారం చాలు. మీకు తప్ప కుండా నాకు తెలిసిన విషయాలు అందజేస్తాను ...." అంటూ భానోజీరావు లేచాడు.

"కాసేపు కూర్చో-" అన్నాడు రమణమూర్తి.

"ఇంటివద్ద ఇల్లాలు ఇప్పటికే కారాలూ మిరియాలూ నూరుతూ ఉంటుంది. అవి ఏకూరల్లోనూ వేయకుండా

చూసోక్కోవాలి...." అన్నాడు భానోజీరావు.

అతను వెళ్ళిపోయాక- "నేను కానీ తొందరపడి వ్యక్తిగత విషయాలు నీ స్నేహితుడికి చెప్పలేదుగదా అని భయపడుతున్నాను. పోలీస్ ఇనస్పెక్టరు అనగానే నా బాధ ఆయనకు చెప్పుకోవాలనిపించింది. శంకర్రావు కొన్నాళ్ళుగా చాలా దిగులుగా ఉంటున్నాడు-" అన్నాడు ధర్మారావు.

"భానోజీరావు మన మనిషి. అందువల్ల మన వ్యక్తిగత విషయాలు నిస్సంకోచంగా అతనికి చెప్పుకోవచ్చు. అందువల్ల ప్రమాదమేమీ లేదు. పైగా మనవాడేదైనా ప్రమాదంలో ఉంటే కాపాడతాడు కూడా-"

"అది నిజమేననుకో- కానీ తమ్ముడెందుకు దిగులుగా ఉంటున్నాడో నాకంతు పట్టడంలేదు. కొంపదీసి ఏదైనా నేరాల్లో ఇరుక్కోలేదు గదా అని బెంగగా ఉంది-" అన్నాడు ధర్మారావు.

"అలాగైనా ఫరవాలేదు. శంకర్రావుకి నేరాలు చేసే ధైర్యంలేదు. పొరపాటున ఎందులోనైనా ఇరుక్కుంటే ఆ వలయం నుంచి భానోజీరావు వాణ్ని రక్షిస్తాడు-" అన్నాడు రమణమూర్తి.

తర్వాత ఇద్దరూ సంభాషణను ఇతర విషయాలపై మళ్ళించారు. ఆ తర్వాత పుట్టినరోజు వేడుకల కార్యక్రమం గురించి ప్రస్తావించారు. తనకు ఏతేదీ అయినా అనుకూలమేనన్నాడు రమణమూర్తి.

"అలాకాదు. రేపురాత్రికి మీరు మాయింటికి రండి. అంతా కలిసి కాసేపు సరదాగా గడపవచ్చు. నువ్వూ మీ చెల్లాయ్ కలిసి మాట్లాడుకుని కార్యక్రమం ఏర్పాటు

చేయండి. కాస్త ఘనంగా చేయాలని మీ చెల్లాయ్ అనుకుంటోంది–" అన్నాడు ధర్మారావు.

రమణమూర్తి ఏదో అనబోతూండగా వీధిలో జీపు ఆగినశబ్దమైంది. మరుక్షణంలోనే లోపలికి ఖానోజీరావు వచ్చాడు.

"ఏమిటోయ్ విశేషం–ఇలా వెళ్ళి అలా వచ్చావ్ !"
అన్నాడు రమణమూర్తి.

"విశేషమే మరి–అందుకే యూనిఫాం వేసుకోకుండా ఇలా వచ్చాను...." అన్నాడు ఖానోజీరావు.

"ఏమిటి అంత గొప్ప విశేషం ?" అన్నాడు రమణ మూర్తి.

"హుష్ !" అన్నాడు ఖానోజీరావు. అతనా ఇద్దర్నీ సమీపించి–"మేనక బంగళాలో పదిగంటల ప్రాంతంలో ఒక హత్య జరిగింది...." అన్నాడు.

"ఆఁ" అన్నాడు ధర్మారావు. భయంతో అతని శరీరం వణక సాగింది.

"మీరేమీ భయపడకండి ధర్మారావు గారూ – నేను మిమ్మల్ని ఇక్కడికి భయపెట్టడానికి రాలేదు. తెలిసిన వాడుగా సలహా ఇవ్వడానికి వచ్చాను. ఆ బంగళాలోంచి మీ తమ్ముడు శంకర్రావు పదింపావు సమయంలో బయటకు వస్తూండగా మీరు చూశానన్నారు. ఈ విషయాన్ని నేను రహస్యంగా ఉంచుతాను. మీరూ రహస్యంగా ఉంచాలి. మా పరిశోధనకు అది ముఖ్యమైన విషయం కానంతవరకూ ఫరవాలేదు. అయితే మాత్రం నేను మీకు సాయపడలేను. ఇది చెప్పడానికే వచ్చాను–" అని వెళ్ళి పోయాడు ఖానోజీరావు.

ధర్మారావు, రమణమూర్తి నోట మాట రాక ఒకరి వంక ఒకరు చూస్తూ అలా నిలబడి పోయారు.

# 3

ధర్మారావు తిరిగివెళ్ళేటప్పుడు మేనక బంగళా మీంచే వెళ్ళాడు.

మేనక బంగళా దగ్గర చాలా హడావుడిగా ఉంది. ఇంటిముందు పోలీసులున్నారు.

"ఏం జరిగింది ?" - ధర్మారావు గేటుదగ్గర ఒక వ్యక్తిని ప్రశ్నించాడు

"హత్య !" అన్నాడావ్యక్తి.

"ఎవరు ఎవరిని చంపారు ?"-ధర్మారావు మళ్ళీ అడిగాడు.

"చచ్చిందెవరో తెలియదు. చంపిందెవరో తెలియదు ...." అన్నాడావ్యక్తి.

"మేనక ఇంట్లో మేనకకు తెలియని మనుషులుంటారా ?"-ధర్మారావు మళ్ళీ అడిగాడు.

"అసలు మేనక ఊళ్ళోలేందే-ఆవిడ బొంబాయిలో ఉన్నదట - అర్జంటుగా బయల్దేరి రమ్మనమని ఆమెకు టెలిగ్రాం ఇచ్చారట-"

ధర్మారావు అక్కడున్న వారినడిగి హత్యగురించిన సమాచారం చాలా సేకరించాడు.

మేనక ప్రస్తుతం ఊళ్ళోలేదట. ఇంటికి వేరే కాపలా మనిషి లేడట.

హతుడాయింట్లో ఎలా ప్రవేశించాడో తెలియదు.

హంతకుడక్కడికి ఎందుకు వెళ్ళాడో తెలియదు. ఉదయం పోస్టుమన్ ఉత్తరాలివ్వడానికి వెడితే ఆశ్చర్యంగా తలుపులు బార్లాతీసి ఉన్నాయట. ఎదురుగా శవం కన్పిస్తున్నదట. అతడు కేకలు పెట్టగా నలుగురూ పోగయ్యారు. తర్వాత పోలీసులు వచ్చారు.

హంతకుడు మేనకకు బాగా తెలిసిన వాడయుంటాడనీ అతను ఈ ఇంటి రహస్యంకూడా తెలిసినవాడయుంటాడనీ పోలీసులు భావిస్తున్నారు. ఇప్పుడందర్నీ వేధిస్తున్న సమస్య లేమిటంటే - హతుడెవరు? హంతకుడెవరు? హత్య ఎలా జరిగింది?

ధర్మారావు అక్కడ ఆగలేదు. అతడి మనసు అల్లకల్లోలంగా ఉన్నది. హతుడు, హంతకుడు ఎవరో తెలిసి ఉంటే అతను స్వేచ్ఛగా ఊపిరిపీల్చుకుని ఉండేవాడు. కానీ ఇప్పుడు హంతకుడింకా తెలియదు. అంటే అనుమానితుల జాబితా ఒకటి తయారవుతుంది. ఆ జాబితాలో తమ్ముడిపేరు కూడా ఉంటుంది.

ధర్మారావు ఇంటికి వెళ్ళేసరికి అతను ఆశ్చర్యపోయే విధంగా అక్కడ శంకర్రావు ఉన్నాడు. తమ్ముణ్ణి చూస్తూనే అతడికి చాలా సంతోషంగా ఉంది.

"ఎక్కడికెళ్ళావ్-పొద్దున!" అని అడిగాడు ధర్మారావు.

"ఓస్నేహితుడింటికి-"అన్నాడు శంకర్రావు.

"ఎవరా స్నేహితుడు?" అనడిగాడు ధర్మారావు.

శంకర్రావు మాట్లాడలేదు.

"ఇలారా"-అన్నాడు ధర్మారావు. శంకర్రావు అన్నను సమీపించాక తన స్వరం తగ్గించి-''ఉదయం పదింపావుకు

నిన్ను మేనక బంగళానుంచి బయటకు వస్తూండగా చూశాను. అక్కడేంపని నీకు ?" అన్నాడు ధర్మారావు.

"నేనా ? మేనక బంగళా లోంచా ? అసలు నేనా ప్రాంతాల సంచరించందే-ఎవర్నిచూసి ఎవరనుకున్నావో నువ్వు !" అన్నాడు శంకర్రావు. తలని ముఖం చూస్తుంటే అబద్ధం చెపుతున్నాడనిపించలేదు.

"నా కళ్ళారా చూశాను. నువ్వే. అందులో సందేహం లేదు-" అన్నాడు ధర్మారావు.

"భలేవాడివే-అక్కడ నాకేం పని ?" అన్నాడు శంకర్రావు నవ్వుతూ.

తమ్ముడి నవ్వు చూస్తూంటే అతన్ని అనుమానించాలని పించలేదు ధర్మారావుకి. అయితే తనకళ్ళు తననే మోసం చేస్తాయా ?

"అలా తేలిగ్గా నవ్వేయకు. మేనక బంగళాలో ఆ సమయంలోనే ఒక హత్య కూడా జరిగింది -" అన్నాడు ధర్మారావు.

శంకర్రావు ఆశ్చర్యంగా-"హత్యా ! మేనక బంగళాలోనా ? కొంపదీసి ఎవరైనా మేనకను చంపేయ లేదుగదా-" అన్నాడు.

ధర్మారావుకేం మాట్లాడాలో తోచలేదు. తమ్ముడి వాటం చూస్తే అసలు ఏ విషయమూ తెలియనట్లుంది. ఒకవేళ అతను వెళ్ళిన సమయానికింకా హత్య జరుగ లేదేమో ? ఆ సంగతి తర్వాత ఆలోచించవచ్చు. అసలు తమ్ముడికా బంగళాలో ఉన్న పనేమిటి ?

"నీకు నిజంగా తెలియదా ?" అన్నాడు ధర్మారావు కోపంగా.

"అదేంటన్నయ్యా అలా మాట్లాడతావు ? మేనక బంగళాలో హత్య జరిగితే ఉదయం నుంచీ ఆ ప్రాంతాలైనా మసలనివాడిని-నాకేం తెలుస్తుంది ?" - అన్నాడు శంకర్రావు.

తమ్ముడు చెప్పింది నిజమే-అయితే అతను నిజంగా మేనక బంగళాకు వెళ్ళలేదా ?

# 4

"మీ తమ్ముడి వేలిముద్రలు కావాలి।" అన్నాడు భానోజీరావు ధర్మారావుతో.

"అంటే మీరు నా తమ్ముణ్ణి అనుమానిస్తున్నారా ?" అన్నాడు ధర్మారావు.

" లేదు. ఇది కేవలం నా రహస్యపరిశోధన కోసం మాత్రమే. ప్రస్తుతం కేసు చాలా గజిబిజిగా ఉంది. హతుడెవరో తెలియదు. అతడు మేనక బంగళాకెందుకు వచ్చాడో తెలియడం లేదు బంగళాలో మేనక లేదు. బొంబాయిలో ఆమె వేరెడ్రెస్ తెలియడం లేదు. చని పోయేముందు హతుడు హంతకుడితో పెనుగులాడాడు. అక్కడ చాలా ప్రాంతాల్లో రెండురకాల వేలిముద్రలు వున్నాయి. ఒకటి హతుడివి. రెండోవి హంతకుడివ యుండాలి. అనుమానితుల జాబితా నుంచి మీ తమ్ముణ్ని పూర్తిగా తొలగించడానికిదొక్కటే ఉపాయం."

పైకి అనలేదు కానీధర్మారావు మనసులో బెరుకుగానే ఉంది. కొంపదీసి ఆ వేలిముద్రలు తమ్ముడివే అయితే?

అయితే .... వాడే హంతకుడౌతాడు।

ధర్మారావు శరీరం భయంతో వణికింది. ఏది ఏమైనా వాడొక ఊబిలో ఇరుక్కున్నాడు. అందులోంచి బయట పడడం కష్టం. తనకు చేతనైనంత వరకూ పోలీసులకు సహకరించక తప్పదు. తమ్ముడు నిర్దోషి అయితే భగవంతుడే వాణ్ని రక్షిస్తాడు.

ఖానోజీరావు వెళ్ళిపోయాక ధర్మారావు చాలాసేపు తమ్ముడి గురించి ఆలోచించాడు.

ఆ రాత్రి ఎనిమిది గంటల ప్రాంతాన శంకర్రావు ఇంటికి వచ్చాడు.

"ఎక్కణ్నుంచి వస్తున్నావ్?" అనడిగాడు ధర్మారావు.

శంకర్రావు అదోలా నవ్వి- "స్నేహితుడి ఇంటి నుంచి-" అన్నాడు.

''ఒరేయ్ శంకరం- నీకేదో ఇబ్బంది వచ్చిందన్నావ్ అదేమిటో చెప్పకూడదురా...." అన్నాడు ధర్మారావు.

"అవినీకు చెప్పుకునే ఇబ్బంది కాదన్నయ్యా అందుకు నాపాట్లేవో నే పడుతూనే ఉన్నాను. ఒకటి రెండు రోజుల్లో అన్ని సమస్యలూ తీరిపోతాయి నాకు-" అన్నాడు శంకర్రావు.

తమ్ముడి మాటల్లో అపశకునం ధ్వనించింది ధర్మా రావుకు. అతనింక శంకర్రావుతో మాట్లాడకుండా ఊరు కున్నాడు. ఖానోజీరావు చెప్పిన సూచనలు దృష్టిలో ఉంచుకుని తమ్ముడు మంచినీళ్ళు తాగిన గ్లాసు ఒకటి జాగ్రత్తచేసి మర్నాటికి దాన్ని-ఇన్‌స్పెక్టర్‌కి అందిం చాడు.

"మీరీవిధంగా నాకు సహకరించడంవల్ల మీతమ్ముడి పేరు బయట పెట్టకుండానే నాపరిశోధన కొనసాగించ

గల్గుతున్నాను....” అన్నాడు భానోజీరావు ధర్మారావును మెచ్చుకుంటూ.

“నాతమ్ముడు నిర్దోషి అవి తెలుసుకోడానికి ఎంత కాలం పడుతుంది.?” అన్నాడు ధర్మారావు.

“సాయంత్రనికల్లా చెప్పేస్తాను....” అన్నాడు భానోజీ రావు.

ధర్మారావు అసంతృప్తిగా ఇంటికి వెళ్ళిపోయాడు. అతనికి బొత్తిగా సమయం గడవడంలేదు. అవి వేసంగి సెలవులు కావడంవల్లపోనీ కాలేజీకి వెళదామనుకుందు కూలేదు. ఎలాగో బిగబట్టుకుని కూర్చున్నాడు. భర్త రోజంతా అదోరకంగా ఉండడం గమనించిన శాంత కారణమేమిటని అడిగింది కానీ ధర్మారావు ఆమెకేమీ చెప్పలేదు.

సాయంత్రం నాలుగుగంటలకు ఉండబట్టలేక ధర్మా రావు తనే బయల్దేర బోయాడుకానీ–అతనికి గుమ్మంలోనే రమణమూర్తి ఎదురయ్యాడు. అతని ముఖంలో చాలా కంగారు కనబడుతోంది.

“ఏమిటిలా వచ్చావ్ ?”–అన్నాడు ధర్మారావు ఆత్రు తగా.

‘భానోజీరావు నాకు కబురు చేశాడు....’ అన్నాడు రమణమూర్తి.

‘ఏమని ?’–అన్నాడు ధర్మారావు రెట్టించిన కంగారుతో.

‘అర్జంటుగా నిన్ను తీసుకు రమ్మనమని....’

ధర్మారావు మనసు కీడును శంకించింది. ఆ వేలి ముద్రలు తప్పక శంకర్రావువే అయుంటాయి. అందుకే అతను తనకోసం కబురు పంపించాడు–ఇప్పుడేం చేయాలి?

'ఎందుకో నీకు వివరం చెప్పాడా?' అన్నాడు ధర్మా రావు.

'లేదు. మనిద్దర్నీ కలిసి రమ్మన్నాడు....చాలా ముఖ్యమైన విషయం చర్చించాలట....'

ధర్మారావు కళ్ళు తిరిగాయి. నెమ్మదిగా-'సరేపద!' అన్నాడు.

ఇద్దరూ భానోజీరావు ఇంటికి వెళ్ళారు.

వీళ్ళిద్దరూ తన పర్సనల్ గదికి రాగానే గది తలుపులు వేశాడు భానోజీరావు. ధర్మారావు అతనివంక ఆత్రుతగా చూశాడు.

'నాకిప్పుడు విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. జరిగిం దానికి సంతోషించాలో, విచారించాలో తెలియడం లేదు. ఆవేలి ముద్రలు మీతమ్ముడివే!' అన్నాడు భానోజీరావు.

"ఏం వేలిముద్రలు?" అన్నాడు రమణమూర్తి.

భానోజీరావు వివరంగా కథ చెప్పాడు. రమణ మూర్తి తెల్ల ముఖం వేశాడు. ధర్మారావు ఉన్నవాడున్న పళంగా చతికిలబడి పోయాడు.

"ఆరోజు మీ తమ్ముణ్ణి మేనక బంగళాలోంచి వస్తూం డగా మీరు చూసి ఉండకపోతే హంతకుడి ఆచూకీ మాకు తెలిసే అవకాశం ఉన్నట్లు లేదు. మీకు తెలియకుండానే మీరు నాకు సహకరించారు...." అన్నాడు భానోజీరావు.

ధర్మారావుకు భానోజీరావుకు ఇదివరలో తను చదరం గం విషయంలో సాయపడ్డట్లు గుర్తుకువచ్చింది. హత్య కేసు సాధించినఘనత భానోజీరావుకు దక్కుతుంది కానీ తను తోడబుట్టిన వాణ్ణి కోల్పోతున్నాడు. విషయం తనకు

ఏ మాత్రం ముందుగా తెలిసినా ఎంతో జాగ్రత్తపడి ఉండేవాడు.

"చూస్తూ చూస్తూ హంతకుణ్ని దాచలేరు గదా-ఎంత రక్తసంబంధమైనా సరే-నేరాల దగ్గర మరిచి పోవడం మంచి పౌరుల బాధ్యత-" అన్నాడు భానోజీరావు.

"అయితే నాతమ్ముడే హంతకుడని రూఢి చేశారా?" అన్నాడు ధర్మారావు.

"అంతే అయుండాలి మరి! కాని పక్షంలో హత్య గురించిన అపూర్వ రహస్య మేదైనా తెలిసైనా ఉండాలి...." అన్నాడు భానోజీరావు.

"రెండోదే నిజమయ్యుంటే బాగుండును..."అన్నాడు ధర్మారావు.

"అదే నిజమైతే నేనూ సంతోషిస్తాను. మన మంతా ఒక పర్యాయం మీ తమ్ముణ్ని కలుసుకుని మాట్లాడాలి. అతని చేత అసలు విషయం చెప్పించాలి.... ఈ రాత్రికి మీ యింట్లో సమావేశ మౌదామా? నేను యూనిఫాం లేకుండా వస్తాను. నేనెవరో ఇంట్లో చెప్పవద్దు-" అన్నాడు భానోజీరావు.

ఆ సమయంలో భానోజీరావు దేవుడని పించింది ధర్మారావుకు.

# 5

"మీరంతా నన్నెందు కనుమానిస్తున్నారో తెలియదు. నేను అమాయకుణ్ని-" అన్నాడు శంకర్రావు.

"బుకాయించడానికి ప్రయత్నించవద్దు. ఆ భగవంతుడే దిగి వచ్చినా నిన్నిప్పుడు రక్షించలేడు. నువ్వు అమాయకుడివే అయితే ఏ కారణంగా మేనక బంగళాకు వెళ్ళావో అక్కడ నువ్వేమి చూశావో నాకు చెప్పాలి-" అన్నాడు భానోజీరావు.

''నేను మేనక బంగళాకు వెళ్ళాననడానికీ, హత్య చేశాననడానికీ మీకు సాక్ష్యాధారాలున్నాయి కదూ ?'' అన్నాడు శంకర్రావు.

''ఉన్నాయి-'' అన్నాడు భానోజీరావు.

''అయితే ఇంకేం-నన్నరెస్టు చేయండి. నేనే హంతకుణ్ని !" అన్నాడు శంకర్రావు.

ముగ్గురూ తెల్లబోయారు. ధర్మారావు కంగారుగా - "ఒరేయ్ శంకరం-నువ్వేం మాట్లాడుతున్నావో, ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా ? ఒక పోలీస్ ఇన్‌స్పెక్టరు ముందు అనాలోచితంగా నేరస్తుణ్ణని అన్నావంటే నీ పీకెకు చుట్టుకునేది ఉరితాడేరా-" అన్నాడు.

'' తిరుగులేని ఆధారాలున్నపుడు ఏం చెప్పి నన్ను రక్షించుకో గలను ? ఇందులో ఆలోచించాల్సినదేముంది? నేనే హంతకుణ్ని !'' అన్నాడు శంకర్రావు.

''భానోజీరావుగారూ - వాడి మాటలు నమ్మకండి - వాటం చూస్తుంటే వీడికి మతి పోయినట్లుంది-" అన్నాడు ధర్మారావు కంగారుగా.

''మీ తమ్ముడికి మతి పోలేదు ధర్మారావు గారూ— చాలా తెలివిగా ప్రవర్తిస్తున్నాడు. ఇతను తప్పక హంతకుడేనని నాకు నమ్మకంఏర్పడుతోంది. మీలాంటి వారికిటువంటి తమ్ముడుంటాడని నేనూహించలేదు"-అన్నాడు భానోజీ

రావు.

"ఒకే మాట-నువ్వు హంతకుడివే అయితే ఈ హత్య ఎందుకు చేశావో చెప్పు..." అన్నాడు ధర్మారావు దీనంగా. అతనింకా ఈ నిజాన్ని తట్టుకోలేక పోతున్నాడు.

"చెబితే శిక్ష తగ్గిస్తారా?" అన్నాడు శంకర్రావు చిరాగ్గా.

"తగ్గించినా తగ్గించక పోయినా చెప్పక తప్పదు...." అన్నాడు భూపోజీరావు.

శంకర్రావు గొంతు సవరించుకుని - "గత అయిదు సంవత్సరాలుగా నేను చేస్తున్న వ్యాపారంలో భాగస్థుడు సుందరయ్య. అతన్ని నేను పూర్తిగా నమ్మాను. వ్యాపారం బాగానే నడుస్తున్నదనుకున్నాను. ఎప్పటి కప్పుడు నష్టం చూపిస్తూ వచ్చాడు సుందరయ్య. వాడి పరిస్థితి కూడా మరీ అంత మెరుగ్గా లేకపోవడం వల్ల నేను వాడి మాటలు నమ్మాను. నూనెలు, పప్పులు, ధాన్యాలు, పళ్ళు-టోకున కొని లారీలో ఇతర రాష్ట్రా లకు ఎగుమతి చేస్తుండేవాళ్ళం మేము. ఎప్పటికో అప్ప టికి ఈ వ్యాపారం మమ్మల్ని గొప్పవాళ్ళని చేస్తుందను కున్నాం.

నలభై వేలకు ఓస్వంతలారీ కొన్నాం. అది సెకండ్ హేండ్ దే కానీ బండికొత్తగానే ఉంది. పదివేలు ముందు కట్టి మిగతాడబ్బు వాయిదాల పద్ధతిమీద కట్టాలనుకున్నాం. కానీ ప్రయాణంలో దుండగుల దాడి వల్ల ఆ లారీ దగ్ధమై పోయింది. ఆ లారీ పోయింది.

దాన్ని గురించి కట్టాల్సిన ముప్పైవేల బాకీ అలాగే ఉండిపోయింది. ఇన్సూరెన్సు కంపెనీ నుంచి నష్టం

రాబడదామని నేను సుందరయ్యతో అన్నాను. అప్పుడు వాడు - అది దొంగలారీ అనీ అందుకే నలభై వేలకు కొనగలిగామనీ చెప్పాడు. నా గుండె ఆగిపోయింది. నన్ను దిగులు ఆవహించింది. సుందరయ్యను పూర్తిగా నమ్మితే, వాడిమీద ఆధారపడితే - నేనింకా సర్వనాశనమై పోతాననిపించింది. లారీబాకీ తీర్చడానికి మా ఇద్దరిదగ్గరా డబ్బులేదు. నేను అన్నయ్యనడిగితే ఇస్తాడు కానీ ఈ తెలివితక్కువ తనానికి అంతమేమిటి? ఈ విషయంలో బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావాలనుకున్నాను.

ఈలోగా అనుకోకుండా ఒకరోజున రోడ్డుమీద ఒక అమ్మాయిని కారు క్రింద పడకుండా రక్షించాను. ఆమె పేరు మేనక అని చెప్పింది. ఊళ్ళో పేరుకెక్కిన కాబరే నర్తకి మేనక ఆమెయే! ఆమె నాగురించి వివరాలడిగి తెలుసుకుని సుందరయ్య భాగస్థుణ్ణని తెలియగానే ముక్కుమీద వేలేసుకుంది. ఆ జూదగాడితో కలిసి వ్యాపారానికెందుకు దిగారని దెబ్బలాడింది. ఆమె చెప్పిందాన్ని బట్టి చూస్తే సుందరయ్య రహస్యపరుడు. వేలకు వేలు క్లబ్బుల్లో తగలేస్తాడు. అకారణంగానే అతనిఇల్లాఇల్లాలూ ఇబ్బందుల్లో ఉండడం జరుగుతోంది.

ఆమె చెబుతున్న వన్నీ నిజాలని తెలుసుకుంటానికి నాకెంతో కాలం పట్టలేదు. వ్యాపారంలో బ్రహ్మాండమైన లాభాలు వస్తూంటే వాడవి తనవ్యసనాలకుపయోగించుకొంటూ నష్టం వచ్చిందని నన్నుమోసం చేస్తున్నాడు. అఖరికి లారీవ్యవహారం కూడా అబద్ధమే! అదివాడు లాభానికి ఇంకొకరికి అమ్మేసుకొని నాతో అలా చెప్పాడు. ఇందులో తప్పంతా నాదే! ఒక్క విషయం

కూడ పట్టించుకోకుండా నేను అంతా సుందరయ్యకు వదలి పెట్టాను. అందుకు నాకు తగినశాస్తి జరిగింది. అందుకే నేనువాణ్ణిక్కన్న చంపేశాను"..అన్నాడుశంకర్రావు.

ఈ కథను అక్కడున్న ముగ్గురు ఎంతో ఆసక్తిగా విన్నారు. తమ్ముడి ముగింపు వాక్యం మాత్రం ధర్మారావుకు నచ్చలేదు 'అబద్దమాడకు. నువ్వువాణ్ణి చంపలేదు. హత్య చేయడం నీ వల్లకాదు.' అన్నాడు గట్టిగా।

"నా మీద నీకున్న నమ్మకానికి థ్యాంక్సన్నయ్యా. నన్ను ఇంత ఉరితీసినా నాకు బెంగ లేదు." అన్నాడు శంకర్రావు.

"నీ కథ బాగానే ఉంది కానీ నువ్వు సుందరయ్యను మేనక బంగళాలో ఎందుకు హత్య చేశావ్?" అన్నాడు భానోజీరావు.

"సుందరయ్య మేనకకు కస్టమర్. అతని నుంచి ఆమె చాలా డబ్బు సంపాదించింది. నేనేమో మేనక ప్రాణాలు రక్షించిన వాణ్ని. మా ఇద్దరికీ మేనక సామరస్యం కుదుర్చుతానన్నది. ఆమె చెప్పిన సమయానికి నేనా ఇంటికి వెళ్ళాను. తలుపులు బార్లాతీసి ఉన్నాయి......."

ధర్మారావు మధ్యలో కలగజేసుకుని- "అప్పటికే అక్కడ సుందరయ్య చచ్చిపడి ఉన్నాడు. ఆ దృశ్యం చూసి కంగారుపడి నువ్వక్కణ్నించి బయటకు వచ్చేశావు. అవునా?" అన్నాడు.

"లేదు అక్కడ సుందరయ్య ఉన్నాడు. వాడికీ నాకూ మాటామాటా పెరిగింది. గొడవయింది. ఆవేశంతో నేను అక్కడ అందుబాటులో ఉన్న కత్తి తీసుకుని వాడి

గుండెల్లో పొడిచేశాను.....'' అన్నాడు శంకర్రావు.

"అబద్ధం-" అన్నాడు ధర్మారావు.

"సారీ అన్నయ్యా! ఇదే నిజం-" అన్నాడు శంకర్రావు.

"ఇతను నిజమే చెబుతున్నాడు. అక్కడ చాలా ప్రాంతాల్లో ఇతని వేలిముద్రలున్నాయి-" అన్నాడు భానోజీరావు. తర్వాత నెమ్మదిగా-"అయితే హత్యాయుధా న్నేంచేశావ్?" అన్నాడు.

"అన్ రిజిస్టర్డ్ పార్సిల్ క్రింద నోటికొచ్చిన పేరు రాసి లక్నోకు పోస్టు చేశాను...."

"లక్నోకా! అక్కడెవరున్నారు?" అన్నాడు భానోజీరావు ఆశ్చర్యంగా.

"ఎవరో ఉన్నారని కాదు. ఏమైనా దూరప్రాంతాలకు పంపాలనిపించింది. ఆ సమయంలో లక్నో పేరు గుర్తుకొచ్చింది. రాశాను. లక్నోలో నవాబు లెక్కువుంటారని విన్నాను. అందుకని నవాబ్ సయ్యద్ ఆలీ అని నోటికొచ్చిన పేరు కూడా రాశాను. అడ్రసులో తోచిన ఇంటి నంబర్ వేసి ముంతాజ్ బేగం స్ట్రీట్ అని రాశాను...." అన్నాడు శంకర్రావు.

ధర్మారావు ఆశ్చర్యంగా తమ్ముడి వంక చూస్తున్నాడు. శంకర్రావు అంత నిబ్బరంగా ఎలా మాట్లాడగలుగుతున్నాడో అతనికి అర్థం కాలేదు.

"మిస్టర్ శంకర్రావ్! నీ గుండెనిబ్బ రాన్ని అభినందించకుండా ఉండలేను కానీ-ఇది వాస్తవ జీవితమని గుర్తుచేయకుండా ఉండలేక పోతున్నాను. ఏదో పాత్రను నటిస్తున్నట్లు చాలా ధైర్యంగా ఉన్నావు. మరి కాసేపట్లో నీ చేతులకు బేడీలు పడతాయి ...." అన్నాడు

భానోజీరావు.

శంకర్రావు తడబడి-"ఇది గుండె విభ్రమం కాదు సార్! అరే ముందు వెలుగుతున్న దీపపు వెలుగు. మేక పోతు గాంభీర్యం-"అన్నాడు.

"మేనక పిలవగా వెళ్ళావ్ గదా-మేనకను కలుసు కోలేదా?" అన్నాడు భానోజీరావు.

"ఇంకెక్కడి మేనక ?- ఆమె హత్య చేయబడిం దిగా?"- అన్నాడు శంకర్రావు.

"మేనక హత్య చేయబడిందా?"-ఉలిక్కిపడి అడి గాడు భానోజీరావు.

"సుందరయ్యను నేను చంపడానికి అదే కారణం. వాడు తనే మేనకను చంపేశానని చెప్పాడు. తన సంగతి ఆమె నాకు చెప్పేసిందని వాడికి వళ్ళు మండిపోయిందట. ఆ ఆవేశంలో ఆమెను ఎలా చిత్రహింసలు పెట్టి చంపాడో చెబుతూంటే నాకు వీరావేశం వచ్చింది. ఆ ఊపులో వాణ్ణి చంపేశాను"

భానోజీరావు ఆశ్చర్యంగా-"ఇదో కొత్త విషయం- ఇంకో హత్య సంగతి తెలిసింది. సుందరయ్య నువ్వు గానీ ఇంకేమైనా హత్యలు చేశారా?" అన్నాడు.

"నేనింకేమీ హత్యలు చేయలేదుకానీ సుందరయ్య మాత్రం మాటల సందర్భంలో తను మేనకనే కాక ఆమెప్రియుడు హ ర నా ధ్ ను కూ డా చంపేశానని అన్నాడు...." అన్నాడు శంకర్రావు.

"హరనాథ్ ఎవరు ?" అన్నాడు భానోజీరావు కంగా రుగా. హఠాత్తుగా కేసు కొత్తపుంతలు తొక్కుతున్నదని అతనికి అనిపించింది.

"నాకూ తెలియదు. సుందరయ్య చెప్పిందాన్ని బట్టి మేనక ప్రియుడని తెలుస్తోంది-వాళ్ళిద్దరినీ ఎక్కడ చంపే శాడో కూడా నాకు తెలియదు.-"

"మిస్టర్ శంకర్రావ్! నువ్వు జరిగిన విశేషం సక్ర మంగా చెప్పడంలేదు. నిన్నరెస్ట్ చేసి లాకప్‌లో పెట్టి, అసలు కథంతా చెప్పించాల్సొచ్చేలా ఉంది-" అన్నాడు భానోజీరావు.

"అయ్యా-నేను రచయితనుకాదు. తెలివైనవాణ్ణి కాదు. మీరడిగిన ప్రశ్నలకు నాకు చేతనైనంతలో జవాబు లిచ్చాను. ఇప్పుడు చెప్పిందానికి మించి ఇంకేమీ నాకు తెలియదు...." అన్నాడు శంకర్రావు.

"భానోజీరావు! ఇతంతా రహస్య పరిశోధన. శంక ర్రావును అప్పుడే అరెస్ట్ చేయరు. అతన్ని బెయిల్‌మీద విడుదల చేశాననుకో-నేను నీకు హామీ!" అన్నాడు రమణమూర్తి.

"నేనుకూడా!" అన్నాడు ధర్మారావు.

'ఇంతవరకూ ఇది ఉత్తుత్తి కేసులాగే ఉంది-'' అన్నాడు భానోజీరావు.

ఆనాటికి విచారణ అక్కడితో ముగిసింది.

# 6

"ఎవరండీ మీరు?" అన్నాడు భానోజీరావు.

"మేనక బంగళాలో హత్య జరిగింది కాదండీ-ఆ హంతకుడి బంధువునండి-" అన్నాడా ఆగంతకుడు.

భానోజీరావు ఉలిక్కిపడి-"ఇన్నాళ్ళు ఏంచేస్తున్నారు?

హాతుడెవరో తెలియక కొట్టుకు చస్తున్నాం మేము-" అన్నాడు.

"నేనూ ళ్ళో లేనండి. ఈవేళే విషయం తెలిసి ఈ కేసు మీరు పరిశోధిస్తున్నారని తెలిసి ఇలా వచ్చానండి-" అన్నాడు ఆగంతకుడు.

"మీ పేరు ?"

"కృష్ణయ్యండి-" అన్నాడు ఆగంతకుడు.

"కృష్ణయ్యగారూ-హాతుడి గురించీ, అతడికీ మీకూ గల సంబంధం గురించీ ఒక్కముక్క పొల్లుపోకుండా నాకు చెప్పగలరా ?"

కృష్ణయ్య గొంతు సవరించుకుని-"హాతుడు భైరవ మూర్తి నాకు బాగా కావలసిన వాడండి"-అన్నాడు.

భానోజీరావు ఉలిక్కిపడి-"హాతుడి పేరేమిటన్నారు?" అన్నాడు.

"భైరవమూర్తి !" అన్నాడు కృష్ణయ్య.

"మై గాడ్ !" అనుకున్నాడు భానోజీరావు. కృష్ణయ్య చెప్పింది మరో హాతుడి గురించి కాదు గదా అని అతనికి అనుమానం వచ్చింది.

అయితే ఆ అనుమానం సరైనది కాదు. కృష్ణయ్య హాతుడి ఫోటోలను గుర్తు పట్టడమే కాక - హాతుడితో పాటు తను తీయించుకున్న కొన్ని ఫోటోలు కూడా తీసుకుని వచ్చాడు.

"సరే-మీ బంధుత్వం గురించి వివరంగా చెప్పండి-" అన్నాడు భానోజీరావు.

"చిన్న తనంలోనే భైరవమూర్తికి తల్లీ తండ్రీ పోయారు. నేను ఊళ్ళో దస్తావేజులు రాస్తే, వ్యవహ

రాలు చేసిపెట్టి మాట మంచితనంతో బ్రతుకుతున్నాను. వాడిని చేరదీసి చదువు చెప్పించాను. మా వూరి మునసబు గారి దగ్గర వాడి పై చదువుకోసం అప్పుకూడా చేశాను. వాడు పట్నంవెళ్ళి సంపాదన మొదలుపెట్టి వాడిగురించి నాకు అయిన అప్పులన్నీ తీర్చేశాడు.

నేను ఆజన్మ బ్రహ్మచారిని. ఓ రెండు సంవత్సరాల నుంచి వాడితో పాటే ఉంటున్నాను. చిన్నపట్నించీ నావంట నేనే చేసుకోవడం అలవాటు. భైరవమూర్తికి నేను వంటచేస్తూ, వ్యవహారాలన్నీ చూసిపెడుతూ తోడుగా ఉంటున్నాను. పది రోజులక్రితం నేను ఊరికి వెళ్ళాను. తిరిగి వచ్చేసరికి ఈఘోరం జరిగిపోయింది." అంటూ కళ్ళు తుడుచుకున్నాడు కృష్ణయ్య.

"ఈ ఘోరం గురించి మీ కెలా తెలిసింది?"

"ఇంట్లో పాతపేపర్లు పడిఉన్నాయి. వాటిలో రెండింట్లో మొదటి పేజీలో గుర్తుతెలియని శవం - అని భైరవ మూర్తి ఫోటో వేశారు. వెంటనే గుర్తు పట్టాను. కాళ్ళూ చేతులు ఆడలేదు. కాసేపటికి గుండె రాయి చేసుకుని వివరాలన్నీ చదివి మీ దగ్గరకు వచ్చాను...."

"చాలా మంచిపని చేశారు. భైరవమూర్తికి శంకర్రావు అనబడే మనిషితో పరిచయముందా ?"

"ఏమోబాబూ - నాకు వాడి స్నేహితులెవరూ తెలియదు. వాణ్ని మా వీధిలో వాళ్ళే చాలామంది ఎరుగరు. ఉదయం పోయి - ఎప్పుడో రాత్రి సమయంలో వస్తుంటాడు-"

భానోజీరావు సాలోచనగా తల పంకించి - "అసలు మీ వాడు ఏం చేస్తున్నాడు ?"-అన్నాడు.

"అదేం ఉద్యోగమో తెలియదు బాబూ-కానీ బాగా సంపాదిస్తున్నాడు. తను ప్రమాదకరమైన పనులు చేస్తున్నాడనీ, ఏ క్షణంలోనైనా ప్రాణం పోయే అవకాశమున్నదనీ తరచు అంటూండేవాడు. వాడికి ఎక్కడెక్కడ ఏమేం అకౌంట్లున్నాయో తెలియదు కానీ నా పేరున బ్యాంకులో మూడులక్షలదాకా వేశాడు-"

"ఏంచేస్తున్నావని మీరెప్పుడూ నిలదీసి అడగలేదా?"

"లేదు బాబు- వాడూ నేనూ కలిసి మాట్లాడుకునే అవకాశమే తక్కువ. ఎప్పుడైనా అడిగినా వాడు మాట తప్పించేసేవాడు-" అన్నాడు కృష్ణయ్య.

"కృష్ణయ్య గారూ- మీవాడికి సుందరయ్య అనే మరో పేరుందా?" అన్నాడు భానోజీరావు ఇంకా ఏదో ఆలోచిస్తూనే.

"భైరవమూర్తి ఒక్కటే వాడికున్న పేరు-" అన్నాడు కృష్ణయ్య.

భానోజీరావు నిట్టూర్చాడు. ఈ కేసు స్వరూప స్వభావాలు అంతుబట్టడంలేదు. శంకర్రావు చెప్పిన కథలో నిర్లక్ష్యం, హేళన అగబడుతున్నాయి. హంతకుడుగా నిరూపించబడతానన్న భయం అతనిలో గోచరించడం లేదు. పోనీ అతను అబద్ధం చెప్పాడా అనుకుందామంటే- అక్కడికి అతని వేలిముద్రలెలా వచ్చాయి? నిజం చెప్పాడనుకుందామంటే- సుందరయ్య, భైరవమూర్తి- ఒక్కరే అనుకోవాలి।

"మీరిక వెళ్ళవచ్చు...." అన్నాడు భానోజీరావు.

"భానోజీరావుగారూ - మీరు ఎలాగో హంతకుణ్ణి పట్టుకోవాలి. జీవితంపై నాకున్న మమకారానికి కారణం

భైరవమూర్తి ఒక్కడే. ఈ ప్రపంచంలో నాకింకెవ్వరూ లేరు. భైరవమూర్తిని చంపినవాడు ఉరికంబం ఎక్కే వరకూ నాకు మనశ్శాంతి లేదు....” అన్నాడు కృష్ణయ్య.

భానోజీరావు కళ్ళముందు ధర్మారావు మెదిలాడు. ధర్మారావు ఏమీ మాట్లాడడంలేదు కానీ తన తమ్ముణ్ని రక్షించమని అతడి కళ్ళు అర్థిస్తున్నాయి.

కృష్ణయ్య వెళ్ళిపోయాక- “రహస్య పరిశోధనే ఈ కేసును కాంప్లికేటెడ్ చేసింది. ఇంక శంకర్రావును అరెస్టుచేయక తప్పదు-” అనుకున్నాడు. అంతలోనే వివేకం అతన్ని హెచ్చరించింది. తనకు ఏ సమాచారం కావాలన్నా శంకర్రావు ఇస్తాడు. అతడి గురించి తనకు రమణమూర్తి, ధర్మారావు హామీ ఉన్నారు.

సుందరయ్య కుటుంబాన్ని కలుసుకోవాలి. శంకర్రావును ప్రశ్నించడంకంటే ఆ కుటుంబాన్ని ప్రశ్నించడం వల్లనే తనకు ఎక్కువ ప్రయోజన ముంటుంది.

భానోజీరావు మోటార్ సైకిల్ మీద శంకర్రావు ఇంటికి వెళ్ళి సుందరయ్య ఇంటి అడ్రస్ తీసుకొన్నాడు. అక్కణ్నించి తిన్నగా సుందరయ్య ఇంటికివెళ్ళాడు. ఇంటిముందు క్షణంఆగి నెమ్మదిగా వెళ్ళితలుపు తట్టాడు.

ముప్పై ఏళ్ళ అందమైన స్త్రీ వచ్చి తలుపుతీసింది. పోలీసు దుస్తుల్లో ఉన్న భానోజీరావును చూసి కంగారు పడి- “ఎవరి కోసమండీ?” అంది.

“సుందరయ్య గారికోసం-” అన్నాడు భానోజీరావు.

“ఆయనేమైనా తప్పు చేశారా?” అంది కంగారుగా ఆ స్త్రీ.

“మీరు సుందరయ్యగారి భార్యా!” అనడిగాడు

భానోజీరావు.

ఆమె తలాడించింది. భానోజీరావు ఆమె వంక జాలిగా చూసి- "ఆయనేమి తప్పుచేయలేదమ్మా, ఒక కేసు విషయంలో పరిశోధిస్తూ సమాచారం కోసం వచ్చాను." అన్నాడు.

"ఆయనూళ్ళోలే రండి" అంది సుందరయ్య భార్య.

"ఎప్పుడు వస్తారు?"

"బహుశా రేపు రావచ్చు-" అందామె.

"ఊరికెప్పుడు వెళ్ళారు?"

'మొన్న-" అందామె.

భానోజీరావు ఉలిక్కిపడి- "ఎప్పుడన్నారూ?" అన్నాడు.

"మొన్న!" రెట్టించిందామె.

"మైగాడ్!" అనుకున్నాడు భానోజీరావు. ఇదెలా సాధ్యం? శంకర్రావు తను సుందరయ్యను హత్య చేశానన్నాడు. ఆహత్య తొమ్మిదిరోజుల క్రితం జరిగింది.

భానోజీరావు తన జేబులోని హతుడి ఫొటోను ఆమెకు చూపించి "ఈ ఫోటో ఎవరిదో చెప్పగలరా! అన్నాడు.

ఆమె దాన్ని పరీక్షగా చూసి "నాకు తెలియదు" అంది.

"అంటే హతుడు సుందరయ్య కాదన్నమాట" అనుకున్నాడు భానోజీరావు. అతను సుందరయ్య భార్యనడిగి సుందరయ్య ఫోటో ఒకటి తీసుకున్నాడు. హతుడికీ, సుందరయ్యకు ఏమాత్రమూ పోలికలు లేవు.

# 7

"ఈ ఫోటో ఎవరిది?" భానోజీరావు తీవ్రంగా

అవిగాడు.

"సుందరయ్యది-" అన్నాడు. శంకర్రావు.

"మరి ఇతన్నేకదా నువ్వు చంపానన్నావు"

"అవును...."

"ఇతను చావలేదు. నిక్షేపంలా ఉన్నాడు..."

"హతుడు బ్రతికాడా?" అన్నాడు శంకర్రావు ఆశ్చ ర్యంగా.

"మిస్టర్ శంకర్రావ్! నువ్వు చట్టంతో ఆటలాడు తున్నావ్! నువ్వుచెప్పే సమాచారం ఒక్కటీ సరిగ్గాలేదు. మేనక బంగళాలో చచ్చినవాడు సుందరయ్యకాడు. భైరవమూర్తి!" అన్నాడు భానోజీరావు.

"భైరవమూర్తా? వాడెవరో నాకు తెలియదే!" అన్నాడు శంకర్రావు.

"నీకు తెలియకుండా ఎలా ఉంటుంది? అక్కడున్న వేలిముద్రలు వాడివీ, నీవీ మాత్రమే!"

"అవేమీ నాకు తెలియదు. నేనక్కడ సుందరయ్యను కలుసుకుని దెబ్బలాడి బైటకు వచ్చేశాను. ఆతర్వాత అక్కడేదో హత్య జరిగిందని తెలిసింది. సుందరయ్యే చచ్చి ఉంటాడనుకున్నాను. మీఅనుమానం నామీదకు రాగానే మర్యాదగా ఒప్పేసుకున్నాను..."

"మిస్టర్ శంకర్రావ్! థర్డ్‌డిగ్రీ మెథడ్స్ అంటే నీకు తెలుసా?"

"తెలుసు. వాటికి భయపడే నేను హంతకుడ్ని అని ఒప్పేసుకున్నాను. వాటికంటె చావేనయం. ఇప్పుడైనా సరే-ఈకేసులో నేనెలాగు అనుమానితుడ్ని. నావేలి ముద్రలు అక్కడున్నాయి. మీరేం చెప్పమంటే అలా

చెప్పేస్తాను. థర్డ్‌డిగ్రీ మెథడ్స్ గురించి మాత్రం నా దగ్గర మాట్లాడకండి-" అన్నాడు శంకర్రావు.

భానోజీరావుకు ఏడవాలో, నవ్వాలో తెలియలేదు. శంకర్రావు అమాయకుడో, అతి తెలివిపరుడో తెలియడం లేదు. అసలీకేసు ఏమిటి? హతుడు భైరవమూర్తి ఎవరు? అతనేం చేసేవాడు? మేనక బంగళాకతనెందుకు వెళ్ళాడు? అక్కడ అతన్ని ఎవరు ఎందుకు హత్య చేశాడు?

అప్పటికే అనుమానించవగ్గ మనిషి దొరికినా పై ప్రశ్నల్లో ఒక్కదానిక్కూడా సమాధానం దొరకడం లేదు. లోపం తన పరిశోధనలో ఉందా? తన మంచితనంలో ఉందా?

భానోజీరావు రమణమూర్తినీ, ధర్మారావునీ కలుసుకుని మాట్లాడి పరిస్థితి వివరంగా చెప్పి- "మీవాడు నాకు బొత్తిగా సహకరించడంలేదు. అరెస్టు చేయక తప్పే లాగున లేదు. ఒకసారి అరెస్టు చేశానంటే వ్యవహారం నాచేయి దాటిపోతుంది. అందుకే తటపటాయిస్తున్నాను..." అన్నాడు.

"మరికాస్త గడువివ్వండి. నేను వాడిచేత నిజం కక్కిస్తాను...." అన్నాడు ధర్మారావు.

# 8

"హలో!" అన్నాడు భానోజీరావు.

"నేనుసార్! మేనకను మాట్లాడుతున్నాను...."

భానోజీరావు తన చెవులు తనే నమ్మలేక పోయాడు.

''ఎవరూ?'' అన్నాడు మళ్ళీ.

''నేను సార్-కాబరేడాన్సర్ మేనక-మాఇంట్లో ఏదో హత్య జరిగించటగా - ఆ విషయంలో మీతో కొన్ని విషయాలు మాట్లాడాలనుకుంటున్నాను...రమ్మంటారా?''

''ష్యూర్. తప్పకుండా....తక్షణమే బయల్దేరిరండి-'' అన్నాడు భానోజీరావు. అవతల క్లిక్‌మన్న శబ్దం వినగానే రిసీవర్ని క్రేడిల్ చేసి తల పట్టుకున్నాడు. ఇప్పటిదాకా పని పోయిందనుకుంటున్న మేనక బ్రతికి కొచ్చింది. క్షణక్షణానికీ కేసులో మిస్టరీ పేరుకు పోతున్నది.

మేనక స్టేషన్లో అడుగు పెట్టగానే ఒక్కసారి సంచలనం కలిగింది. ఆమె వంటి నుండి మంచి పరిమళాలు రావడం మాత్రమే కాదు, ఆమె అలంకరణ కూడా అందుకు కారణం. కాబరే నర్తకి వేషంలోనే ఆమె అక్కడకు వచ్చింది. వేసుకున్న ఉడుపుల్లోంచి ఆమె శరీరపు రంగు ఇది అని ఖచ్చితంగా చెప్పవచ్చు. పోలీస్ స్టేషన్‌కు తన వంపు సొంపులన్ని ప్రదర్శించడానికి వచ్చిన మోడల్ గర్ల్‌లా వచ్చిందామె.

భానోజీరావు ఆమెను చూసి దృష్టి మరల్చుకోలేక పోయాడు. కళ్ళు చెదిరే అందం ఆమెది. అందులోనూ ఆ వయసు ఆడది ఆవిధంగా అవయవ ప్రదర్శన చేస్తుందని అతనూహించలేదు.

''నమస్తే!'' అంది మేనక చేతులు జోడించి. ఆమె వేషధారణ కాసంప్రదాయం నప్పలేదు.

''నమస్తే! అన్నాడు భానోజీరావు.

భానోజీరావు తాపీగా ఆమె చెప్పేవన్నీ విన్నాడు. తను

తక్కువ మాట్లాడి ఆమెను ఎక్కువమాట్లాడనిచ్చాడు.

మేనకకు భైరవమూర్తి తెలుసును. శంకర్రావు తెలుసును. సుందరయ్యకూడా తెలుసును, శంకర్రావు తనకు ప్రాణదాత అన్న విషయం మేనక అంగీకరించింది. శంకర్రావుకూ, సుందరయ్యకూ మనస్పర్థలు వచ్చాయని ఆ విషయంలో తాను సాయం చేయాలనుకున్నానని ఆమె చెప్పింది.

తన బంగళా కట్టించడానికి భైరవమూర్తి చాలా సాయం చేశాడనీ దాని రహస్యాలన్నీ అతనికి తెలుసుననీ ఆమె చెప్పింది. భైరవమూర్తి ఏం చేస్తున్నాడో తెలియదు కానీ రెండు చేతులా ఆర్జిస్తున్నాడనీ డబ్బు జల్సాగా ఖర్చుపెడతాడని ఆమె అన్నది. ఆమె చెప్పిన ప్రకారం అతను పగలొస్తే ఎవ్వరికీ కనిపించడు. అతని కార్య కలాపాలన్నీ రాత్రిళ్ళే జరుగుతుంటాయి. భైరవమూర్తికి మేనక అంటే చాలా ఇష్టం. ఆమె గురించి అతను చాలా డబ్బు ఖర్చు చేశాడు.

మేనక ఊళ్ళో ఉండని విషయం భైరవమూర్తికి తెలుసు. తన అంద చందాల కారణంగా మేనక ఆ ఊళ్ళో చాలా మంది ప్రముఖులకు పరిచితురాలు. ఆమె ఒక్కరోజు లేకపోతే కలవరపడి పోయేవారు చాలా మంది ఉన్నారు. అందువల్ల తనకు విశ్రాంతి కావాలను కున్నప్పుడల్లా మేనక బంగళాను భైరవమూర్తికి అప్ప జెప్పి తను బొంబాయి పేరు చెప్పి ఏఊటీకో, కాశ్మీర్ కో వెళ్ళి వస్తూంటుంది.

ఈ పర్యాయం ఆమె బెంగుళూర్ వెళ్ళింది. ఆమె అక్కడున్నట్లు సాక్ష్యాధారాలున్నాయి. హత్యకు సంబం

ధించినంతవరకూ ఆమెకు బలమైన ఎలిబీలున్నాయి.

భైరవమూర్తి హత్య ఎందుకు జరిగిందో, ఎవరు చేసి ఉంటారో మాత్రం మేనక చెప్పలేక పోయింది.

అంతా విని భానోజీరావు నిట్టూర్చాడు.

కేసు ఎక్కడ వేశావే గొంగళీ అన్నట్లుంది.

# 9

"శుభవార్త సార్ !" అన్నాడు కానిస్టేబులు రంగాచారి.

"ఏమిటది !"

"లక్నో నుంచి నవాబ్ సయ్యద్ అలీ పేరున పోస్టు చెయ్యబడ్డ పార్సిల్ సంపాదించుకు వచ్చాడు మనవాడు_" అన్నాడు రంగాచారి.

"ఈజిట్ !" అన్నాడు భానోజీరావు ఆశ్చర్యంగా. ఆ పార్సిల్ విషయంలో అతనికి నమ్మకం లేదు. శంకర్రావు చెప్పిన అనేక అబద్ధాలలో అదొకటి అనుకున్నాడు.

ఆ విషయం తనకు శంకర్రావు చెప్పినట్లు అతను రికార్డు చెయ్యలేదు. ఎవరో ఆకాశరామన్న ఫోన్ చేసి ఆ పార్సిల్ గురించి చెప్పినట్లుగా రాసుకుని_దాని విషయమై అన్వేషణ ప్రారంభించాడు. లక్నోలోని అన్ని పోస్టాఫీసులకీ ఆ పార్సిల్ గురించి తంతి పంపడం జరిగింది. తర్వాత తమ మనిషి దాని గురించి వెళ్ళాడు.

భానోజీరావు స్టేషన్‌కు వెళ్ళాడు. ఆ పార్సిల్‌ను చూశాడు. అడ్రసు శంకర్రావు చెప్పిన విధంగానే

ఉన్నది. భానోజీరావు అభినందన పూర్వకంగా అది సాధించుకు వచ్చిన మనిషివంక చూసి - జాగ్రత్తగా ఆ పార్సిల్ విప్పాడు.

అందులో ఒక కత్తి ఉన్నది. దానికి ఎండిన రక్తం ఉన్నది. ఆ కత్తి జాగ్రత్తగా పార్సిల్ చేయబడింది.

భానోజీరావు దాన్ని లాబరేటరీకి పంపించాడు. రిపోర్టు కోసం చాలా ఆత్రుతగా ఎదురు చూశాడు.

అది భైరవమూర్తిని హత్యచేయడానికి ఉపయోగించిన సాధనమే. సందేహంలేదు. దాని మీద వేలిముద్రలున్నాయి కానీఅవి మేనకఇంట్లో లభించిన రెండింటిలోనూ సరిపోలేదు. ఇవి మరోవ్యక్తివి!

ఎవరావ్యక్తి ?

భానోజీరావు ఆత్రుతగా తనకు అనుమానం ఉన్నవాళ్ళందరి వేలిముద్రలూ పరీక్షచేయించాడు. అవి ధర్మారావువి కాదు. కృష్ణయ్యవి కాదు. సుందరయ్యవి కాదు. మేనకవికాదు. మరెవరివి?

భానోజీరావు ఓపికకు అంతం సమీపించింది. తనకు అనుమానమున్న ప్రతి ఒక్కరినీ చావగొట్టి చెవులు మూసి నిజం కక్కించాలనుకున్నాడు. ఆ పనిచేసేముందు ఈ వేలిముద్రలు పాత నేరస్తులెవరిలోనైనా సరిపోతాయేమో చూడాలనుకున్నాడు. వేలిముద్రల ఫొటోలను ఏయే సంస్థలకు పంపాలో ఆదేశాలిచ్చి ఆలోచనలో పడ్డాడు భానోజీరావు.

# 10

"నువ్వు నిజంచెప్పకపోతే నీకళ్ళముందే మేమంతా విషంతిని చచ్చిపోతాం–" అన్నాడు ధర్మారావు.

"అన్నయ్యా–" అన్నాడు శంకర్రావు– "ఎలాచెప్పేది ఆ నిజం?"

"చెప్పద్దులే– మా చావు కళ్ళారాచూడాలని నువ్వను కుంటున్నావుగదా–" అందిశాంత.

'నా గురించి మీరు బెంగపెట్టుకోవద్దు. నా కేమీ ప్రమాదంలేదు. కానీ నన్నుమాత్రం నొక్కించి నిజాలు రాబట్టాలని ప్రయతించవద్దు. నాకుమేలు చేస్తున్నామనుకుని మీకుమీరు కీడు చేసుకున్నవారౌతారు."

"వీడితో మాట్లాడి లాభంలేదు. ముందునేను విషం మింగుతాను. ఇలాంటి తమ్ముడున్నందుకు ఇంతకు మించిన చావెలా వస్తుందిలే నాకు..." అన్నాడు ధర్మారావు.

శంకర్రావు ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా "–సరే అన్నయ్య– అన్నీ చెబుతాను. తర్వాత నీకు తోచినట్లు చేద్దువుగాని. ముందు వదిన్నీ, పిల్లలను బయటకు పంపించు–" అన్నాడు. ధర్మారావు అలాగే చేశాడు. గదిలో అన్నదమ్ము లిద్దరూ మిగిలారు.

"అతని అసలు పేరు నాకు తెలియదు. తన పేరు హరనాథ్ అనినాకు చెప్పాడు. నాకూ, సుందరయ్యకూ గొడవ వచ్చినప్పుడు మేనక మా సమస్య పరిష్కరిస్తాడని చెప్పినన్ను ఈ హరనాథ్ దగ్గరకు పంపింది. హరనాథ్ని నేను ఒకహోటల్లో కలుసుకున్నాను. హరనాథ్

నా కథవిని సుందరయ్యవల్ల డబ్బు పోగొట్టుకున్నందుకు నువ్వు విచారించవద్దు. నాకో చిన్నపని చేసిపెడితే, నీ సమస్య పరిష్కారం కావడమే కాకుండా నీకు లక్ష రూపాయలు వచ్చేలా చేస్తానన్నాడు. ఏమిటది అని అడిగాను.

"నువ్వో హత్యకేసులో ఇరుక్కోవాలన్నాడు. హంతకుడిగా అనుమానించ బడాలన్నాడు. ఆవిధంగా కొంత కాలం గడపాలన్నాడు. పోలీసులు ఎన్నిప్రశ్నలు వేసినా లొంగకుండా ఎలాగో తప్పుదారి పట్టించాలన్నాడు. వారి ఆలోచనలు తప్పుమార్గాన నడిపిస్తే కొంతకాలం తర్వాత ఆటోమేటిక్‌గా నేను విడుదలై పోతానన్నాడు. అతని ఈషరతుకు నేనంగీకరించలేదు. నన్ను రకరకాలుగా బెదిరించాడు. నేను లొంగలేదు.

"చివరి అస్త్రంగా దారుణమైన మాట అన్నాడు. అదే నన్ను అతడికి కట్టుబడేలా చేసింది. నెల్లాళ్ళుగా నేను దిగులుగా ఉండటానికదే కారణం. మీతో చెప్పుకోలేని విషయంకూడా అదే-" ఆగాడు శంకర్రావు.

"ఏమిటది ?"

"అతను నాకోఫొటో చూపించి-ఈమెకు ప్రపంచంలో ఏఆడది భరించలేని, సహించలేని ఘోరావమానం చేయిస్తే-నీకెలా ఉంటుంది ? అనడిగాడు. ఆఫొటో చూసి చలించిపోయాను. అది వదిన ఫొటో-" శంకర్రావు క్షణం ఆగి- "ఆదుర్మార్గుడు బట్టలు లేకుండా క్లబ్ డాన్సు చేయిస్తానన్నాడు. పదిమంది రౌడీ వెధవల్ని ఆమె మీదికి వదుల్తానన్నాడు. ఇంకా అనరానిమాటలు చాలా

అన్నాడు. రెండురోజులు వాడితో తిరిగాక వాడు అన్నంత పనీ చేయగల సమర్థుడని గ్రహించాను.

వాడీ ఊళ్ళోని నేరాలకు మకుటంలేని రాజు. వాడిలో ఎవరికీ ముఖాముఖీ పరిచయంలేదు. వాడి వ్యవహారాలన్నీ భైరవమూర్తి అనే వాడొకడు చూస్తున్నాడు. భైరవ మూర్తి ఊళ్ళోని ప్రముఖులందరికీ తెలుసు. కానీ తెలుసు నని ఎవ్వరూ ఒప్పుకోరు. ఊళ్ళో వాడు చట్టవిరుద్ధమైన పనులన్నీ చేస్తున్నాడు. వాడిని నడిపించేది హరనాథ్ అని ఎవ్వరికీ తెలియదు.

అతగాడి బెదిరింపుకు నేను లొంగిపోయాను. హత్య కేసులో ఇరుక్కున్నాక నన్నతడు రక్షిస్తాడో, లేదో తెలియదు. మన ఇంటి పరువుకోసం ఉరిస్కు తీసుకోవా లనుకున్నాను

అంతా నేననుకున్నట్లే జరిగింది. సమయానికి ఊళ్ళో లేకుండా కృష్ణయ్యనూ, మేనకనూ హరనాథే ఏదో ట్రిక్ చేసి పంపేసి ఉంటాడు. తను భైరవమూర్తిని హత్య చేపేశాడు. అదయ్యాక కత్తిని తీసి పార్సిలు చేశేసాడు. అవివరాలు నాకు చెప్పాడు .....” అన్నాడు శంకర్రావు.

ధర్మారావుకు ముచ్చెమటలు పోశాయి-“తమ్ముడూ- ఎంత ఘోరం జరిగిందిరా-నిన్ను తప్పుగా అర్థం చేసు కున్నానంరా.నువ్వు త్యాగమూర్తివిరా-” అన్నాడు.

“అది సరేనన్నయ్యా-హరనాథ్ గురించి తెలిసిన ఏకైక వ్యక్తి భైరవమూర్తి. అందుకే అతడివి చంపి అడ్డు తప్పించుకున్నాడు. అయితే ఏపరిస్థితుల్లోనూ నేను భైరవమూర్తివి ఎవరు ఎందుకు చంపారో చెప్పకూడదు. చెప్పానో-వదినకు ప్రమాదం తప్పదని ఖచ్చితంగా

చెప్పాడు హరనాథ్. వుందుకే ఈ అసలు కథను నేను భానోజీరావుకు చెప్పలేదు. ఈ పరిస్థితుల్లో నేనేం చేయాలో నువ్వేచెప్పు-" అన్నాడు శంకర్రావు.

సరిగ్గా అదే సమయానికి గదిలోకి భానోజీరావు అడుగుపెట్టాడు-"వెల్ మిస్టర్ శంకర్రావు. నావి పాము చేవులు. నువ్వు చెప్పిన కథంతా విన్నాను. సమయానికి రాగలగడం నా అదృష్టం. ఇంక నువ్వేమి భయపడ నవసరం లేదు. నీకూ, నీ వదినకూ ఏమి భయం లేదు. హంతకుడు హరనాథ్ ఈ ఊరికేకాదు - ప్రపంచానికే ముప్పు తేగలవాడు. అతను ఇంటర్నేషనల్ స్మగ్లర్. తను బయటపడకుండా భైరవమూర్తిని అడ్డుపెట్టుకుని ఘోరమైన నేరాలు చేశాడు. చివర్లో ఆ భైరవమూర్తినే అంతం చేసి అంతులేని సంపదకు ఏకైక వారసుడై తను స్విట్జర్లాండ్ వెళ్ళిపోతూ తనగురించి ఆలోచించే అవకాశమైనా లేకుండా మాకు చేయడం కోసం హత్య కేసులో విన్నిరికించి ముప్పు తిప్పలు పెట్టాడు మమ్మల్ని. మా రికార్డుల్లోకి నీ పేరు రానివ్వను, ప్రస్తుతానికి వాణ్ణి మేమేమీ చేయలేము. కానీ ఎప్పుడో ఒకప్పుడు వాడి పాపం పండక మానదు.''

"అంతా వినేశారా మీరు?'' అన్నాడు శంకర్రావు.

' విన్నాను కానీ విన్నది విన్నట్లే మరచిపోతాను. సరేనా? నేను హరనాథ్ గురించి వాకబు చేయగా అతగాడు పాతనేరస్థుడని, చాలా కాలంగా ఈ ఊళ్ళోనే ఉంటున్నాడనీ తెలిసింది. అన్ని ఎయిర్‌పోర్ట్స్ లోనూ ఎంక్వయిరీ చేయగా వారుముందుగా జర్మనీ అక్కడ్నించి స్విట్జర్లాండ్ వెళ్ళాడని తెలిసింది. ఇదంతా ఎలా జరిగిందో తెలుసు

కుందామని మీ ఇంటికి వస్తే నీ కథ వినిపించింది. అసలు జరిగిందేమిటో తెలిసింది."

అని భానోజీరావు క్షణం ఆగి "మన దేశంలోని పేదరికం, సెంటిమెంట్సు దేశప్రగతి కంటె నేరస్థులకు ఎక్కువగా సహకరిస్తున్నాయనిపిస్తోంది నాకు. ఏమంటారు ధర్మారావు గారూ?" అన్నాడు.

ధర్మారావు తమ్ముడి మంచితనం గురించి ఆలోచిస్తున్నాడు.

"ఏమనడానికీ ఏముంది? చదరంగంలో సలహా ఇచ్చే ముందు కాస్త ముందు వెనక ఆలోచించాలంటాను....." అన్నాడు ధర్మారావు.

అవునుమరి........ జీవితంకూడా చదరంగం వంటిదే. అంతరంగిక విషయాలు చర్చించేముందు ఎదుట ఉన్న మనుషుల పూర్వాపరాలు తెలుసుకుంటూ ఉండాలి.

(ఐపోయింది)

# స్నానాల గదిలో శవం ?

" సికిందర్ "

సేఠ్ గోకులదాస్ చట్నీ సేఫ్‌లో మాయమైన వడ్డాణం కేసు తాలూకు ఫైలు చదువుతున్న జాన్, గుమ్మం దగ్గర మాటలు వినిపించడంతో తలెత్తి చూశారు.

"హల్లో, గుడ్‌మార్నింగ్ ! హౌ ఆర్యూ, మిస్టర్ జాన్ ?"

అతనికి ముప్ఫై ఏళ్ళుంటాయి. సన్నగా, పొడుగ్గా వున్నాడు. తెల్లటి దుస్తులు ధరించి హాపీ - గో-లక్కీ ధోరణిలో వున్నాడు.

"ప్లీజ్, కమిన్" అన్నాడు జాన్.

అతను కొంగలా నడిచి వచ్చి, "మీ పార్టనర్ ఎక్కడ ?" అన్నాడు.

"లోపల బ్రెడ్ తింటున్నాడు." జాన్ అన్నాడు. ఆ తర్వాత రికార్డ్ రూం వేపు తిరిగి, " వాష్ యువర్

హౌ అంప్ కమప్రట్, లాల్ ?" అనర్చారు.

కాస్సేపయ్యాక లాల్ కర్చీఫ్‌తో ముఖం తుడుచు కుంటూ బయటకి వచ్చాడు.

"గుడ్మార్నింగ్, మిస్టర్ లాల్."

"మార్నింగ్."

"మిస్టర్ లాల్, నాకు ఆఫీసు టైం అవుతోంది. మీతో అత్యవసరంగా మాట్లాడ్దాని కొచ్చాను."

"మాట్లాడండి"

"మీరు నా భార్యను గాలించాలి."

లాల్ క్లయంట్ వేపు చూశారు. 'అల్ రైట్, మీ పేరు చెప్పండి?'

'నరేష్'

'మీ భార్య ఎప్పటి నుంచి కన్పించడం లేదు?'

'నిన్నటి నుంచి"

'నిన్న ఎప్పుడు? రాత్రా? పగలా?"

'నిన్న ఉదయం - లేచిచూస్తే ప్రక్కన లేదు"

'ఎన్ని గంటలకి?'

'అరు గంటలకు లేచాను. ఎప్పుడు వెళ్ళిందో తెలియదు."

'పోలీసులకి రిపోర్టు చేశారా?'

'లేదు'

'ఇంతకాలం ఎందుకాగారు?"

'ఆమె తిరిగి వస్తుందన్న ఆశతో - కానీ ఇప్పుడు లేదు'

'ఆమె వెళ్ళిపోవడానికి, కారణం తెలుసా?'

'మొన్న రాత్రి మేం వాదించుకున్నాం. తెల్లారి చూస్తే

లేదు. కిచెన్‌లో స్టవ్ మీద కాఫీ గిన్నె వుంది. ఆమె కాఫీ చేసుకుని తాగి మరీ వెళ్ళింది - నాకు చెప్పకుండా।"

'కాఫీ స్టవ్ మీద చేసిందా ?

'అవును"

'ఏ స్టవ్ ?'

'గ్యాస్ స్టవ్.''

'దాని శబ్దం మీకు వినిపించలేదా?''

''నేను మొద్దు నిద్ర పోతాను."

'ఎంత మొద్దునిద్ర?''

"చాలా మొద్దు నిద్ర. బకెటు నీళ్ళు గుమ్మరిస్తే గాని మెలుకువ రాదు."

"ఆమె బట్టలేవేనా తీసికెళ్ళిందా?''

'ఆమె వెళ్తున్నప్పుడు నేను చూడలేదు.'

"నా ఉద్దేశ్యం అది కాదు—ఇంట్లో ఆమె బట్టలు ఉన్నాయో, లేవో మీరు చూడలేదా।"

''చూసి వున్నా తెలుసుకోలేను. ఆమెకి చాలా బట్టలున్నాయి......... ఎన్ని తక్కువ వున్నాయో చెప్పలేను."

"ఆమె ఏ దుస్తుల్లో వెళ్ళిందో చెప్పగలరా ?"

''చెప్పలేను"

"ఆమె రాత్రి ఏ దుస్తుల్లో వుంది ?"

"నీలిరంగుచీర-అదేరంగు జాకెట్."

''ఆమెకు బంధువులున్నారా ?"

" ఇద్దరికీ వున్నారు. కానీ బంధువులంటే మా కసహ్యం."

"అంటే ఆమె వాళ్ళదగ్గరికి వెళ్ళలేదన్నమాట."

నరేష్ తలూపాడు.

"స్నేహితులు ?" మళ్ళీ అడిగాడు లాల్.

"విచారించాను-అక్కడికీ వెళ్ళలేదు"

'అయితే ఎక్కడికి వెళ్ళివుంటుందని మీ అనుమానం?'

"నా కనుమానాల్లేవు. ఆమె ఫలానా చోటికి వెళ్ళిందని నా కనుమానం వస్తే మీ దగ్గరి కెందుకొస్తాను ? మీకిచ్చే ఫీజుతో నా ఫ్రెండ్స్‌కి పార్టీ ఇస్తాను."

లాల్ తలతిప్పి జాన్‌ని చూశాడు.

జాన్ కాసేపు ఆలోచించి అడిగాడు.

'ఆమె వెళ్తుంటగా పొరుగువాళ్ళెవరేనా చూశారా?"

'సూట్ కేసు తీసికెళ్ళి వుండవచ్చా ?"

'ఆమె వెళ్తుండగా ఎవరూ చూడలేదు-సూట్ కేసు గురించి నాకు తెలియదు."

'మీ ఇంట్లో సూట్ కేసులు లేవా?''

'వున్నాయి, రెండు."

'ఇప్పుడు రెండూ వున్నాయా?''

'నాకు తెలియదు- నేను చూడలేదు.''

"మీ ఇంటి ప్రాంతాల రిక్షాలుగానీ, ఆటోలుగానీ వుంటాయా?''

"అది కాలనీ - వుండవు.''

"మెయిన్ రోడ్ ఎంత దూరంలోవుంది? నా ఉద్దేశ్యం బస్సు రూటు ఎంతదూరంలో వుంది?"

"రెండు ఫర్లాంగులు నడవాలి.''

జాన్ తలూపాడు: "ఓ. కే. మొన్నరాత్రి మామధ్య తగవువచ్చింది గనుక ఆమె కోపంతో ఎక్కడికేనా వెళ్ళుండాలి. ఉదయం ఆమె కాఫీతాగి మరీ వెళ్ళింది

గనుక, ఆమె ప్రవర్తననిబట్టి ఆమె ఎక్కడికేనా వెళ్ళి విశ్రాంతిగా గడిపి, ఉద్రేకం తగ్గాక తిరిగి రావాలనుకుని ఆలోచించిందనుకుంటాను.''

,,కావచ్చు."

జాన్ మళ్ళీ అన్నాడు, ,,కాబట్టి, ఆమె కూడా దుస్తులు తీసికెళ్ళివుండాలి. మీ ఇంటి పరిసరాల్లో ఎలాంటి వాహనాలు వుండవు గనుక ఏ ఆటో కోసమో లేదా, బస్సు కోసమో, మెయిన్ రోడ్డువరకు రెండుఫర్లాంగులు నడిచి వుండాలి."

'అవును'

,,ఓ. కే. ఆమె అంతదూరం నడిచివెళ్ళింది కాబట్టి మోయటానికి సరిపోయే బట్టలే తీసికెళ్ళిందను కుంటాను. ఏమంటారు?''

,,అది మీ లాజిక్."

,,ఆమె వెళ్తున్నట్టు ఉత్తరం ఏదేనా వదిలిందా?''

,,కిచెన్‌లో అంట్లుతప్ప ఏమీ వదల్లేదు!" గట్టిగా అన్నాడు నరేష్.

,,అంట్లు పనిమనిషి తోముతుందా?" అడిగాడు జాన్.

,,నా భార్య పనిమనిషిని పెట్టుకోదు!''

'ఎందుకు పెట్టుకోదూ'

,,నా బుద్ధుల గురించి ఆమెకుతెలుసు!"

,,అంటే- మీరు - మీరు - బయట వ్యవహారాలు నడుపుతుంటారా?"

'అవును. అది నా బలహీనత''

'మీ బలహీనత గురించి పెళ్ళికి ముందు మీ భార్యకు తెలియదా?''

'తెలియదు.''

'ఇప్పుడు మీరు బయట—''

'మరో వ్యక్తిని ప్రేమిస్తున్నాను.''

'మీ భార్యకు తెలుసా?''

'వ్యవహారం గురించి తెలుసు - నా లవర్ గురించి తెలియదు.''

'ఆమె రియాక్షన్ ఏమిటి?''

'విడాకు లిస్తానంటుంది.''

'మీ రియాక్షన్ ఏమిటి?''

'నాకేమి భయం లేదు. విడాకులకి తగిన కారణముండాలి కదా? కారణాలున్నా ఆధారాలు కావాలి కదా- నా పైన అభియోగం నిరూపించడానికి? అలాంటి వేమీ లభించవని నా నమ్మకం.''

'మీ రెలాంటి జాగ్రత్తలు తీసుకుంటున్నారు?''

'నన్నెవరూ షాడో చెయ్యకుండా నా లవర్ ఇంటికి ఫోన్ చెయ్యకుండా- లెటర్స్ వేయకుండా- తెలిసిన వాళ్ళు కనిపిస్తే మాట్లాడు కోకుండా...''

"ఆమె ఎవరో మీ భార్యకు కచ్చితంగా తెలియదా?''

"కచ్చితంగా తెలియదు.'

"ఆల్ రైట్, ప్రతిపక్షం అధికార పక్షాన్ని తొలగించాలనుకుంటోందా?'

నరేష్ ముఖం చిట్లించాడు, "అంటే?''

"మీ లవర్ మీ భార్య స్థానం ఆక్రమించాలనుకుంటోందా?"

"అలాంటిదేమీ లేదు. మేం ఒక ఒప్పందం ప్రకారం నడుచుకుంటున్నాం,'

"మొన్న రాత్రి మీ రెండుకు వాదించుకున్నారు?"

"విడాకుల గురించి. ఆమె నాకొక హెచ్చరిక చేసింది, చివరి అవకాశం ఇస్తూ- నా లవర్‌ని మర్చిపోక పోతే. విడాకుల కోసం చివరి క్షణం వరకూ పోరాడి. ఫలించక పోతే ఆత్మహత్య చేసుకుంటానంది."

'విడాకులివ్వడం మీకిష్టం లేదా?'

'లేదు-నాకు నేమగా అందుకుసిద్ధపడను. అప్రయత్నం ఆమె చేసుకుని విజయం సాధించుకోవచ్చు. కానీ-అది అసంభవమని నాకు తెలుసు.'

'విడాకులు అసంభవమైనప్పుడు ఆత్మహత్య చేసుకుంటానని హెచ్చరించిందా?'

'అవును'. నరేష్ ముఖం ఎర్రబడింది.

'ఈ హెచ్చరిక మొదటిసారిగా మొన్నరాత్రే చేసిందా?'

'అవును...అవును.'

జాన్ అతని ముఖంలో మార్పులు గమనిస్తున్నాడు.

'ఈ హెచ్చరిక చేసిన తెల్లారే ఆమె అదృశ్యమైంది కదూ?'

'అవును....'

జాన్ మళ్ళీ అన్నాడు, 'ఇప్పటి పరిస్థితినిబట్టి చూస్తే ఆమె ఏదైనా అఘాయిత్యం చేసుకునే అవకాశంవుందా?'

'అఘాయిత్యమా!' అర్చాడు నరేష్. 'లేదు! లేదు! అలాటిదేమీ లేదు! ముందు విడాకులకోసం ప్రయత్నించి ఆతర్వాత చివరిక్షణం వరకు పోరాడి-ఓహ్! ఆగండి, ఆగండి, మిస్టర్ జాన్. వ్యవహారంలో మనం చాలా లోతుకి వెళ్ళిపోయాం. ఇక్కడితో ఆపడం మంచిది.

ఈకేసు చేపట్టడానికి మీకు కావలసిన వివరాలు అందించాను. ఇక నాభార్యను గాలించండి! ఓహ్....ఇదిగో, ఆమెఫోటో. పేరు ఉమాదేవి-ఉమ అని పిలవండిచాలు. ఎత్తు అయిదున్నర-వయసు ఇరవైఅరు. తెలుగు, హిందీ మాట్లాడుతుంది...'

నరేష్‌లేచి నిలబడి మళ్ళీ అన్నాడు, 'మీకు నేను చెప్పగూడని విషయాలెన్నో చెప్పాను-నావ్యక్తిగత విషయాలు: నాలవ్ ఎఫైర్ గురించి మీమీద విశ్వాసంతో నారహస్యాలు వెల్లడి చేశాను. నేను మీక్లయంట్‌ని-మీక్లయంట్ రహస్యాలకి భద్రత కల్పించడం మీబాధ్యత అని మరువకండి. ఇక నాఆఫీసు టైమవుతోంది, వెళ్తాను. ఇవి నాఇంటి అడ్రసు, ఫోన్ నెంబర్లు. సాయంత్రం ఆరు గంటలకు ఇంట్లో వుంటాను. ఆమె గురించి ఏదేనా తెలిస్తే తెలియజేయండి-ఇక వస్తాను.'

నరేష్ విసురుగా వెనుదిరిగి బయటికెళ్ళి పోయాడు. జాన్ కలవరంగా లాల్‌ని చూశాడు.

'వెల్! రివాల్వర్ బుల్లెట్‌లా వెళ్ళిపోయాడు కదూ?' నవ్వాడు లాల్, "మాటల్లో అతనెక్కడో నోరుజారాడు. లేదా, నీ ఇంటరాగేషన్‌లో తానుచేసిన పొరపాటు ఏదో అతనికి తట్టింది.'

'అంటే?'

"అంటే- అతను భార్యను హత్యచేసి ఆత్మహత్య చేసుకున్నట్లు నమ్మించేందుకు ప్రయత్నించివుండాలి. లేదా-అస్పృశ్యమైన అతని భార్యతనమీద విడాకులకోసం ఆధారాలు సంపాదించడానికి ప్రయత్నిస్తోందని భయపడి వుండాలి."

"ఇప్పుడీ డిటెక్టివ్‌లు ఏం చేయాలి?"

"అతనిప్పుడు లవర్‌ని కలుసుకుంటాడు. అతని లవర్ ఎవరో తెలుసుకోవడం మనకు ముఖ్యం. షాడో హిమ్!" అన్నాడు లాల్.

## 2

మధ్యాహ్నం రెండు గంటలకు జాన్ అలసటగా తిరిగి వచ్చాడు.

లాల్ అతన్ని చూసి, "ఏం జరిగింది?" అనడిగాడు.

"మిస్టీరియస్ ఎఫైర్ యార్!" అన్నాడు జాన్ చిరాగ్గా.

'కమాన్, కనుక్కున్నది కక్కు!'

జాన్ కూర్చొని చెప్పాడు: "నరేష్‌ని షాడో చేశాను. అతను ఆటోలో వెళ్ళాడు. ఇక్కడ నుంచి సూటిగా ఇంటికెళ్ళి సూట్‌కేసుతో బయటకొచ్చాడు. ముఖం గాభరాగావుంది. తిరిగి అదే ఆటోఎక్కి చిక్కడపల్లిలో జై భారత్ డ్రైక్లీనర్స్ షాపులో ఒక ప్యాకెట్ తీసుకుని బాలానగర్‌లో వనరాజ్ ఫ్లాట్స్ కెళ్ళాడు. పావు గంటలో ఒక యువతితో బయట కొచ్చి మరో ఆటో ఎక్కాడు. ఆమెను కోఠిలో నేషనల్ బ్యాంక్ దగ్గర దింపి, తను ఎ.సి గార్డ్స్‌లో జీవన్ ఫైనాన్షియర్స్ ఆఫీసు కెళ్ళాడు. అతనక్కడ పని చేస్తున్నాడు.

"నేనా యువతి గురించి ఆరాతీశాను. ఆమె వనరాజ్ ఫ్లాట్స్‌లో మూడో అంతస్తులో ఫ్లాట్ నెంబర్ నలభై నాలుగులో వుంటోంది. పేరు రేవతి. కోఠీ నేషనల్ బ్యాంక్‌లో క్లర్క్‌గా పనిచేస్తోంది.

ఆఫీసు కెళ్ళాక ఇప్పటి వరకు ఇద్దరు ఒకర్నొకరు

కలుసుకోలేదు. వాళ్ళిద్దరి మధ్య ఫోన్ సంభాషణ జరిగి వుండవచ్చునేమో చెప్పలేను. ఇప్పటి వరకు నరేష్ మీద నిఘా వుంచి తిరిగి వచ్చేశాను. వాళ్ళిప్పుడు కలుసుకోరు. సాయంత్రం ఆఫీసు నుండి వచ్చాక కలుసుకుంటారు. అప్పటి వరకు మనం వేచి వుండాలి.›

“ఆల్ రైట్, ఇప్పుడువాళ్ళు ఆడుతున్న గేమ్ ఏమిటో అర్థమవుతుంది. నీ అనుమానాల్లో ఒకటి నిజమైంది. వాళ్ళు ఉమను హత్య చేశారు.”

‘అలాగా?’

“అవును. ఆమె తనకు తానుగా అదృశ్యమై భర్త మీద ఆధారాలు సంపాదించడం లేదు. ఆత్మహత్య అంత న్నాక చేసుకోలేదు. హత్య చెయ్యబడింది. మర్డర్: వింటున్నావా? వాళ్ళిద్దరికి ఆమె ఎప్పటికీ సమస్యే కాబట్టి అంతం చేశారు.

‘నరేష్ మొన్నరాత్రి తనని భార్య ఆత్మహత్య చేసుకుంటానని హెచ్చరించిందని చెప్పాడు. కానీ–అది నేను నమ్మను. నరేష్ ఆమెనిచంపి ఆత్మహత్యగా నమ్మించాలనుకున్నాడు కాబట్టి అలా కల్పించి చెప్పాడు. అయితే శవం ఎక్కడుంది? హత్య జరిగిందా జరగబోతోందా? జరిగివుంటే ఎప్పుడు జరిగింది?–’

“మొదలైన సమాధానాల కోసం....”

“నేను చెప్తాను విను! హత్య జరిగివున్నా, జరగబోతున్నా, మనం వాళ్ళని రెడ్ హేండెడ్‌గా పట్టుకోవచ్చు.”

“ఎలా?”

“చాలా సింపుల్. నరేష్ ఇంటినుంచి సూట్‌కేసు

తెచ్చారు. ఆమె అదృశ్యం మరింత అర్థవంతంగా కన్పించడానికి—సూట్ కేసూ, బట్టల గురించి నా ఇంటరాగేషన్‌లో అతనికి కల్గిన ఇన్‌స్పిరేషన్‌తో—చక్కటి రంగం సిద్ధం చేస్తాడు. ఆ సూట్ కేసులో అతను ఇంట్లో వున్న భార్య దుస్తులే గాక, లాండ్రీలో వున్నవి కూడా తీసుకొచ్చాడు.

"కాబట్టి హత్య జరిగినా జరుగబోతున్నా, ఆ సూట్ కేసు బట్టలతో సహా హత్యాస్థలంలో వుంటుంది. కనుక మనం వాళ్ళమీద నిఘా వుంచితే చాలు—వాళ్ళు సూట్ కేసుతో హత్యాస్థలానికి వెళ్ళినప్పుడు—హత్య జరిగితే ఆధారాలతో సహా హంతకులుగా పట్టుకోవచ్చు. లేకపోతే ఉమని రక్షించి, హత్యా ప్రయత్నం మీద వాళ్ళిద్దర్ని జైలుకు పంపవచ్చు."

"యూ ఆర్ రైట్." అన్నాడు లాల్, "కానీ—నరేష్ ఆరు గంటలకు ఇంట్లో వుంటానని చెప్పాడు. సాయంత్రం వాళ్ళిద్దరు కలుసుకోరా?"

'బహుశ రాత్రి ఎప్పుడో కలుసుకుంటారు.'

"ఓ. కే. నేను సాయంత్రం ఆరు గంటలకు ఫోన్ చేస్తాను. ఉమ విషయంలో ఇంకా ఆచూకీ ఏమీ దొరక లేదని చెప్తాను. సూట్ కేసు రేవతి ఫ్లాట్‌లో వుంది. బంధించినచోట ఉమ ఇంకా సజీవంగా వుంటే వాళ్ళిద్దరు రాత్రి బయలుదేరతారు. ఇప్పటికే ఆమె నిర్జీవంగావుంటే వాళ్ళు ఆఫీసునుంచి వచ్చిన వెంటనే బయలుదేరతారు—"

"ఎందుకు—?"

"హత్య కేసులో ముఖ్యమైన ఎవిడెన్స్‌ని సాధ్యమై

నంత త్వరగా వదిలించుకోవాలి గనుక!" అన్నాడు లాల్.

జాన్ తలూపి ఉమ ఫోటో చూశాడు; గుండ్రటి చక్రాల్లాటి కళ్ళతో అమాయకంగా వుందామె. "పూర్ లేడీ! ఇలాటి యువతుల్ని నమ్ముకున్న భర్తలే గొంతు కోస్తున్నప్పుడు ఇక ఆడ వాళ్ళకి భద్రతలు ఎక్కడ వుంటుంది, లాల్?"

# 3

సాయంత్రం ఆరుగంటలకు నరేష్ నుంచి ఫోన్ వచ్చింది.

"గుడ్ ఈవెనింగ్, మిస్టర్ లాల్."

"ఈవెనింగ్." అన్నాడు లాల్, "మిస్టర్ నరేష్, నేనే మీకు ఫోన్ చెయ్యాలనుకున్నాను-"

'నేనే చేశాను.' నవ్వాడు నరేష్, "నా అత్యుత మీకు తెలియదు. నేనెంత ఇబ్బంది పడుతున్నానో మీ కర్థం కాదు. భార్య లేకపోతే సంసారం నెట్టుకు రావడం చాలా కష్టం."

'అలాగా? నాకు తెలియదు, నేను డిటెక్టివ్‌ని.'

అవతల నవ్వు. "ఉమ అలా ఎందుకెళ్ళిపోయిందో- చాలా తొందరపడింది. ఆడ వాళ్ళ ఆలోచనలు స్థిరంగా వుండవు! ఆమె లేనిలోటు కొట్టొచ్చినట్లు కనబడుతోంది. భార్య అంటే ఏమిటో నేనిప్పుడు అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాను. ఇందాక అన్నం వార్చబోతూ గంజి చెయ్యి మీద పోసుకున్నాను. విపరీతంగా మంట పెడుతోంది! ఓహ్, ఆమెని త్వరగా గాలించండి! ఎక్కడ వున్నా వెతికి పట్టుకోండి! నేనామెకు క్షమాపణ

చెప్పకుని ఆ అడవి జింక రేవతికి గుడ్‌బై కొడతాను!"

"రేవతి? ఆమె ఎవరు?"

'ఓహ్, గాడ్! ఆమె పేరు మీకు చెప్పేశానా! నోరు జారాను! సరే....ఫరవాలేదు. నా రహస్యాలు మీరు కాపాడతారని మాటిచ్చారు.'

"నెవర్ మైండ్. మీరు రేవతికి గుడ్‌బై కొట్టాలనుకుంటున్నారా? చాలా సంతోషం! మీ భార్య ఫొటో చూసి జాన్ చాలా జాలి పడుతున్నాడు. ఆమెకు అన్యాయం చెయ్యకండి."

"నేను కూడ అదే ఆలోచించాను. ఇప్పుడే రేవతిని కలుసుకు మాట్లాడ్డానికి వెళ్తున్నాను-'

'రేవతినా? ఎక్కడ?'

'చూడండి మిస్టర్ లాల్, రేవతి గురించి మీ రెండు కంత కుతూహలం కనబరుస్తున్నారు? ఇప్పటికే ఆమె గురించి నేను చాలా చెప్పేశాను. ఇప్పుడిక మిమల్ని కాదు కదా, దేవుడ్ని కూడా నమ్మను. దయచేసి రేవతి ఎక్కడ వుందో నన్నడక్కండి-నా క్షేమం దృష్ట్యా.'

"మీ రిప్పుడే కలసుకోవడాని కెళ్తున్నారా? తిరిగి ఎప్పుడొస్తారు?"

"ప్లీజ్ మిస్టర్ లాల్' విషయం మార్చండి-"

"జాన్ మీ భార్య గురించి దర్యాప్తు చేస్తున్నాడు." అన్నాడు లాల్, అతని ముఖం ఎర్రబడుతోంది. "అర గంటలో అతని నుంచి ఫోన్ వస్తుంది. అప్పుడు నేను మీకు తెలియజేయ వలసి వుంటుంది. మీరు రేవతి దగ్గరకు వెళ్తానన్నారు. నేను ఫోన్ ఎక్కడకి చెయ్యాలి.

"ఏమిటి మీ అయిడియా? రేవతి ఫోన్ నెంబరు, అడుగుతున్నారా?"

"నో, నో, మిస్టర్ నరేష్. నన్నపార్థం చేసుకోకండి" అన్నాడు లాల్ తీవ్రంగా, "మీరు రేవతి దగ్గరి కెళ్తే నేను ఫోన్ ఎక్కడికి చేస్తాను.? కాబట్టి అరగంట వరకు ఇంట్లోనే వుండండి. ఏమంటారు? జాన్ రిపోర్టు అందుకుని మీకు ఫోన్ చేశాక వెళ్ళండి. ఏమిటి?"

"అంత ముఖ్యమా! నో, నో। నేనత్యవసరంగా అక్కడికి వెళ్ళాలి తిరిగి వచ్చాక నేనే మీకు ఫోన్ చేస్తాను. అప్పుడు చెప్పండి, గుడ్ బై।" లైన్ కట్ అయింది.

డామిట్।'' రిసీవర్ విసరి కొట్టాడు లాల్.

"ఏం జరిగింది?" జాన్ అడిగాడు.

లాల్ తటాలున లేచి బయటకు దారితీశాడు. ''క్విక్। క్విక్। లెటజ్‌గో।" జాన్ గాభరాగా వెంబడించాడు. ఇద్దరూ ఆఫీసుమూసి కిందికొచ్చారు. జాన్ వేగంగా కారు దగ్గరికి పరుగెత్తాడు. లాల్ వారించాడు, "కార్లో కాదు, టాక్సీలో।"

వెనక్కి తిరిగి చప్పట్లు కొట్టి వెళుతున్న టాక్సీఆపాడు.

ఇద్దరూ టాక్సీ ఎక్కాక, "బాలానగర్- అడ్రస్ తర్వాత చెప్తాను." అన్నాడు డ్రైవర్‌తో.

టాక్సీ ముందుకురికింది.

"ఏమిటి లాల్? ఏం జరిగింది?" కంగారుగా అడిగాడు జాన్.

లాల్ సిగరెట్ వెల్గించి అన్నాడు, 'వాళ్ళు రంగంలో దిగుతున్నారు. నరేష్ ఇప్పుడు రేవతిఫ్లాట్ కెళుతున్నాడు. అతన్ని అరగంట సేపు నా ఫోన్ కాల్ కోసం ఇంట్లోనే

ఆపి, ఆ లోపున మనం ఫ్లాట్స్ చేరుకుని, ఆ తర్వాత అక్కడతని రాకకోసం ఎదురుచూస్తూ, మనదృష్టి నుండి తప్పిపోకుండా చెయ్యాలనుకున్నాను.

"కానీ అతను తెలివి గలవాడు. నా అభ్యర్థన గ్రోసి పుచ్చి వెంటనే బయలు దేరాడు. అతను చేరుకునే లోపున మనం చేరుకుంటే వాళ్ళు తప్పిపోరు. లేకపోతే- వాళ్ళిద్దరు అక్కడ నుంచి సూట్ కేసుతో సహా అదృశ్యమై హత్యాస్థలం చేరుకుంటారు."

" ఓహ్! డ్రైవర్, డ్రైవ్ ఫాస్ట్ ! " అన్నాడు జాన్.

మరో పదినిమిషాల తర్వాత వాలానగర్‌లో ఒక రెస్టారెంట్ ముందు టాక్సీ దిగి పంపించేశారు.

"హర్రీ అప్, జాన్! నువ్వు ఫ్లాట్‌లో కెళ్ళి రేవతి వుందో లేదో చూడు! నరేష్ ఈపాటికి వచ్చి వుంటాడు. కానీ-ఎందుకయినా మంచిది-నే నిక్కడ నిలబడి ఎదురు చూస్తుంటాను. నువ్వు ఫ్లాట్‌లోకెళ్ళి చూసిరా! జాగ్రత్త! నువ్వు వాళ్ళ కంట పడితే ఈ కేసు మంటగలవడమే గాక. తన లవర్ గురించి మనం తెలుసు కున్నందుకు నరేష్ తిడతాడు!"

లాల్ మాటలు విని జాన్ అక్కడ నుంచి కదిలి గబగబ వెళ్ళిపోయాడు.

లాల్ రెస్టారెంట్‌లో కెళ్ళి ఆరంతస్తుల వనరాజ్ ఫ్లాట్స్ కేసి చూస్తూ సిగరెట్ వెల్గించాడు....

రోడ్డు మీద సూటిగా రేసు గుర్రం లా పరిగెత్తి వస్తున్న జాన్‌ని చూసి గాభరాగా లేచాడు లాల్.

"వాట్ హేపెండ్ ?" అన్నాడు లాల్ అతృతగా.

"పిట్ట ఎగిరిపోయాయి !" అన్నాడు జాన్ వగరుస్తూ.

"వాట్ ?"

"అవును, ఫ్లాట్‌లో రేవతి లేదు ! పావుగంట క్రితం ఆమె బయటికెళ్ళిందట-చేతిలో సూట్‌కేసుతో ! వింటున్నావా ? సూట్‌కేసుతో ! జానిటర్ చెప్పాడు. ఆమెతో బాటు ఎవరూ వెళ్ళలేదు. ఫ్లాట్‌కి తాళం వేసివుంది. నరేష్ ఇక్కడికి రాలేదు. బహుశ ఆమే అతని ఇంటికి వెళ్ళింది-అక్కడ్నుంచి ఇద్దరూ మర్డర్ ప్లేస్‌కి చెక్కేస్తారు ! మనం త్వరగా వెళ్ళాలి ! క్విక్"

పావుగంటలో దిలీప్‌నగర్‌లో నరేష్‌ఇల్లు చేరుకున్నారు ఇద్దరూ.

ఇంటికి తాళం వేసి వుంది.

"డామ్‌లక్! వాళ్లువెళ్ళిపోయారు!" నీ ర స ం గా అన్నాడు జాన్.

"నువ్వు చాలా గందరగోళం చేశావు జాన్!" లాల్ అన్నాడు కోపంగా.

"నేనేం చేశాను?"

"రేసు గుర్రాల్లా పరుగెత్తే నీ ఆలోచనలు బోల్తా కొట్టాయి! యూ ఫూల్, రేవతి ఇక్కడికి కొస్తుందని ఎందుకనుకున్నావు? నరేష్ ఏం చెప్పాడు? వాళ్ళిద్దరు కలుసు కోవడంలో చాలా జాగ్రత్త తీసుకుంటున్నట్లు చెప్పలేదూ?"

"ఓహ్....అవును! ఇప్పుడేం చెయ్యాలి?"

"నరేష్ వెంటనే బయలుదేరు తున్నానని నాకు చెప్పాడు. అతను బయలుదేరి అరగంట కావస్తోంది.

రేవతి బయలుదేరి దాదాపు అంతే సమయ మవుతోంది. వాళ్లిద్దరు ముందు నిర్ణయించుకున్న చోట ఎక్కడో కలుసుకుంటారు. లేదా నేరుగా- విడివిడిగా హత్యా స్థలానికి చేరుకుంటారు.

"ఇక్కడ మనిద్దరం ఇక్కడ భజనలు చేస్తూ కూర్చుందాం!"

"డామిట్! ఆమెని రక్షించడానికి శాయ శక్తులా ప్రయత్నించి విఫలమయ్యాం! ఇప్పుడు చేసేదేమీలేదు- ఏదో కంగన్ హాలుకెళ్ళి మన పెళ్ళాలకని చెప్పి రెండు చేతులకిగాజులు తీసుకుందాం!"

"కానీ-లాల్, వాళ్ళగురించి పోలీసులకి చెప్పడం మంచిదనుకుంటాను." అన్నాడు జాన్.

"ఈ కేసు మనం ఛేదగొట్టాక ఇక పోలీసు లేమీ చెయ్యలేరు, జాన్." అన్నాడు లాల్, "మనం క్లిష్ట మైన పరిస్థితిలో పడ్డాం. వాళ్ళమీద ఏ అభియోగం నిరూపిస్తాం? పోలీసులకి ఆమెశవం దొరకాలి, దర్యాప్తు జరగాలి, అది ఆత్మహత్యకాదు- హత్య అని తేలాలి, హత్యా సమయాన్ని నిర్ణయించి, ఆ సమయంలో వాళ్ళ ఎలిబీలు చెక్ చెయ్యాలి, వెల్- అది ఆత్మహత్య కాదని నిరూపించకపోతే ఎలిబీలతో నిమిత్తంలేదు. ఒకవ్యక్తి ఆత్మహత్య చేసుకుంటే అతని సంబంధీకుల ఎలిబీల ప్రసక్తే వుండదు."

"నరేష్ అంత పటిష్ఠంగా హత్యచేస్తాడా?"

"అతనెంత పటిష్ఠంగా హత్య చేస్తాడన్నది కాదు ముఖ్యం. అతను మనల్నెంత సులభంగా ఫూల్స్ చేశాడో ఆలోచించాలి."

'ఉమ గురించి ఆలోచిస్తోంటే మతి పోతోంది!'

'ఆలోచించకు! చావు ఎప్పుడు ఎలా ముంచుకొస్తుందో ఎవరికీ తెలియదు. దాన్ని ఎవరూ ఆపలేరు. ఆల్‌రైట్, ఇప్పుడు మనం ఆఫీసు కెళ్ళి నరేష్ ఫోన్ కోసం ఎదురు చూద్దాం.' అన్నాడు లాల్.

# 4

రాత్రి పదకొండు కావస్తోన్నా నరేష్ నుంచి ఫోన్ రాలేదు.

డిటెక్టివ్‌లు ఘాటాన్ విస్కీతో కాలక్షేపం చేస్తున్నారు. అప్పటి వరకు లాల్ నాలుగు సార్లు నరేష్ ఇంటికి ఫోన్ చేశాడు. రెస్పాన్స్ లేదు.

'వెల్, వాళ్ళింకా తిరిగి రాలేదను కుంటాను. వెళ్ళి ఆరు గంటలవుతోంది. ఇంత సేపు ఏం చేస్తున్నారు?' అన్నాడు లాల్, సిగరెట్ వెలిగిస్తూ.

జాన్ రిసీవర్ ఎత్తి నరేష్ నెంబర్ డయల్ చేశాడు. సమాధానం లేదు.

'బ్రదర్! బహుశ వాళ్ళు ఫ్లాట్‌లో వుండవచ్చు. అక్కడికి ఫోన్ చేస్తే?'

'నరేష్ తిడతాడు!' అన్నాడు లాల్.

'అలా జరక్కుండా చేస్తాను. ఫ్లాట్‌కి డయల్ చేసి రేవతికి కనెక్షన్ ఇమ్మని ఆపరేటర్‌తో చెప్తాను. కనెక్షన్ లభించాక అవతల ఎవరైనా ఫోన్ ఎత్తారో, లేదో తెలుసుకుని డిస్కనెక్ట్ చేస్తాను.'

లాల్ తలాడించాడు.

జాన్ నెంబర్ డయల్ చేసి, ఆపరేటర్‌తో మాట్లాడి,

కాస్సేపు వేచి చూసి, రిసీవర్ పెట్టేసి పెదవులు చప్ప
రించాడు. నో రెస్పాన్స్.'

'ఇక మర్చి పోదాం!' అన్నాడు లాల్.

'లాల్, ఈ వ్యవహారం గురించి ఇక పోలీసులకి
చెప్పేయడం మంచి దనుకుంటాను.' అన్నాడు జాన్,
'వాళ్ళ మీద అభియోగం నిరూపించడానికి మన దగ్గర
ఆధారాలున్నాయి. సూట్ కేసు, ఉమ బట్టలు తీసి
కెళ్తుంటగా నేను నరేష్‌ని చూశాను. వాటిని అతను
ఈ హత్యలో తప్పుడు ఆధారాలు సృష్టించడానికి ఉప
యోగించాడు.

"నా సాక్ష్యానికి ఆధారం లేదని అతని లాయర్
వాదించవచ్చు. కానీ ఆ సూట్ కేసు-బట్టల్ని అతను
తీసికెళ్ళినట్లు ఉదయం అతన్ని ఫ్లాట్ కి తీసికెళ్ళిన ఆటో
వాడు సాక్ష్యం ఇస్తాడు. నరేష్ లాండ్రీలో ఈ రోజు
ఉమ దుస్తులు డెలివరీ తీసుకున్నట్లు లాండ్రీలో ప్రొప్రయి
టర్ స్టేట్ మెంట్ ఇస్తాడు. అంతేగాక, ఈ సాయం
త్రం రేవతి సూట్ కేసుతో బయట కెళ్ళినట్లు ఆమె
ఫ్లాట్ కి జానిటర్ చెప్తాడు. ఇంకేం కావాలి?"

"వెల్ పార్టనర్! విస్కీ మత్తులో కూడ బుర్ర పని
చేస్తోందన్న మాట. ఇంకా చెప్పు."

"ఉమను వాళ్ళు కిడ్నాప్ చేసి, ఆమె తనకు తానుగా
అదృశ్యమైనట్లు నిరూపించాలను కుంటున్నారు. కాబట్టి
ఆమె దుస్తుల్ని, సూట్ కేసుని, ఆమెను ఉంచిన స్థలానికి
తరలించారు. ఇక, ఆ హత్య ఆత్మ హత్యగా అను
కునేలా చెయ్యాలనుకుంటున్నారు కాబట్టి, ఆమెను ఉరి
తీయవచ్చు- లేదా నిద్ర మాత్రలతో చంపవచ్చు- లేదా

స్పృహ పోగొట్టి హుస్సేన్ సాగర్‌లో ముంచవచ్చు. ఎందరు యువతులు హుస్సేన్ సాగర్‌లో ఆత్మహత్య చేసుకోలేదు?"

"రిలాక్స్!" అన్నాడు లాల్, 'ఇక్కడికి చాలు.... బుర్ర పాడవుతోంది. మరొక్కసారి నరేష్ ఇంటికి ఫోన్ చేద్దాం. రెస్పాన్స్ లేకపోతే మరో రౌండుకొట్టి పడుకుందాం......" లాల్ రిసీవర్ ఎత్తి డయల్ చేయ సాగాడు.

సమయం 11:58.

లాల్ డయలింగ్ పూర్తి చేసి రిసీవర్ చెవి దగ్గర పెట్టుకున్నాడు. ఒక్కక్షణం.... రెండు క్షణాలు.... మూడు క్షణాలు....ఛటుక్కున రిసీవర్ పెట్టేసి లేచాడు.

"ఏమిటి?" జాన్ అడిగాడు.

"అవతల ఎవరో రిసీవర్ ఎత్తి పెట్టేశారు!"

"ఎవరు?"

"నరేష్! భయపడి డిస్కనెక్ట్ చేశాడు! కమాన్! మనం వెంటనే వెళ్ళాలి!"

ఇద్దరూ బయటకురికి ఆఫీసుకు తాళం వేశారు. చకచక మెట్లుదిగి కిందికి వచ్చి కారెక్కారు. జాన్ కారు స్టార్ట్ చేసి ముందుకు దూకించాడు. కారు రాకెట్‌లా ఎక్కడా ట్రాఫిక్ సిగ్నల్స్‌ని లెక్క చెయ్యకుండా దూసుకెళ్ళి పది నిమిషాలలో దిలీప్ నగర్ చేరుకుంది.

నరేష్ ఇంటి వీధిమలుపులో కారాపి, దిగి, చక చక నడిచారు. ఇంటి గేటు చేరుకుని సందేహిస్తూ నిలబడ్డారు. లోన లైటు వెలుగుతోంది. కొన్ని క్షణాలు వేచి చూసి, గేటు తెరుచుకుని గబగబ లోపలకు వెళ్ళి వరండా

వెళ్ళారు. లాల్ బెల్ నొక్కాడు.

కొన్ని క్షణాలు గడిచాక ఉమాదేవి తలుపు తెరచి గాభరాగా చూసింది.

# 5

"ఎవరు....ఎవరు మీరు? ఎవరు కావాలి?"

ఆమె మాటలు విని జాన్ తలతిరిగి కిందపడబోయాడు లాల్ ముఖంలో నెత్తురుచుక్క లేదు।

ఆషాక్ నుంచి బయటపడి, "మీరు... మీరెప్పు డొచ్చారు!" అనడిగాడు.

ఆమె ముఖం చిట్లించింది, 'నేనా? ఏమిటి మీరనేది? నేనెక్కడికి వెళ్ళాను?'

'ఎక్కడికీ వెళ్ళలేదా?"

"లేదు। ఇంతకూ మీరు-'

లాల్ నవ్వాడు. "వెల్, మిసెస్ ఉమ. లోనికి పదండి, మాట్లాడుకుందాం."

"నా పేరు మీకెలా తెలుసు?"

"మీ గురించి నాకు చాలా తెలుసు."

"ఓహో। ఏమిటిది?"

"లోనికి పదండి, మాట్లాడుకుందాం।"

ఆమె తికమక పడుతూ అడ్డుతొలగింది. ఇద్దరూ లోనికెళ్ళారు. ఆమె వెనకవచ్చింది. లాల్ సరాసరి బెడ్ రూంలో కెళ్ళిపోయాడు. జాన్ వెనక్కి తిరిగి ఆమెని చూశాడు. ఆమె కళ్ళు రెపరెప లాడిస్తూ కలవరంగా చూస్తోంది.

బెడ్ రూంలో బెడ్ మీద ఒక సూట్ కేసు తెరిచివుంది.

అందులో బట్టలు న్నాయి. సూట్ కేసు పక్కన ఒక టవల్ పడివుంది.

"నాకేమీ అర్థంగావడంలేదు! మీరెవరు? లోనికెందు కొచ్చారు?" అందామె తీవ్రంగా.

లాల్ ఆమెను సూటిగాచూసి, 'మేం డిటెక్టివ్ లం.' అన్నాడు.

'ఓహ్!' ఆమె వూపిరి బిగబట్టింది.

"మీ భర్త మమ్మల్ని కలుసుకుని మిమ్మల్ని గాలించ మని చెప్పారు."

ఆమె అదిరిపడింది, "ఎందుకు?"

"మీరు కన్పించడం లేదు గనుక!"

ఆమె ఛటుక్కున తల తిప్పుతుంది. ప్రక్కనే వున్న డ్రెస్సింగ్ మిర్రర్ లో తన రూపం చూసుకుని ఉలికి పడింది.

"అయ్యో-ఆగండి!" అర్చిందామె.

"ఏమిటి?"

"ఇప్పుడే వస్తాను-"

"ఎక్కడికి?"

ఆమె సమాధానం ఇవ్వకుండా బయట కురికింది. డిటె క్టివ్ లు అయోమయంగా చూసుకున్నారు. మరు నిమిషం ఆమె తిరిగి వచ్చింది.

"ఎక్కడి కెళ్ళారు?" అడిగాడు లాల్, ఆమెను పరీ క్షగా చూస్తూ.

'బాత్ రూంలో....'

'బాత్ రూంలో ఏముంది?'

'నా చెవి దుద్దులు మర్చిపోయాను.' గుప్పెట తెరచి

చూపించిందామె.

'మీరిప్పుడు స్నానం చేశారా ?'

'అవును,' అందామె దుద్దులు పెట్టుకుంటూ, "నేను స్నానం చేసి బట్టలు ధరిస్తున్నాను....మీ రొచ్చేశారు."

"కానీ, మీ వెంట్రుకలు పచ్చిగా లేవు."

"తలస్నానం చెయ్యలేదు."

"ఆల్ రైట్, మీ సూట్ కేసులో బట్టలున్నాయి. మీరిప్పుడెక్కడికీ వెళ్ళడంలేదు-ఎక్కడి నుంచో ఇక్కడి కొచ్చారు. మీరు వచ్చి సుమారు గంట కావస్తోంది. అంతేనా ?"

ఆమె లాల్‌ని విచిత్రంగా చూసింది, "మీ కెలా తెలుసు ?"

"నా పేరు లాల్, అతని పేరు జాన్. డిటెక్టివ్‌లం।"

"మా వారు మిమ్మల్ని నియమించారన్న మాట ?"

"అంతే।"

"ఇప్పుడాయనకు మీ అవసరం లేదు, వెళ్ళండి."

డిటెక్టివ్‌లు ముఖాలు చూసుకుని, కళ్ళతో సైగలు చేసుకున్నారు.

"మీరీ రెండురోజులు ఎక్కడున్నారు ?" అడిగాడు జాన్.

"మీ కనవసరం।" అందామె.

"మీ రెందుకలా వెళ్ళిపోయారు ?"

"మీ కనవసరం ?"

"మీ వారి మీద ఏదేనా వలవిసిరారా, మాడమ్?"

'మీ కనవసరం।' అరిచిందామె.

'ఓ. కే.' లాల్ కల్పించుకున్నాడు, 'మొన్న రాత్రి

ఆమె భర్తతో కొట్లాడి, తెల్లారి లేచి కాఫీ తాగి బట్టలు సర్దుకుని వెళ్ళి పోయింది జాన్. ఏదో హోటల్‌లో రూం తీసుకుని భర్త మీద కన్ను వేసి వుంచింది. అతని ప్రియురాలెవరో ఆమెకు తెలుసు. ఆమె ఎక్కడ వుంటుందో కూడ తెలుసు. కాబట్టి వాళ్ళిద్దరు కలసి వున్నప్పుడు తను హఠాత్తుగా ప్రత్యక్షమై ఆశ్చర్య పర్చాలనుకుంది.

'ఆమెకు విడాకులు కావాలి. భర్త ప్రేమ కలాపాలు నిరూపిస్తే లభిస్తాయి. ఈరాత్రి ఆమె రేవతి ఫ్లాట్ కెళ్ళి కావలసిన ఆధారాలు సంపాదించుకుంది. ఆ తర్వాత తిరిగి వచ్చేసింది....'

"ఓహ్, కాదు! నేనక్కడికి వెళ్ళలేదు!" అర్చిందామె.

"రిలాక్స్, సిస్టర్. మీ మీద మేము ఎలాటి అభియోగం మోపడం లేదు. ఈ కేసులో మేం తెలుసుకున్న వాస్తవం చెప్పాను. మీ అదృశ్యంలోని అంతర్యం మాకిప్పుడు తెలిసింది. మీ ఇంటికి మేము సాయంత్రం నుంచి ఆరుసార్లు ఫోన్ చేశాం. అయిదవసారి పదకొండు గంటలకి రింగ్ చేసినప్పుడు మీరు లేరు. ఆరవసారి సుమారు పన్నెండు గంటలకి చేసినప్పుడు మీరు డిస్కనెక్ట్ చేశారు.

"బహుశ మీరప్పుడు స్నానం చేస్తున్నారనుకుంటాను- మధ్యలో వచ్చి ఫోన్ చేసిందెవరో తెలుసుకోకుండా లైన్ కట్ చేసి వెళ్ళి పోయారు-మీ ఫోన్ మీద సబ్బు నురగ ఇంకా వుంది-మీ రెందుకలా డిస్కనెక్ట్ చేశారు?"

ఆమె భారంగా వూపిరివదిలింది.

'ఫోన్ చేసింది మీరనుకోలేదు, మా వారనుకున్నాను.

ఆయనతో మాట్లాడ్డం నాకిష్టం లేదు.'

'మీ వారిప్పుడు ఫ్లాట్ లోనే వున్నారా?'

'నాకు తెలియదు. నన్నేమీ అడక్కండి!'

'రేవతి?'

'ప్లీజ్....నన్నేమీ అడక్కండి! జరిగిన దానికి నేను చాలా సిగ్గుపడుతున్నాను.'

"మీ రక్కడ ఏం చేశారు?"

'ప్లీజ్, మిస్టర్ లాల్!....వెళ్ళిపొండి!' ఆమె ముఖం తిప్పుకుంది.

"సరే, మీ గురించి మేమెంత భయపడ్డామో మీకు తెలీదు. పొరపాటు అంచనాలతో మీరు ప్రమాదంలో ఇరుక్కున్నారని రక్షించడానికి శాయశక్తులా ప్రయత్నిం చాం. కానీ-ఓ. కే. మీరిప్పుడు క్షేమంగా వున్నారు. మా బాధ్యత తీరిపోయింది. ఇక విడాకుల విషయంలో మీ రిద్దరు ఏం చేస్తారో మా కనవసరం. మేం సలహాలివ్వం. అది మీ వ్యక్తిగత విషయం. అయితే ఒక్క మాట చెప్పండి: మీరిప్పుడు ఎలాటి ప్రమాదంలో లేరు కదా?"

"లేను."

'మంచిది. మీరు ఎప్పుడే ప్రమాదంలో ఇరుక్కున్నా మాకు ఫోన్ చెయ్యడం మరువకండి - మీకు పూర్తిగా ప్రమాదం తొలగిందని మాకు నమ్మకం కలగడం లేదు.'

ఆమె మెరుస్తున్న కళ్ళతో చేతులు జోడించింది.

'నేనే ప్రమాదంలోనూ ఇరుక్కోలేదు, ఇరుక్కోను. మీరు నాపట్ల చూపుతున్న శ్రద్ధకు ధన్యురాలిని!'

# 6

'లాల్! ఎవరో నాటకమాడుతున్నారో నాతలకెక్కడం లేదు' అన్నాడు జాన్, కారు సీట్లో వెనక్కివాలి.

'మేసన్ ఏం చేస్తున్నాడు?'

'విస్కీ మత్తులో పడుకున్నాడు!'

'అయితే నువ్వూ పడుకో!'

'ఈ మిస్టరీ ఏమిటో తేలేదాకా నిద్రపట్టదు!'

లాల్ స్పీడుగా డ్రైవ్ చేస్తూ అన్నాడు, "ఈ మిస్టరీ ఏమిటో ఈ రాత్రే తేలుతుంది! ఇప్పుడు మనం రేవతి ఫ్లాట్ కెళ్ళాలి."

"ఎందుకు?"

"వాళ్ళ పథకం ఏమిటో కనుక్కోవాలి. సూట్ కేసు-బట్టల వ్యవహారం తెలుసుకోవాలి"

"కానీ, అక్కడికి వెళ్ళితే నరేష్ తిర-"

"నే నిప్పుడు నరేష్ని లక్ష్యపెట్టను. అతని లవ్ ఫ్లాట్ గురించి భార్యకే తెలిసిపోయాక మనల్ని పట్టించుకోడు."

కారు పదినిమిషాల్లో వనరాజ్ ఫ్లాట్స్ చేరుకుంది.

"లాల్, నరేష్తో ఏం మాట్లాడాలి?"

"అతని భార్య తిరిగి వచ్చిందని చెప్పాలి. మనం ఇక్కడికి కొచ్చినందుకు అతను ఉగ్రుడవవచ్చు - ఈ స్థలం గురించి అతని భార్యకు తెలిసిపోయిందని చెప్పాలి. ఉమ ఇక్కడికొచ్చి ఏం చేసిందో మనకు తెలియదు. నరేష్ ఇక్కడ ఉన్నాడో లేదో కూడా తెలియదు. నరేష్ తీసుకొచ్చిన సూట్ కేసులో ఉమ దుస్తులుండక పోవచ్చు. ఉమ దగ్గర మనం సూట్ కేసూ, బట్టలూ చూశాం - అవే

ఇవి కావడానికి వీల్లేదు." అన్నాడు లాల్.

"అవును. ఇప్పుడు ఉమ దగ్గర వున్నది ఆకుపచ్చ సూట్ కేసు. నరేష్ తీసికెళ్ళింది బ్లూ కలర్."

"అలాగే లాండ్రీ బట్టలు, అవి ఉమవి కాకపోవచ్చు. అతనివే కావచ్చు. రేవతితో వూరు వదిలే ఆలోచనలతో ఆ సూట్ కేసులో తన బట్టలు తీసుకొని వచ్చి వుండ వచ్చు."

"దటీజ్ రైట్. కానీ-సాయంత్రం రేవతి ఆ సూట్ కేసుతో బయటికెళ్ళింది. అంటే నరేష్‌ని కలుసుకుంది. కనుక వాళ్ళిద్దరు సిటీ వదిలి వెళ్ళిపోయారా? అయితే ఉమ ఇక్కడ కొచ్చి ఏం చేసింది?"

"ఆమె ఏమీ చెప్పలేదు. ఆ విషయాలు మాట్లాడానికే విసుక్కుంది. ఇక్కడికొచ్చి వాళ్ళిద్దరు లేకపోవడంతో నిరాశగా వెళ్ళిపోయింది...."

"నో, నువ్వు ఫోన్ చేసినప్పుడు భర్త ఫోన్ అను కుని డిస్కనెక్ట్ చేసింది. ఇక్కడ ఆమె భర్తను చూసి వుండకపోతే డిస్కనెక్ట్ చెయ్యదు. ఆమె ఇక్కడికొచ్చి భర్తను చూసింది!"

"కానీ-ఆమె అర్ధరాత్రి స్నానం చెయ్యడం నాకు నచ్చలేదు!" అన్నాడు లాల్.

ఇద్దరూ నిశ్శబ్దంగా మూడవ అంతస్తు చేరుకున్నారు. కారిడార్‌లో దీపాలు వెలుగుతున్నాయి. అన్ని ఫ్లాట్స్ తలుపులు మూసి వున్నాయి. ఇద్దరూ నంబరు నాలుగవ నెంబర్ ఫ్లాట్ దగ్గర ఆగారు.

లోపల ఫ్యాను తిరుగుతున్న శబ్దం విన్పిస్తోంది.

లాల్ కాస్సేపు సందేహించి బెల్ నొక్కాడు. సమా

ధానం రాలేదు. కాస్సేపాగి మళ్ళీ నొక్కాడు. సమాధానం లేదు. ఎవరి మాటలూ విన్పించడం లేదు. నెమ్మదిగా తలుపు నెట్టాడు. తెరుచుకుంది. లోన లైటు వెలుగుతోంది. సందేహించి ఒక అడుగు లోనికేశాడు."

"హల్లో! లోపలెవరున్నారు?"

సమాధానం లేదు. గబగబ నాలుగడుగులేశాడు. జాన్ వెనుక కదిలాడు. ఇద్దరూ ముందుగది దాటి బెడ్‌రూంలో కొచ్చారు అక్కడా లైటు వెలుగుతోంది. గదిలో ఎవరూ లేరు. ఇంతలో జాన్ నోరువిప్పి ఏదో చెప్పబోయాడు. లాల్ వారించి చెవులు రిక్కించాడు.

'ఏమిటి?' జాన్ అడిగాడు.

'నీళ్ళ చప్పుడు.'

'ఎక్కడ?'

'బహుశ బాత్‌రూంలో.'

ఇద్దరూ బెడ్‌రూం నుంచి కిచెన్‌లోకి, ఆ తర్వాత బాత్‌రూంకి చేరుకున్నారు.

లోన షవర్ నుంచి నీళ్ళు పడుతున్న శబ్దం విన్పిస్తోంది.

జాన్ గాభరాగా చూసి గుసగుసలాడాడు, 'లోపల ఆమె స్నానం చేస్తోంది. ఇక్కడ మనల్ని చూస్తే.... గాడ్! వెళ్ళిపోదాం, పద!'

లాల్ బాత్ రూం తలుపుకి చెవి ఆనించి శ్రద్ధగా వింటున్నాడు. అతని ముఖంలో రంగులు వేగంగా మారుతున్నాయి. ఒక నిమిషం శ్రద్ధగా విని, తలుపు హాండిల్ తిప్పి, జాగ్రత్తగా తెరిచాడు.

లోనికి తొంగి చూసి, ఛటుక్కున తలుపు మూసి

వెనక్కి తిరిగాడు.

"ఏమిటి? ఎవరున్నారు?"

"శవం."

జాన్ వూపిరి బిగబట్టి తలుపుతీసి లోనికి చూసి, తిరిగి మూసి నిట్టూర్చాడు.

"ఇప్పుడేం చెయ్యాలి?"

"కృష్ణన్‌కి ఫోన్ చెయ్యి."

"ఆ షవర్ మూసేస్తే?"

"కృష్ణన్ వచ్చే వరకు మనం ఇక్కడ ఏదీ ముట్టుకో కూడదు, ఫోన్ తప్ప."

జాన్ గబగబ ముందు గదిలోకి కదిలాడు. లాల్ వెంబడించాడు. జాన్ కర్చీఫ్‌తో రిసీవర్ ఎత్తి డయల్ చెయ్యసాగాడు.

ఇంతలో బయట అడుగుల చప్పుడు విన్పించింది. ఆ అడుగుల్ని లాల్ పసిగట్టాడు; ఆడవాళ్ళ హీల్ చెప్పుల శబ్దం.

చటుక్కున తిరిగి, 'ష్!.... ఆమె వస్తోంది!' అన్నాడు జాన్‌తో. మరుక్షణం రేవతి లోనికి ప్రవేశించింది, చేతిలో హేండ్ బ్యాగుతో.

తెరచి వున్న తలుపునీ, వెలుగుతున్న లైట్లనీ, లోపల డిటెక్టివ్‌లనీ చూసి కొయ్యబారి పోయింది.

'ఎవరు మీరు? ఏం చేస్తున్నారిక్కడ!' అంది కంగారుగా.

'మీరెక్కడ నుంచి వస్తున్నారు?' లాల్ అడిగాడు.

"మీ రెవరు అడగడానికి!" అరిచిందామె, 'రాత్రి పూట ఎవరూ లేని సమయంలో రహస్యంగా నా ఇంట్లో

ప్రవేశించి....మీ రిక్కడేం చేస్తున్నారు?"

"మీ కోసం ఎదురు చూస్తున్నాం."

"నా కోసమా ? ఎందుకు ? మీ రెవరసలు ?"

"తెలుస్తుంది. మేం మిస్టర్ నరేష్‌ని కలవడానికి వచ్చాం. బెల్ నొక్కితే సమాధానం లేదు. తలుపునెడితే తెరుచుకుంది. లోనికొచ్చేశాం. అభ్యంతరమా ?"

ఆమె ఉలికి పడింది, " నరేష్ ! అతనిక్కడెందు కుంటాడు ?"

"వున్నాడు"

"వున్నాడా ! ఎక్కడ ?"

"స్నానాల గదిలో."

"ఓహ్ ! ఏమిటి మీరనేది ?"

"పదండి, చూపిస్తాను".

లాల్ ఆమె చెయ్యి పట్టుకొని తీసికెళ్ళాడు. జాన్ ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. బాత్‌రూం దగ్గర ఆగి, తలుపు తెరిచి లోపల శవం చూపించాడు లాల్.

రేవతి చేతుల్లో ముఖం దాచుకొని కెవ్వుమని అరిచి అక్కడి నుంచి పరుగుతీసింది. బెడ్ రూం లో మంచం మీద కూలబడి మరుక్షణం మూర్ఛపోయింది.

స్నానాలగదిలో నరేష్ ఒంటిమీద అండర్ వియర్‌తో నేలమీద బోర్లాపడి వున్నాడు. అతడి వీపులో కత్తి పిడి వరకు దిగబడి వుంది. షవర్ నుంచి పడుతున్న నీళ్ళు శవాన్ని తడిపేస్తున్నాయి. గదిలో ఎక్కడా రక్తం మరకలు లేవు.

నరేష్ ప్యాంటు, షర్టు, స్టాండు మీద వేలాడుతున్నాయి.

# 7

క్రైం ఇన్‌స్పెక్టర్ బాలకృష్ణన్ పది నిమిషాల్లో తన స్టాఫ్‌తో ఫ్లాట్ చేరుకున్నారు. ఈ పోలీసు హడావుడికి ఫ్లాట్స్‌లోని వాళ్ళంతా మేల్కొన్నారు. భయంతో తలుపులూ, కిటికీలూ వేసుకుని, హత్యగురించి చర్చించుకుంటూ థ్రిల్ అనుభవించ సాగారు. కానీ, రేవతి ప్రక్క ఫ్లాట్‌లోని స్త్రీమాత్రం అందరిలాకాక, మాటిమాటికీ కారిడార్‌లోకి వచ్చి తొంగి చూడసాగింది.

లాల్ కన్ను ఆమెపైన పడింది.

బాత్‌రూంలో శవంమీద ఫార్మాలిటీస్ అన్నీ పూర్తయ్యాక, అంబులెన్స్‌లో మార్చ్యురీకి తరలించారు.

మూర్ఛపోయిన సుమారు అరగంటకి తెలివిలోకొచ్చింది రేవతి. అంతవరకు ఆమెని కనిపెట్టుకొని వున్న జాన్, ఆమెలో కదలిక చూసి మంచినీళ్లు తాగించాడు.

లాల్ కేసు గురించి కృష్ణన్‌కి వివరిస్తూ రేవతివున్న గదికి వచ్చాడు. కృష్ణన్ వెంబడిస్తూ వచ్చి ఉషను వెంటనే కస్టడీలోకి తీసుకోవాలని చెప్పాడు. ఆమె పారిపోవాలనుకుంటే ఇంటికెళ్ళి వుండేదికాదు గనుక ఆ అవసరం లేదని చెప్పాడు లాల్.

ఆతర్వాత రేవతిని ఇంటరాగేట్ చేశాడు.

"మీరెక్కడికి వెళ్ళి వస్తున్నారు?"

"ఫ్రెండ్స్ దగ్గరికి"

"ఆడా? మగా?"

"దేవి, రాణీ, శోభ, మేరీ - నేను - మేమంతా ఈరాత్రి పార్టీ చేసుకున్నాం"

"ఏ సంవత్సరంలో?"

"దేవి మెడిసిన్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యింది"

"పార్టీ ఎక్కడ జరిగింది?"

"ఆమె ఇంట్లో?"

"ఇల్లెక్కడ? ఆమె ఎవరు?"

"ఇల్లు పంజగుట్టలో. ఆమె ఇన్‌స్పెక్టర్ రావ్ కూతురు. పార్టీలో ఆయనకూడ వున్నారు."

"ఆయన పోలీసు ఇన్‌స్పెక్టరా?"

"అవును. సుల్తాన్ బజార్ స్టేషన్‌లో సబ్ ఇన్‌స్పెక్టర్."

"మీ రక్కడికి ఎప్పుడెళ్ళారు?"

"సాయంత్రం ఏడు గంటలకి"

"ఎప్పుడొచ్చారు?"

"మీరు చూసినప్పుడే-సుమారు ఒంటి గంటకు."

"ఈ మధ్య కాలమంతా అక్కడే వున్నారా?"

"అవును. కానీ-"

"ఏమిటి?"

"11 గంటలకు బయట కెళ్ళాను."

"ఎక్కడికి?"

ఆమె ఇబ్బందిగా చూసింది, "క్షమించండి. ఈ ప్రశ్నకు సమాధాన మివ్వలేను. అదికొన్ని విషమ పరిస్థితులకి దారితీస్తుంది."

"అంటే"

"ఒకరి రహస్యాలు కాపాడే బాధ్యత నాపైన వుంది"

"ఎవరి రహస్యాలు:"

"విషయం ఎలాంటిది?"

"ప్రేమవ్యవహారం."

"మీరు నరేష్‌ని ప్రేమిస్తున్నారు కదా?"

"అవును. కానీ- నేనతని భార్యను కాను."

"అంటే- ఇంకెందర్ని ప్రేమిస్తున్నారు?"

"ఎందరినైనా ప్రేమించే స్వేచ్ఛా, హక్కూ నాకు వున్నాయి. నాక్కావలసింది డబ్బు, డబ్బిచ్చి మీరు కూడ ప్రేమించవచ్చు."

"ఐ. సీ."

"లేకపోతే ఒక సామాన్య బ్యాంక్ ఉద్యోగి ఇంట్లో అఫ్రిజ్, ఈ ఫోమ్ బెడ్, ఇంకా ఇతర విలువైన వస్తువులన్నీ ఎలా వచ్చాయనుకుంటున్నారు."

"ఐ. సీ. అయితే మీరు 11 గంటలకు ఎక్కడికి వెళ్ళారో చెప్పరన్నమాట,"

"అది చెబితే అతన్ని కూడా వెలుగులోకి లాగవలసి వస్తుంది. అతనికి భార్యా పిల్లలున్నారు. మా స్నేహం వాళ్ళకి తెలిసి అనవసర రభస జరుగుతుంది. అది నాకిష్టం లేదు"

లాల్ ఆమెను తీక్షణంగా చూశాడు.

"కానీ- మీరు ఈ హత్యలో ఇరుక్కుని జైలు పాలు కావచ్చు"

"పరవాలేదు. అతని విశ్వాసాన్ని వమ్ము చెయ్యను."

"సరే,అక్కడి కెళ్ళి తిరిగి ఎక్కడికి కొచ్చారు?"

"పార్టీకే."

"ఎన్ని గంటలకి?"

"సుమారు ముప్పావు గంటకి వచ్చాను. అంటే 11.45 కి."

"అయితే 11.00 నుండి 11.45 వరకు మీరు అజ్ఞాత ప్రియుడ్ని కలుసుకున్నారు కాబట్టి, ఆ సమయంలో మీకు ఎలిబీ లేదన్న మాట."

'నేను నిర్దోషిని. నాకు ఎలిబీ అనవసరం.'

"మంచిది. ఆ నలభై అయిదు నిమిషాల కాలం అతని వద్దకు వెళ్ళి రావడానికే పరి పోతుందను కుంటాను?"

"అవును."

"అంటే - మీరక్కడ వుండలేదా? అసలు పార్టీ మధ్యలో అలా వెళ్ళే అవసరమెందుకొచ్చింది?"

'అతనితో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడ వలసి వుంది. వెంటనే మాట్లాడి వచ్చేశాను.'

"తిరిగి పార్టీ కొచ్చారు. తర్వాత?"

'పార్టీ 12 గంటలకు ముగిసింది. వెంటనే ఇక్కడికి బయలుదేరి వచ్చేశాను.'

"ఎలా వచ్చారు?"

"ఆటోలో."

"ఎన్ని గంటలకి చేరుకున్నారు?"

'చెప్పాను-సుమారు ఒంటి గంటకి.'

'ఆశ్చర్యంగా వుంది. ఆటో పంజగుట్ట నుండి బయలు దేరి బాలానగర్ చేరడానికి గంట పట్టిందా?'

'ఆగండి - ఏమిటి-నేనే మన్నాను? మిస్టర్ లాల్-మధ్యలో ఒక చోట ఆగింది।"

'ఎందుకు? ట్రాఫిక్ జామ్ అయిందా?'

'ఓహ్। ఆగింది ఆటో కాదు, నేను।'

"మిస్. రేవతి, కంగారు పడకండి. నిదానంగా

చెప్పండి, దారిలో మీరెక్కడ ఆగారు?"

"సనత్‌నగర్‌లో ఒక ఫ్రెండ్ దగ్గర"

'ఎందుకు?'

"నాకు భయం వేసింది!"

"దేనికి?"

"ఉమ-ఉమ-నరేష్ భార్య గురించి భయపడ్డాను."

"ఎందుకు?"

రేవతి అంది, "నరేష్ ఆమె గురించి వింతకథ చెప్పాడు. ఉదయం నేను ఆఫీసు కెళ్తున్న సమయంలో గాభరాగా వచ్చాడు. మా గురించి భార్యకి తెలిసి పోయిం దని చెప్పాడు. మూడు రోజులక్రితం అతనికి నే నొక లాండ్రీ రశీదు ఇచ్చాను. ఆ లాండ్రీలో నేను బట్టలు వేసి చాలా రోజులైంది తెచ్చుకోడానికి రోజూ మర్చి పోతున్నాను. ఈ విషయం తెలుసుకుని నరేష్ ఆ రశీదు తీసుకున్నాడు ...

"అతనేమీ తక్కువ కాదు! నాకు మించిన మతి మరుపు వుంది. మూడురోజులు రశీదు జేబులో పెట్టుకుని అలాగే తిరిగాడు. మొన్నరాత్రి భార్యతో తగవు వచ్చిం దట. ఆమె ఇల్లు విడిచి ఎక్కడికో వెళ్ళిపోయింది. ఈ రోజు మీకు రిపోర్టు చేశానని చెప్పాడు.

"అయితే-మీరు ప్రశ్నలు వేస్తున్నప్పుడు అతనికో అనుమానం వచ్చిందట. మా వ్యవహారం తెలుసుకో డానికే ఉమ అలా వెళ్ళిపోయింది. వెంటనే అతనికి విడిచేసిన షర్టులోని నా లాండ్రీరశీదు గుర్తుకొచ్చి ఇంటి కెళ్ళాడట. ఒకవేళ ఆమె ఆ రశీదు చూసి, దాని ద్వారా నా ఆచూకీ తెలుసుకుందేమో నని భయపడి వెంటనే

లాండ్రీకెళ్ళి కనుక్కున్నాడట.

"ఆ లాండ్రీకి నేను రెగ్యులర్ కస్టమర్ని. నిన్న ఉదయం ఉమ ఆ లాండ్రీలో నా గురించి తెలుసుకుంది .... "

"తర్వాత ?" లాల్ అడిగాడు.

"ఉమకు నా గురించి తెలిసి పోయింది. గనక ఏ క్షణాన్నైనా ఇక్కడికి రావచ్చని భయపడ్డాడు."

"అయితే ఏం చెయ్యాలనుకున్నాడు ?"

"ఆమెకోసం సాయంత్రం తాను ఇక్కడ ఎదురు చూస్తానని చెప్పాడు. ఆమె వస్తే గొడవ జరక్కుండా ప్రశాంతంగా మాట్లాడి, నచ్చచెప్పి పంపాలనుకున్నాడు"

"ఏమని ?"

'ఆ విషయం ఉదయం చెప్పలేదు. సాయంత్రం ఆరు గంటలకి ఆబిడ్స్ తాజ్‌కి రమ్మన్నాడు.'

'అప్పుడు మీ చేతిలో ఏముంది?'

'సూట్ కేసు.'

"గుడ్. దాన్ని ఏం చేశారు?"

"ఉదయం అతను సూట్ కేసులో ఇంట్లోంచి తన మాసిన బట్ట తెచ్చి, లాండ్రీకి వేసి, నా బట్టలు తీసుకొని ఫ్లాట్ కొచ్చాడు. సాయంత్రం ఆ ఖాళీ సూట్ కేసు తీసుకొని తాజ్‌కి రమ్మన్నాడు. ఆ తర్వాత అతనింటి కెళ్ళి సూట్ కేసు పెట్టేశాడు."

ఆమె మాటలు విని జాన్ కళ్ళు చీకట్లు కమ్మాయి.

"హోటల్‌లో మీరేం మాట్లాడు కున్నారు?

రేవతి అంది, 'మా గురించి-మా స్నేహం గురించి. అతను తన భార్యకు చాలా అన్యాయం చేస్తున్నట్లు

గ్రహించాట్ట! భార్య కళ్ళ ముందున్నంత వరకూ ఏమీ అనిపించలేదు. ఆమె కనిపించక పోయేసరికి ఎక్కడ లేని వాత్సల్యం పుట్టు కొచ్చి బుద్ధులు మార్చుకున్నాడు. మిస్టర్ లాల్, హోటల్‌లో టిఫిన్ పూర్తి చేసే వరకూ అతనేమీ చెప్పలేదు. కాఫీ తాగి కప్పు కింద పెడుతూ నన్ను మర్చిపొమ్మన్నాడు!"

"మీరే మన్నారు?"

'నేనే మంటాను! అతని మాటలకి కాఫీ గుటకపడక గొంతు మండింది!'

"ఆ తర్వాత ఒళ్ళు మండిందనుకుంటాను." జాన్ అన్నాడు.

"అది సహజం." రేవతి అంది, "నేను నరేష్‌ని అందరిలా డబ్బు కోసం ప్రేమించలేదు. నరేష్‌లా ఎవరూ నా అవసరాలు గుర్తించరు. నేను అనాధని. నరేష్ తప్ప నాకష్టసుఖాలు తెలుసుకునే వారు లేరు. అతన్ని తన భార్య కంటే ఎక్కువ ప్రేమించాను. అతను భార్యకు విడాకులిస్తే, ఈ నికృష్టపు జీవితం చాలించి అతనితో మనశ్శాంతిగా గడపాలను కున్నాను. కానీ, అతను విడాకులకు ఒప్పుకోలేదు. ఆ రోజుతో మా స్నేహం సమాప్త మని చెప్పాడు. బాగా ఆలోచించ మని చెప్పాను. రాత్రి తను ఫ్లాట్‌లో వుంటానని, నేను పార్టీ నుండి వచ్చాక వివరంగా మాట్లాడు కుందా మని చెప్పాడు. నేను వెళ్ళి పోయాను."

లాల్ అన్నాడు, "పన్నెండు గంటలకి పార్టీనుండి వస్తూ మీరు సనత్‌నగర్‌లో ఫ్రెండు దగ్గర ఆగారన్న మాట. నిజంగా మీకు ఉమ అంటే భయం వుందా?"

''ఏ భార్యా తన భర్త ప్రియురాల్ని సహించదు. నేనామె కంట బడితే గాయపర్చకుండా వదలదు. అందుకే భయపడ్డాను.''

''ఫ్రెండ్ దగ్గర ఎంతసేపు వున్నారు?''

''10-15 నిమిషాలు. ఇక్కడేం జరిగిందో నాకు తెలీదు. ఉమ వచ్చిందో లేదో కనుక్కుందామని ఫోన్ చేశాను. సమాధానం లేదు. కానీ, వచ్చి చూస్తే ఇక్కడ మీరు-నరేష్-''

"నరేష్ ఇక్కడికెప్పుడొచ్చాడు?"

"ఎనిమిది గంటలకనుకుంటాను."

''మంచిది. ఈ హత్యమీద మీ అభిప్రాయమేమిటి?''

''ఉమ ఇక్కడికొచ్చి వుంటుందని మాత్రం చెప్పగలను.

"అంటే, ఆమె హత్య చేసిందా?"

"నాకు తెలియదు."

"వెల్, 11 నుంచి 11-45 వరకు ఎలిబీ చూపడానికి మీ వ్యక్తిగత కారణాల వలన నిరాకరిస్తున్నారు. ఒక వేళ హత్య ఈ మధ్య కాలంలో జరిగి వుంటే మీరు చిక్కుల్లో పడతారు."

''కానీ, మీరు ఉమ ఎలిబీని కూడా చెక్ చెయ్యాలి.'' అంది రేవతి.

లాల్ లేచాడు, "అవును. మీ ఎలిబీ కూడా చెక్ చేస్తాం. పోలీసులకి తెలియచేయకుండా మీరెక్కడికీ వెళ్ళకూడదు. గుడ్‌నైట్."

# 8

ఇద్దరూ బయటికొచ్చాక లాల్ ప్రక్క ఫ్లాట్ ముందా గాడు. కృష్ణన్ హత్యాస్థలంలో మిగతా తతంగం చూస్తు న్నాడు.

ఇందాక తచ్చాడుతూ కన్పించిన ప్రక్కఫ్లాట్ స్త్రీ తలుపేసుకుని లోపల కూర్చుంది. లాల్ బెల్ నొక్కాడు. కొన్ని క్షణాలు గడిచాక తలుపు తెరచి ఆస్త్రీ కలవరంగా చూసింది.

"హల్లో, ఆంటీ!" అన్నాడు లాల్.

ముఖం చిట్లించిందామె, "ఆంటీ! ఎవరు నీకు ఆంటీ?"

"మీరే!"

"నేనా! ఎవర్నువ్వు? ఏంకావాలి నీకు?"

"మేం పోలీసు మనుషులం-హత్య గురించి మాట్లా డాలి"

ఉలికి పడిందామె, "ఏం మాట్లాడాలి? నాకేం తెలుసు?"

"ప్రక్కఫ్లాట్ లో హత్య జరిగింది. మీరిందాక మాటి మాటికీ తొంగి చూశారు-మిమ్మల్ని నేను చూశాను."

'ఓ! ఇలావచ్చి కూర్చో, నీకు చెబుతాను.'

'చెప్పండి.'

"హత్య ఎవరు చేశారో నాకు తెలుసు."

"ఎవరు?"

"ఒక అమ్మాయి."

'అమ్మాయా? ఎన్నేళ్ళు?'

"నాకు యాభైఏళ్లు. పాతికేళ్ళ ఆడదైనా నాక ష్మాయే!"

లాల్ ముందుకు వంగాడు, "ఆమెనెలా చూశారు? ఎప్పుడు చూశారు?"

ఆమె అంది, 'తొమ్మిదిన్నరకి నేను బయట నిలబడి మీ అంకుల్ కోసం ఎదురు చూస్తున్నాను. ఇంతలో ఆమె కన్పించింది. గాభరాగా వచ్చి రేవతి ఫ్లాట్ బెల్ నొక్కింది. ఫ్లాట్‌లో రేవతిలేదు. గంటసేపటి నుండి ఎవరో మనిషి వున్నాడు. అతను తలుపు తెరిచాడు. ఆమె లోపికెళ్ళింది. మరుక్షణం పెద్దగా అరుపులు విన్పించాయి....'

'ఆ తర్వాత?'

'నేను తలుపు వేసుకుని లోపల వింటున్నాను. దాదాపు పది నిమిషాలు గొడవ జరిగాక సద్దు మణిగింది.'

'ఎన్ని గొంతులు విన్పించాయి?'

'రెండు; ఒక ఆడ-ఒక మగ.'

'ఆ తర్వాత?'

'నాకు తెలియదు. నేను బయటి కెళ్ళలేదు. బహుశ ఆమె వెంటనే వెళ్ళి పోయింవను కుంటాను. రేవతి గురించి ఇక్కడెవరికీ సదభి ప్రాయం లేదు. మేమంతా కలసి ఆమెని తరిమేయాలను కుంటున్నాము....'

'ఆ తర్వాత మీ కేమీ చప్పుళ్ళు విన్పించలేదా?'

'లేదు.'

'కేక-లేదా, కనీసం ఒక చిన్న మూల్గు....'

'లేదు! లేదు! అలాటి దేమీ లేదు.'

'ఆమెని సరిగ్గా 9.30 కి చూశానని నమ్మకంగా చెప్ప

గలరా?'

"ఆమెని సరిగ్గా 9.30 కి చూశాను-పొరపాటు లేదు."

'ఆమె చేతిలో ఏముంది?'

"వట్టి చేతులతో వచ్చింది."

'ఆమె ఎలా వుంటుంది?'

'తెల్లగా వుంటుంది. గుండ్రటి కళ్ళు, నొక్కుల జుత్తు. ఆకు పచ్చ చీర కట్టుకుంది.....'

లాల్ నవ్వుతూ చూసి, జేబులోంచి ఒక ఫోటో తీసి ఆమెకు చూపించాడు.

తలూపిందామె, 'అవును, నేను చూసింది ఈమే.'

# 9

మర్నాడు - ఆదివారం మధ్యాహ్నం ఇన్‌స్పెక్టర్ కృష్ణన్, డాక్టర్ రఘునాధ్‌తో ఏజెన్సీ ఆఫీసులో ప్రవేశించాడు. లాల్ ఆహ్వానించాడు.

సుమారు గంటసేపటి నుంచీ లైబ్రరీలో డాక్టర్ రీమాయిన్ స్నిడర్ - 'హోమిసైడ్ ఇన్వెస్టిగేషన్' గ్రంథం తిరగేస్తున్న జాన్, ఆఫీసు గదిలో మాటలు విన్పించడంతో బయటికి వచ్చాడు.

'మిస్టర్ లాల్! ఇంత సింపుల్ కేసు నా అనుభవంలో ఎప్పుడూ తటస్థపడ్లేదు!' అంటున్నాడు కృష్ణన్, విలాసంగా సిగరెట్ తాగుతూ, 'జరగని హత్య గురించి మీరు లేనిపోని అనుమానాలు కల్పించుకుని తల బద్దలు చేసుకున్నారు గానీ - జరిగిన హత్యను నేను చిటికెలో తేల్చి పారేశాను.'

'ఏం చేశారు?' లాల్ అడిగాడు.

'మీరు చెప్పిన ప్రకారం ఉమను కస్టడీలోకి తీసుకున్నాను. ఆమె ఏమీ చెప్పడం లేదు. విభ్రాంతంగా చూస్తూ, ఒక్క ముక్కలో, 'నాకేమీ తెలియదు, నేనేమీ చెయ్య లేదు' అంటోంది. అయితే నిన్న రాత్రి తొమ్మిదిన్నరకి రేవతి ఫ్లాట్ కి వెళ్ళి భర్తతో పోట్లాడిన విషయం ఒప్పుకుంది. రేవతి ఎలిబీ చెక్ చేశాను. ఆమెకు బలమైన ఎలిబీ వుంది. పోలీస్ ఇన్ స్పెక్టర్ ఆమెకు సాక్ష్యం.

'ఇన్ స్పెక్టర్ రావ్, రేవతి నిన్న సాయంత్రం ఏడు గంటలకు తమ యింట్లో జరిగిన పార్టీకి వచ్చి, రాత్రి పన్నెండు గంటల వరకు వున్నట్లు స్టేట్ మెంట్ ఇచ్చాడు-అయితే పదకొండు గంటల నుండి నలభై అయిదు నిమిషాలు సేపు మినహాయించి, మిగతా సమయమంతా ఆమె తన సమక్షంలోనే వున్నట్లు చెప్పాడు. ఆ 45 నిమిషాల సేపు ఆమె కెళ్ళి వచ్చిందట-ఎక్కడికెళ్లిందో చెప్పలేదట.

'పన్నెండు గంటలకు పార్టీ ముగిశాక ఆమె ఫ్లాట్ కు వెళుతూ, దారిలో సనత్ నగర్ లోని తన ఫ్రెండ్ మిస్ రూప ఇంటి కెళ్ళింది. అక్కడ పావు గంట వుండి, ఫ్లాట్ కి ఫోన్ చేసి, రెస్పాన్స్ రాకపోవడంతో బయలుదేరి వచ్చేసింది. ఆమె సుమారు ఒంటి గంటకు ఫ్లాట్ చేరుకుంది.

"ఇక- పోస్టుమార్టమ్ నిర్వహించిన డాక్టర్ రఘునాద్ హత్య నిన్నరాత్రి ఎనిమిది గంటల నుండి పది గంటల మధ్యకాలంలో జరిగిందని నిర్ణయించారు."

"వెరీ వెల్!' అన్నాడు లాల్.

'హత్య 8 నుండి 10 మధ్య జరిగింది కాబట్టి, ఆ

సమయంలో అనుమానితులిద్దరూ ఎవరెక్కడున్నారో ఆలోచిస్తే- రేవతి పార్టీలో వుంది, ఉమ తొమ్మిదిన్నరకి ఫ్లాట్ కి వచ్చింది."

'దటీజ్ రైట్"

'ఆ సమయంలో రేవతి పార్టీలో వున్నట్లు ఎలిబీ వుంది. కనుక ఆమె 11-00నుండి 11-45 వరకు ఎక్కడ వుందన్నది మనకనవసరం - ఆ సమయంలో హత్య జరగ లేదు కాబట్టి. ఆమె స్టేట్ మెంటు ప్రకారం ఆ సమయంలో ఆమె అజ్ఞాత ప్రియుడ్ని కలుసుకుంది.

'రాత్రి 9-30కి ఉమ రేవతి ఫ్లాట్ కి వచ్చినట్లు ప్రక్క ఫ్లాట్ స్త్రీ మిసెస్ కైలాసం సాక్ష్యం వుంది. ఆమె ఉమను గుర్తించింది. ఆమె కథనం ప్రకారం ఉమ లోని కెళ్ళి అక్కడున్న మనిషితో పోట్లాడింది. అతనెవరో మనకు తెలుసు: హతుడు, నరేష్- ఉమ భర్త. హత్యాయుధం కత్తి ఉమ తమ ఇంట్లోదేనని గుర్తించింది. ఆమె ఆ కత్తితో భర్త వీపులో పొడిచి చంపింది.

'మొన్న ఉదయం ఉమ ఇంటి నుండి అదృశ్యమై హోటల్ పారడైజ్‌లో బసచేసింది ఆమె సూట్ కేసుతో వచ్చిందని హోటల్ స్టాఫ్ కథనం. రూం బుక్ చేసుకున్న రోజు పగలంతా ఆమె గదిలోనే వుంది, రాత్రి బయట కెళ్ళి వచ్చింది. బహుశ రేవతి ఫ్లాట్ కెళ్ళి భర్త కోసం చూసిందను కుంటాను-ఆ రాత్రి రేవతి నరేష్‌తో సినిమా కెళ్ళింది.

'నిన్న రాత్రి కూడా ఆమె అలాగే బయట కెళ్ళింది. అప్పుడు సమయం సుమారు 8:30. తిరిగి ఆమె పదకొండు గంటలకి ఆందోళనగా వచ్చి రూం ఖాళీ చేసి

వెళ్ళి పోయింది. అంటే - ఆమె హోటల్ నుండి ఫ్లాట్ కెళ్ళి, భర్తతో పోట్లాడి, కత్తితో పొడిచి, తిరిగి హోటల్ కొచ్చి, రూం ఖాళీ చేసి వెళ్ళి పోయింది.'

కృష్ణన్ చెప్పడం ఆపి, గర్వంగా చూసి, భుజా లెగ రేశాడు.

లాల్ అన్నాడు, 'అవును. ఈ కేసులో చిక్కులేమీ లేవు.'

'దటీజ్ రైట్. భర్తని హత్యచేసి ఆమె ఇంటికెళ్ళి స్నానం చేసి చక్కగా ముస్తాబైంది। దీన్నిబట్టి ఆమెకు భర్తమీద ఎంత కోపం, కసి వున్నాయో వూహించవచ్చు. రేవతి కథనం ప్రకారం సూట్ కేసూ, బట్టల గురించి చెప్పింది నిజమని తెలుసుకున్నాను. దట్సాల్, మిస్టర్ లాల్. ఇక ఈ కేసు ఫైలు సిద్ధం చేసి పబ్లిక్ ప్రాసిక్యూటర్ కి పంపుతాను." అన్నాడు కృష్ణన్.

లాల్ తలూపాడు. "విత్ ప్లెజర్। ఈ కేసులో హత్య చెయ్యబడిందనుకున్న మనిషే హత్య చేసింది।"

"జస్ట్ ఎ మినిట్ ప్లీజ్।" జాన్ అన్నాడు.

కృష్ణన్ తలతిప్పి చూశాడు, "ఏమిటి?"

"హత్య ఎలా జరిగింది?"

"చెప్పాను - కత్తితో"

"ఎప్పుడు జరిగింది?"

"అదికూడ చెప్పాను-పోస్టుమార్టమ్ రిపోర్టు ప్రకారం నిన్నరాత్రి 8-00 నుండి 10-00 గంటల మధ్య జరిగింది."

'అప్పుడు హతుడు ఏం చేస్తున్నాడు?'

'అంటే?'

జాన్ అన్నాడు. 'శవం మనకు బాత్ రూంలో కన్పిం

చింది. శవాన్నిబట్టి చూస్తే హత్య జరిగినప్పుడు హతుడు స్నానం చేస్తుండాలి-లేదా, స్నానాని కుపక్రమిస్తుండాలి. అంతేనా?'

'నో, నో-మిస్టర్ జాన్. హత్య జరక్క ముందు హతుడికీ, హంతకురాలికీ మధ్య వాగ్వివాదం జరిగింది. హంతకురాలు వచ్చినప్పుడు హతుడు తలుపు తెరిచాడని మరువకండి. అప్పుడతను స్నానం చేస్తుండే వీలులేదు. అతని ఒంటి మీద దుస్తులున్నాయి. వాగ్వివాదం జరిగాక హంతకురాలు అతన్ని కత్తితో పొడిచి, ఆ తర్వాత దుస్తులు ఒలిచి, వంటి మీద కేవలం అండర్ వియర్‌తో తీసి కెళ్ళి స్నానాల గదిలో పడేసింది.'

'అలా ఎందుకు చేసింది? ఏమిటి ఉద్దేశం?'

'హంతకురాలి ఉద్దేశ్యంలో ప్రత్యేకమైన కారణ ముండాలి. అది మనకు తెలియదు. బహుశ రక్తస్రావం ఎక్కువ కావడంవల్ల బాత్ రూంలో పడేసి షవర్ తిప్పి వుంటుంది-షవర్ నీటిలో రక్తంకొట్టుకుపోతుంది. లేదా, హత్యాయుధం కత్తి తిరిగి హతుని శరీరంనుండి తొలగించడంలో విఫలమై-వేలిముద్రల భయంతో శవాన్ని బాత్ రూమ్‌లో చేర్చి వుండవచ్చు. షవర్ నీటిలో కత్తిమీద వేలిముద్రలు కొట్టుకుపోతాయి. లేదా-హత్య స్నానం చేస్తున్నప్పుడు జరిగిందని భావించాలని అలాచేసి వుండ వచ్చు.'

'హతుని దుస్తులు బాత్ రూంలో స్టాంపుపైన వున్నాయి కదూ?'

"అవును. షర్టు, ప్యాంటు వున్నాయి."

"బనియన్ ?"

'లేదు.'

"ఏమైంది?"

"హత్య జరిగినపుడు హతుడు బనియన్, ప్యాంటు మీద వున్నాడనుకుంటాను. మిస్టర్ జాన్, హత్యా సమయంలో సురేష్ స్నానం చెయ్యడంలేదు, స్నానానికి ఉపక్రమించడమూలేదు. అందుకు నిదర్శనం: బాత్‌రూంలో టవల్‌లేదు. టవల్ లేకుండా స్నానానికి ఎవరూ వెళ్ళరు. ఓ. కే. మీరు బనియన్ గురించి అడిగారు. అది హంతకుడాలు మాయంచేసి వుంటుంది–దానిమీద కత్తిపోటు వుంటుంది కాబట్టి."

'షర్టుమీద కత్తిపోటు వుందా?'

'లేదు. వుంటే, అదికూడా మాయమయ్యేది.'

లాల్ కల్పించుకున్నాడు, 'వెల్, జాన్. నువ్వు కేసుని క్లిష్టంగా మారుస్తున్నావు. నువ్వు ఏ గమ్యం చేరుకోవాలని ఇలా వాదిస్తూన్నావో నాకు తెలియదు. హత్య ఎవరు ఎలాచేశారో స్పష్టంగా తేలిపోతోంది. అందుకు బలమైన ఆధారాలున్నాయి. పైపైన తేలిపోతున్న ఈ కేసుని నువ్వు లోతుగా తవ్వి గజిబిజిచేసి–'

జాన్ అడ్డంగా తలూపాడు, "ఈ హత్య మీద మీ అభిప్రాయాలన్నీ పూర్తిగా సర్కమ్‌స్టేన్షియల్ ఎవిడెన్స్ మీదే ఆధారపడి వున్నాయి."

"సర్కమ్‌స్టేన్షియల్ ఎవిడెన్స్ బలంగా వుంది." అన్నాడు లాల్.

"సర్కమ్‌స్టేన్షియల్ ఎవిడెన్స్ ఎంత బలంగా వున్నా దానిమీద ఆధారపడి నిర్ణయాలు చెయ్యడం నింది

తుని విషయంలో న్యాయం చెయ్యడం కాదు."

"ఒక దశలో పరిస్థితులు మనిషిని హంతకుడ్ని చేసినా, దురదృష్టవశాత్తు ఆ పరిస్థితులే మరో దశలో పూర్తిగా వ్యతిరేకంగా కన్పిస్తే, శిక్షకు పాత్రుడైన నిందితుడికి ఎలాటి నష్టపరిహారం చెల్లిస్తారు? హత్య కేసులో పూర్తిగా పరిస్థితుల పైన ఆధారపడి నిర్ణయాలు చెయ్యడం సరికాదు-సాక్ష్యాధారాల్ని చూడాలి."

'ఈ కేసులో మనం ఏ సాక్ష్యాధారాల్ని విస్మరించాం?

'ముందు నేను మీతో కొన్ని విషయాలు చర్చించాలి. అన్నాడు జాన్, డాక్టర్ వైపు తిరిగి.

డాక్టర్ తలూపాడు; 'చెప్పండి?'

జాన్ చెప్పాడు:

'హంతకురాలు తన ఇంట్లోని కత్తితో హతుడి దగ్గరికి వచ్చింది కాబట్టి హత్య చెయ్యాలని నిర్ణయించుకుని వచ్చి వుండాలి. వెల్, ఇద్దరు వ్యక్తుల మధ్య వాగ్వివాదం జరుగుతున్నప్పుడు వాళ్లు అభిముఖంగా వుంటారు. ఈ కేసులో హతుడు-హంతకురాలు ఎదురెదురుగా నిలబడి వున్నారనుకుందాం; వాగ్వివాదం తారా స్థాయికి చేరుకుని, ఉద్రేకం పట్టరాని స్థితికి హంతకురాలు చేరుకుంటే, ఆమె కత్తితో ఎక్కడ దాడి చేస్తుంది?'

'అభిముఖంగా వుంటారు కాబట్టి ఛాతీ మీద.'

'కరెక్ట్. హంతకురాలు హత్య చెయ్యాలని నిశ్చయించుకుని వచ్చింది కాబట్టి, హతుడు చచ్చి తీరాలి కాబట్టి, గురి చూసి గుండెలో పొడుస్తుంది. అప్పుడేమవుతుంది?'

"తక్షణం-చావు-ఆగండి-కేక వెలువడుతుంది."

"వెరీ గుడ్, డాక్టర్. కానీ కేక ఎవరికీ వినిపించ లేదు ఈ కేసులో. మీ అభిప్రాయం?"

'హంతకురాలు నోరు మూసి వుండాలి.'

'హంతకురాలంటే స్త్రీ అని గమనించండి. శారీరకంగా ఆమె అశక్తురాలు. హతుడి నోరు మూసి కత్తి దించే లోపల బలిష్ఠుడైన పురుషుడు ఆమెను విదిల్చి కొట్టి దూరంగా నెట్టేస్తాడు. అప్పుడు నోరు మూసే అవకాశం లేకపోగా, కత్తి దిగబడుతుంది; కేక వెలువడుతుంది.'

"కానీ-ఈ కేసులో కత్తి వీపులో దిగింది. అంటే హంతకురాలు నోరుమూసే అవకాశం లేదు. క్షణికా వేశంలో హత్య చేస్తున్నప్పుడు కొన్ని అతి సామాన్య జాగ్రత్తల్ని విస్మరించడం జరుగుతుంది. ఈ హత్యలో హతుడు వెనక్కి తిరిగి నడుస్తున్నప్పుడు లేదా-వెనక్కి తిరిగినప్పుడు-హంతకురాలు కత్తితో వీపులో పొడిచింది. అప్పుడు కచ్చితంగా కేక వినపడాలి!"

'నాకేమీ అర్థం గావడంలేదు!' అన్నాడు డాక్టర్.

"ఇందులో అర్థంగానిదేమీ లేదు. హతుడినుండి కేక వెలువడలేదంటే అతను స్పృహలో లేడని నా అనుమానం. ఏమంటావు లాల్?"

లాల్ అన్నాడు, "హతుడు స్పృహ తప్పినట్లు దాఖలా లేమీలేవు కదూ డాక్టర్?"

"లేవు. హతుడు తీసుకున్న ఆహారం పరీక్షించాను. ఊపిరితిత్తుల్ని పరిశీలించాను. హతుడికి స్పృహ పోగొట్టే ఎలాటి పదార్థం ఇవ్వబడలేదు."

"సరే, మీరు శవాన్ని ఒంటిగంట ప్రాంతాల షవర్

సీటి క్రింద చూశారు. అప్పుడు దానిరంగు ఎలావుంది?

'నీలిరంగులోకి మారుతోంది.'

'మరణకాలాన్ని 8:00 గంటల నుండి 10:00 గంటల మధ్య నిర్ణయించారు. అంటే రెండు గంటలు నిర్ణయించారు?"

"అవును."

"అది మూడు గంటలెందుక్కాకూడదు?"

"తగిన కారణాల్లేవు. నేను ప్రతి అంశాన్ని క్షుణ్ణంగా పరిశీలించాను. శవం వున్న స్థలం ఉష్ణోగ్రతను కూడా నా పరిశీలనలో పరిగణనలోకి తీసుకున్నాను. ఎట్టి పరిస్థితిలోనూ హత్యా సమయం రెండు గంటల వ్యవధిని దాటదు."

"శవం నీటిలో తడుస్తోందని మీకు తెలుసు. దాని వల్ల శవం ఉష్ణోగ్రత మీరు నిర్ణయించిన సమయానికి తగ్గిపోలేదని ఎలా చెప్పగలరు?"

డాక్టర్ అన్నాడు, "అంతర్గత ఉష్ణోగ్రత వేరు, బాహ్య ఉష్ణోగ్రత వేరు. మీరు రోజల్లా నీటిలో ఈత కొట్టినా మీ అంతర్గత ఉష్ణోగ్రతలో మార్పు రాదు-జబ్బు చేస్తే తప్ప."

జాన్ ఒక్క క్షణం ఆలోచించి, హఠాత్తుగా లేచి టేబుల్ మీద గుద్దాడు.

"జస్ట్ ఎ మినిట్-జస్ట్ ఎ మినిట్-డాక్టర్, శవాన్ని చల్లపరిస్తే ఉష్ణోగ్రత త్వరితంగా తగ్గిపోయి హత్యా సమయం వెనక్కి వెళుతుంది కదా?"

"వాటీజ్ దిస్ నాన్సెన్స్ ఇన్‌స్పెక్టర్!"

"ఇన్‌స్పెక్టర్ ఏమీ చెప్పలేరు. నేను చెప్తాను

వినండి : హత్య జరిగాక శవం చల్లబరచబడింది. బహుశ ఫ్రిజ్‌లో వుంచబడింది. అప్పుడు శవం బయట వున్నప్పటి వాతావరణంకంటే, మానవశరీరం తట్టుకోలేని ఫ్రిజ్ వాతావరణానికి దాని ఉష్ణోగ్రత కాలాన్ని బట్టి కొన్ని డిగ్రీలకి పడిపోతుంది. ఇది ఈ కేసులో గుప్తంగా ఉన్న పాయింట్.

"హంతకుడు శవం ఉష్ణోగ్రతను తగ్గిస్తే హత్యా సమయాన్ని నిర్ణయించడంలో డాక్టర్ పొరబడ తాడు. హత్యా సమయాన్ని మార్చేసి ఎలిబీ కాపాడు కోడానికిదొక టెక్నిక్."

అందరూ ముఖాలు చూసుకుని, తిరిగి జాన్‌ని చూశారు - చెప్పమన్నట్టు.

జాన్ అన్నాడు: "ఇప్పటికీ కేసు చాలా సులభంగా తేలిపోతోంది; ఇందులో తికమక ఏమీ లేదు. జరిగిందల్లా ఏమిటంటే - నిన్న రాత్రి రేవతి 11-00 గంటలకు పార్టీ నుండి వచ్చి ఫ్లాట్‌లో నరేష్‌ని చంపి, శవాన్ని ఫ్రిజ్‌లో పడేసి, తిరిగి పార్టీకెళ్ళి, పార్టీ ముగిశాక తిరిగి ఫ్లాట్‌కి వచ్చి, ఫ్రిజ్‌లోంచి శవాన్ని తీసి బాత్‌రూంలో పడేసి, సనత్‌నగర్‌లో ఫ్రెండ్ దగ్గరికివెళ్ళి, మళ్ళీ ఒంటిగంటకు ఫ్లాట్‌కి చేరుకుంది."

"ఏమిటాధారం ?" కృష్ణన్ అడిగాడు.

'నిన్న సాయంత్రం ఆమె నరేష్‌ని హోటల్‌లో కలుసుకున్నప్పుడు ఇద్దరి మధ్య విబేధాలొచ్చాయి. నరేష్ ఆమె స్నేహానికి తిలోదకాలివ్వడానికి నిశ్చయించు కున్నాడు. ఆమె అంతకు ముందు నుంచి అతని భార్య చేత విడాకు లిప్పించి తాను అతని భార్య కావాలని

కలుసుకుంటోంది. కానీ నరేష్ అందుకు సిద్ధంగా లేడు.

'నిన్న సాయంత్రం నరేష్ తనని మర్చి పొమ్మని చెప్పినప్పుడు-అతనితో ఆమె వూహించుకున్న బంగారు జీవితం కొలిమిలో కరిగి మట్టి పాలయిందని గ్రహించింది.'

'అందుకామె తమ రహస్యం అతని భార్యకు వెల్లడి చేస్తానని బెదిరించలేదు. తనను దక్కని నరేష్ ఇంకెవరికీ దక్క కూడదని అనుకుంది.

'ఈ మోటివ్‌కు ఆధారంలేదు.' జాన్ ఇంకా కొనసాగించాడు, 'ఇది కేవలం నా లాజికల్ ఎక్స్‌ప్లనేషన్. ఆమె మోటివ్‌తో నాకు నిమిత్తంలేదు. ఆమె హంతకురాలని నిరూపించడం నాధ్యేయం.'

"కానీ ఎలా నిరూపిస్తారో అర్థం గావడంలేదు।" కృష్ణన్ దిగులుపడ్డాడు.

జాన్ నవ్వాడు. "నిన్న సాయంత్రం నరేష్, రేవతితో తమ-ప్రేమ వ్యవహారంలో పరిష్కారం సాధించాక-రేవతికి తన భార్య నుండి అపదను తొలగించడానికి ఫ్లాట్ కెళ్ళాడు.

"అతని లవ్‌స్పాట్ గురించి భార్యకు తెలుసు. ఆమె ఏక్షణాన వూడిపడి రేవతి జడ పట్టుకొని వీపు వాయిస్తుందోనని భయపడ్డాడు. అందువల్ల ఆమె వచ్చినప్పుడు తానొక్కడు వుండి - గొడవ జరక్కుండా మాట్లాడి, ఇక రేవతిని మర్చి పోతున్నట్లు ప్రామిస్ చేసి, విడాకుల ప్రయత్నం మాన్పించాలనుకున్నాడు.

'నరేష్, రేవతిని కాపాడాలని ఫ్లాట్ కెళితే, రేవతి అతన్ని చంపెయ్యాలన్న ఆలోచనతో పార్టీ కెళ్ళింది.

ఆ రాత్రి ఉమ ఫ్లాట్‌కి వస్తుందని ఆమెకు తెలుసు. ఈ అవకాశం ఉపయోగించుకుంటే హత్యచేసి బయటపడ్డమే గాక, దాన్ని ఉమ మీదకు మళ్ళించవచ్చు.

'అయితే తను నరేష్‌ని చంపే సమయానికి ఉమ అతన్ని కలుసుకుని వుంటుందో లేదో ఆమె తెలుసుకో దలచలేదు. ఒకవేళ ఉమ ఫ్లాట్‌కు రాకపోయినా, తను సృష్టించే ఆధారాలవల్ల, తను స్టేట్‌మెంట్‌వల్ల, ఇంకా ఎలిబీతో-ఉమ ఫ్లాట్‌కి వెళ్ళిఉంటుందని పోలీసులకి నమ్మకం కలిగిస్తుంది.

'నిన్నరాత్రి ఆమె 11-00 గంటలకి పార్టీనుంచి బయలుదేరి, రహస్యంగా నరేష్ ఇంటికెళ్ళి, అక్కడ నుంచి కత్తి తీసుకుని, తన ఫ్లాట్‌కి వచ్చింది - ఎవరి కంటబడకుండా.'

'ఆ తర్వాత ?' అడిగాడు కృష్ణన్.

జాన్ వివరించాడు. 'ఆమె ఫ్లాట్‌లో ప్రవేశించి నప్పుడు పడగ్గదిలో నరేష్ బెడ్‌మీద అభిముఖంగా నిద్రిస్తుండవచ్చు. అప్పుడాతని వొంటిమీద కేవలం ప్యాంటు వుండాలి. ఆమె శబ్దం కాకుండా బెడ్ దగ్గర కొచ్చి కత్తితీసి, అదే క్షణంలో నరేష్ తలను తలగడ కేసి నొక్కిపట్టి, కేక వెలువడకుండా కత్తితో వీపులో పొడిచింది.

'కత్తి దిగబడి నరేష్ అరిచే వీలులేక గట్టిగా మూల్గి వుంటాడు. అది ఎవరికీ విన్పించదు. మిసెస్ కైలాసం అప్పుడు కచ్చితంగా నిద్రలో వుంటుంది. కత్తి దిగబడిన నరేష్ గిలగిల తన్నుకున్నాడు. రేవతి కత్తి వదిలేసి శక్తి కొద్దీ అతని ముఖాన్ని రెండు చేతులతో తలగడకేసి

నొక్కి పట్టివుంచి-ప్రాణం వదిలేవరకు కాచుకుంది.

"నరేష్ చనిపోయాక కత్తిగాయంనుంచి వెలువడ్డ రక్తాన్ని ఆమె ఏదూదితోనో పీల్చుకునేలా చేసి వుండాలి. బ్లీడింగ్ ఆగేవరకూ వేచిచూసి, వొంటిమీది ప్యాంటు తీసేసి, అండర్ వియిర్‌తో శవాన్ని ఫ్రిజ్‌లో షెల్ఫులు తొలగించి చేర్చింది.

"త్వరత్వరగా రక్తం మరకల్ని శుభ్రంచేసి, బెడ్ మీద దుప్పటి తీసేసి, తిరిగి పార్టీకి చేరుకుంది.

"పార్టీ 12:00 గంటలకు ముగిశాక వెంటనే మళ్ళీ ఎవరికంట పడకుండా ఫ్లాట్‌కి వచ్చి సుమారు గంటసేపు ఫ్రిజ్‌లోవున్న శవాన్నితీసి బాత్‌రూంలో పడేసి, షవర్ తిప్పింది. అప్పుడు సనత్‌నగర్‌లో ఫ్రెండ్ దగ్గరకు వెళ్ళింది."

"శవాన్ని, బాత్‌రూంలో ఎందుకు పడేసింది ?"

"వెల్ ! ఇదేప్రశ్న మిమ్మల్ని అడిగాను, ఇన్‌స్పెక్టర్. అప్పుడు మీరిచ్చిన సమాధానం వేరు. ఇప్పుడు నేనిస్తున్న సమాధానం వేరు: ఫ్రిజ్‌లోని శవాన్ని బాత్‌రూంలో గాక ఫ్లాట్‌లో మరెక్కడ పడేసినా ఉత్పన్నమయ్యే సందేహాలు రెండు : ఒకటి-రక్తం ఏమయ్యింది రెండు-శవం ఎందుకు చల్లగావుంది ?

'ఈ సందేహాలు మనకొస్తే హత్యలోని మర్మం ఇట్టే బయట పడుతుంది. కాబట్టి ఆమె శవాన్ని బాత్‌రూంలో పడేసి షవర్ తిప్పింది. అప్పుడు మనం శవాన్ని చూసి : స్నానం చేస్తున్నప్పుడు హత్య జరిగింది-షవర్ నీటిలో రక్తం కొట్టుకు పోయింది-నీటిలో తడవటం వల్ల శవం చల్లబడింది అని ఆలోచిస్తాం. కానీ, ఆమె ఒక పొర

పాటు చేసింది : బాత్‌రూంలో టవల్ పెట్టలేదు."

'ఇదంతా కేవలం మీ వూహాపైన ఆధారపడి వుంది.'

'అవును, ఉమ తొమ్మిదిన్నరకి ఫ్లాట్‌కి వచ్చి భర్తతో కొట్లాడి వెళ్ళి పోయింది. రేవతి పదకొండు గంటల ప్రాంతాల నరేష్‌ని హత్య చేసి సుమారు గంట సేపు ఫ్రిజ్‌లో శవాన్ని చల్లబరచడం వలన ఉష్ణోగ్రతలో మార్పు వచ్చి డాక్టర్ మరణకాలాన్ని రెండు గంటలు వెనక్కి కొలిచారు.

'దురదృష్టవశాత్తు ఈ సమయంలోనే ఉమ వచ్చింది గనుక ఆమె సులువుగా హంతకురాలై పోయింది.'

'కానీ, మిస్టర్ ఖాన్, మీ వాదనకు అధారాలు కావాలి.'

"ఆల్‌రైట్, అయితే పదండి."

"ఎక్కడికి?"

'రేవతి ఫ్లాట్‌కి. ఆమె ఫ్రిజ్ తెరిచి చూద్దాం.'

'నమ్మకమేనా?'

'నమ్మకమే!'

లాల్ అన్నాడు, 'అక్కడేమీ లేకపోతే - యూ విల్ బి కిక్డ్ అవుట్!'

# 10

ఇన్‌స్పెక్టర్ బాలకృష్ణన్, డాక్టర్ రఘునాథ్‌లతో సహా డిటెక్టివ్‌లు రేవతి ఫ్లాట్‌లో ప్రవేశించారు. ఆమె నెత్తురు చుక్కలేని ముఖంతో అహ్వానించింది.

అందరూ బెడ్‌రూంలోకి నడిచి ఫ్రిజ్ దగ్గర ఆగారు.

జాన్, రేవతి వేపు తిరిగి అన్నాడు, "మీరు ఎక్కడికీ వెళ్ళకూడదు. ఆ కుర్చీలో కూర్చొండి."

రేవతి తలూపి కూర్చుంది.

కృష్ణన్ అన్నాడు, "ఆల్ రైట్ జాన్, మీరు తెరవమంటున్నది ఈ ఫ్రిజ్ నేనా ?"

'ఇక్కడ వున్నది ఒక్కటే ఫ్రిజ్, కదూ రేవతి ?'

కృష్ణన్ మళ్ళీ అన్నాడు, "ఈ ఫ్రిజ్‌లో శవం ఉంచబడిందని మీరనుమానిస్తున్నారు కదూ ?'

'ఈ ఫ్రిజ్ శవంవుంచడానికిసరిపోతుంది, కదూడాక్టర్?'

డాక్టర్ తలూపాడు.

కృష్ణన్ ఫ్రిజ్ తెరిచాడు 'మిస్టర్ జాన్, శవం ఇందులో వుంచబడిందని రుజువేమిటి ?'

జాన్ ఫ్రిజ్‌లోకి చూశాడు. కృష్ణన్, డాక్టర్, లాల్ కూడా చూశారు.

ఫ్రిజ్‌లో నీటి సీసాలు, రెండు కోక్ బాటిల్స్, గుడ్లూ, ఏవో మందులూ, పళ్ళూ వగైరా, నాలుగైదు ఐస్‌క్రీమ్ పేపర్ కప్పులూ వున్నాయి.

జాన్ కళ్ళు చిన్నవి చేసి ఐస్‌క్రీం కప్పుల్ని పరీక్షగా చూశాడు. అందులో ఒకదాన్ని అందుకొని, కిచెన్‌లో కెళ్ళి ఒక స్పూను, పళ్లెంతో తిరిగి వచ్చాడు.

అందరూ అతన్ని శ్రద్ధగా గమనిస్తున్నారు.

జాన్ కప్పులోని ఐస్‌క్రీము స్పూనుతో పళ్లెంలో వేసి అందరికీ చూపించాడు.

'దీన్ని చూస్తే మీకేమర్థమవుతోంది ?'

'మాకేమీ అర్థం గావడం లేదు !' అన్నాడు కృష్ణన్.

'మాకు అర్థం గావడం లేదు.' అన్నాడు లాల్.

జాన్ అన్నాడు: 'ఈ ఐస్ క్రీము ద్రవీభవించి, తిరిగి ఘనీభవించింది. స్ఫటికాలుగా ఎలా గడ్డ కట్టిందో చూస్తున్నారా?'

అందరూ తలలూపారు.

'ఉష్ణోగ్రత మార్పువల్ల ఐస్‌క్రీము కరిగి, తిరిగిదానికి మొదటి ఉష్ణోగ్రత లభించినప్పుడు, దాని మౌలిక రూపం మారిపోయి ఇలా స్ఫటికాలుగా గడ్డ కడుతుంది. ఇది నిత్య జీవితంలో మనం తరచు చూసే సామాన్య విషయం.

'దటీజ్ రైట్.' తలూపి అన్నాడు కృష్ణన్.

'ఈ ఐస్ క్రీము కరగకుండా వుంటే సమస్థితిలో మృదువుగా వుండేది.' స్పూనుతో కెలుకుతూ అన్నాడు జాన్, "కాని, కరిగి తిరిగి గడ్డ కట్టడం వలన ఇలా చిన్న చిన్న ముక్కలుగా విడిపోయింది–దీనిరుచి కూడా మారి పోతుంది. ఘనపరిమాణంలో కూడా మార్పు వస్తుంది. వెల్....మరో కప్పు అందుకోండి!'

కృష్ణన్ ఫ్రిజ్‌లోంచి మరో కప్పు అందుకున్నాడు. అందులోకూడా ఐస్‌క్రీము అలాగే వుంది. మిగతా కప్పుల్లో కూడా అలాగే వుంది.

'విచిత్రంగా వుంది! ఇలా ఎందుకు జరిగింది?'

'బహుశ ఫ్రిజ్ చెడిపోయి వుండవచ్చు' అన్నాడు లాల్.

'కాదు. వాటిని బయటికి తీసి, కొంత సేపటి తర్వాత తిరిగి పెట్టడం వలన అలా జరిగింది–ఉష్ణోగ్రత మార్పు వల్ల. కృష్ణన్, మీరు తీశారా?'

"గాడ్, నో!"

"హత్య మీ మీదకు వెళ్ళదు, భయపడకండి. మీ ఇన్వెస్టిగేషన్‌లో ఫ్రిజ్ తెరిచారా?"

'లేదు, ఫ్రిజ్ గురించి నేనాలోచించలేదు.'

'వెరీ గుడ్‌। ఫ్రిజ్ ఖాళీ చేసెయ్యండి.' జాన్ అన్నాడు.

కృష్ణన్ ఫ్రిజ్‌లోని వస్తువులు తీసి నేల మీద విసిరేస్తోంటే, రేవతి కళ్ళార్పకుండా చూస్తోంది.

లాల్, డాక్టర్ జాగ్రత్తగా గమనిస్తున్నారు.

ఫ్రిజ్ పూర్తిగా ఖాళీ అయిపోయి, చివరికి కృష్ణన్ ఒక గ్రుడ్డు తీస్తుండగా జాన్ కళ్ళు దానిపైన పడ్డాయి.

చటుక్కున ముందుకు కదిలి అర్చాడు, 'స్టాప్, ఇన్‌స్పెక్టర్ హాల్డాన్। డాక్టర్, ఆ గ్రుడ్డు తీసుకోండి। దాని మీద రక్తం మరక వుంది। చూశారా? అది మనిషిదో జంతువుదో పరీక్ష చెయ్యండి। ఒక వేళ మనిషిదైతే హాతుని రక్తంతో కలుస్తుందేమో చూడండి।'

డాక్టర్ కలవరంగా గ్రుడ్డు అందుకున్నాడు. దాని మీద రక్తం మరక చూసి సాలోచనగా పెదవులు చప్పరించాడు.

జాన్ ఖాళీగా వున్న ఫ్రిజ్‌లోకి తొంగి చూసి మళ్ళీ అర్చాడు;

'వెల్, వెల్, వెల్। వాట్ ఙిట్? ఎగ్ కంటెయినర్ క్రింద రక్తం మరక। అందులో వేలిముద్ర। ఓహ్, కృష్ణన్ । మీ ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్ ఎక్కడ? పాథాలజిస్టని కూడా పిలవండి, హ్యారీయప్। ఈ ఫ్రిజ్‌ని ప్రతి అంగుళం పరీక్ష చెయ్యాలి। ఆ వేలిముద్ర ఎవరిదో తెలుసుకోవాలి। క్విక్, అంత వరకు ఈ ఫ్రిజ్‌ని ఎవరూ ముట్టుకో కూడదు।'

కృష్ణన్ విస్తుపోయి చూశాడు, 'జాన్, ఈ ఫ్రిజ్ గురించి అయిడియా మీకెలా వచ్చింది ?'

'ఎలా వచ్చింది? వూహిస్తే వచ్చింది!'

'చాలా సాహసించి వూహించారు. ఆ రక్తం మరక లేకపోతే?'

'ఉమ ఈ కేసునుంచి బయట పడేది కాదు.'

'యూ ఆర్ లక్కీ!'

జాన్ నవ్వాడు, 'నా మెదడు అప్పుడప్పుడు చురుగ్గా పని చేస్తుంది. గర్ల్ ఫ్రెండ్స్‌కి గుడ్‌బై కొట్టాలి!'

లాల్ ఉద్వేగంగా జాన్‌ని ఆలింగనం చేసుకుంటున్నపుడు, రేవతి హఠాత్తుగా కుర్చీలోంచి లేచి బయట కురికింది.

జాన్ విసురుగా ఆమె వెనుక వెళ్ళి చెయి పట్టి లాగి, 'మీరు పారిపోతే ఎలా?' అన్నాడు.

తర్వాత -

ఫ్రిజ్‌లోని రక్తం మరక మీద అన్నిరకాల పరీక్షలు జరిగాయి. రక్తం హతునికి సంబంధించిన గ్రూపుదని తేలింది. అందులోని వేలిముద్ర రేవతి చూపుడు వేలిదని ఫింగర్ ప్రింట్ ఎక్స్‌పర్ట్ ధృవపర్చాడు.

(ఐపోయింది)

## 'అగ్నిజ్వాల'

ఏ. వి. మోహన్రావ్

సాయంత్రం ఆరుగంటలయింది.

తెల్లటి బెంజ్ కారు, తలైయారు రోడ్‌లోని ఆరో నెంబరు బంగళా ముందు ఆగింది. కాంపౌండ్ గేటు కున్న చైన్ లోపలి వైపు నుండి బిగించి వుండటంతో కారులో వున్న మనిషి ఘట్టిగా హారన్ ప్రయోగించాడు.

బంగళా లోపల్నుండి సర్వెంట్ పరిగెత్తుకుంటూ వచ్చి చైన్ తప్పించి గేటు బార్లా తెరిచాడు.

కారు లోనికి దూసుకొచ్చింది. సర్వెంట్ ముందాగింది 'మైత్రేయగారున్నారా?' కారు వెనుకసీట్లో వున్న వ్యక్తి అడిగాడు.

"వున్నారు!" చెప్పాడు సర్వెంట్ మళ్ళీ గేటు మూసేందుకు ప్రయత్నం చేస్తూ.

కారు పోర్టికో వేపు కదలిపోయింది.

ఆగిన కార్లోంచి ముగ్గురు దిగారు. డ్రాయింగ్ రూం వేపు వెళ్ళారు. మైత్రేయ గుమ్మం దగ్గర నిలుచుని,

ముగ్గుర్నీ ఆహ్వానించాడు. అందరూ లోని కెళ్ళి కూర్చున్నారు.

"నా పేరు ఆనందన్. వీళ్ళిద్దరూ మా తమ్ముళ్ళు కుమరన్, రామన్." తన్ను పరిచయం చేసుకుంటూ, వెంటనున్న తన సోదరుల్ని కూడా పరిచయం చేశాడు.

'మిమ్మల్ని కలుసుకోవటం చాలా ఆనందంగా వుంది. నా వల్ల మీకేం కావాలి?' అడిగాడు మైత్రేయ.

"మాకు సినిమా కంపెనీ వుంది. నేను డైరెక్ట్ చేస్తుంటాను. కుమరన్ కెమెరామెన్‌గా, రామన్ ఎడిటర్‌గా వుంటాడు. మా కంపెనీ ఇప్పటికీ ఇరవై సినిమాలు తీసింది. మాకు స్వంత స్టూడియో కూడా వుంది. మీరు వినే వుంటారు ఆనంద్ స్టూడియో పేరు.' చెప్పి ఆగాడు ఆనందన్.

'విన్నాను!'

"మీరు రాసిన నవల 'అగ్నిజ్వాల' యీ మధ్య చదవడం జరిగింది. ఆ కథ మాకు నచ్చింది. దాన్ని భారీ ఎత్తున ఒకేసారి హింధీ, తెలుగు, అరవంలో తియ్యాలని సంకల్పించుకున్నాము. దాన్ని గురించి మాట్లాడేందుకు వచ్చాము." అన్నాడు.

'చాలా సంతోషం. నేను దాదాపు పదేళ్ళ నుంచి రచనలు చేస్తున్నాను. ఇంతదాకా నా నవలలు సినిమా తీస్తామంటూ వచ్చిన వాళ్ళు లేరు. అంటే అవి బహుశా సినిమాలకు పనికి రావని నా అభిప్రాయం. లక్షలు, కోట్లు, పెట్టుబడి పెట్టబోయే ముందు మీరు ఒకటికి పది సార్లు ఆలోచించుకోవడం మంచిదని నా అభిప్రాయం." అన్నాడు మైత్రేయ అనాసక్తంగా.

'బాగా ఆలోచించుకునే మేము నిర్ణయానికి వచ్చాం.' అన్నాడు ఆనందన్.

' అయితే మీ యిష్టం। నేను చెప్పవలసింది చెప్పాను.'

'దీనికి స్క్రీన్ ప్లే కూడా మీరే తయారు చెయ్యాలి. అన్నింటికీ కలిపి మీకు లక్షరూపాయలివ్వాలనుకున్నాం. ఏమంటారు ?'

'స్క్రీన్ ప్లే అంటే ఏమిటో నాకు తెలీదు. అదెవరి చేతనన్నా అనుభవం వున్నవాళ్ళచేత రాయించుకుంటే బాగుంటుందేమో ?" తన అనుమానం వ్యక్తపరిచాడు మైత్రేయ.

"కాదు। మనం నలుగురం నాలుగు రోజులు కూచుని కూలంకషంగా చర్చించుకుంటే చాలు. ఆ తర్వాత మీకే అర్థమవుతుంది. మీరు రాస్తేనే బాగుంటుంది." అన్నాడు ఆనందన్.

'అలాగే !'

ఆనందన్ చెక్ బుక్ తీసి పాతిక వేల రూపాయలకు మైత్రేయ పేర చెక్ రాసి ఇచ్చారు. దాన్ని అందుకున్నాడు మైత్రేయ.

"మంచి రోజు చూసి మీకు కబురు చేస్తాను. సిట్టింగ్స్ మొదలు పెడదాం. ఈలోగా మీ నవలను మీరు రెండు సార్లు చదవండి. ఏమేం మార్పులు, చేర్పులు చేస్తే బావుంటుందో ఆలోచించి వుండండి. మేము చదివి చర్చకు సన్నద్ధమవుతాం.' అన్నాడు ఆనందన్ లేస్తూ. కుమరన్, రామన్ కూడా లేచారు.

కరచాలనాల కార్యక్రమం ముగిశాక, మైత్రేయ

వాళ్ళను కారుదాకా సాగనంపి, లోపికొచ్చి కూర్చున్నాడు.

టీపాయ్ పైనున్న టెక్ ఫాన్ గాలికి రెపరెపలాడుతూ కనుపించింది. దాన్ని చూడగానే అతనికి గతం గుర్తు కొచ్చింది.

సరిగ్గా పది సంవత్సరాల నాడు కట్టుబట్టలతో, మండే కడుపుతో మద్రాసులో అడుగుబెట్టాడు. కనబడ్డ ప్రతి పత్రికాఫీసుకు తిరిగాడు ఉద్యోగం కోసం. ఎక్కడా దొరకలేదు. కార్పొరేషన్ కుళాయి నీళ్ళు తాగి, ప్లాట్ ఫామ్ పైన ఉంగచుట్టుకొని పడివున్న రోజులెన్నో గుర్తుకొచ్చాయి.

ఆరు మాసాల పోరాటం తర్వాత చిన్న ఉద్యోగం దొరికింది. ఆ తర్వాత అతని ప్రతిభా వ్యుత్పత్తులు అనేక మందికి తెలిసొచ్చాయి. చకచక పైకొచ్చాడు. అతనికి ఆంధ్ర దేశంలో ఎంతో పేరుంది. ఎంతోమంది పాఠకులు, ఆరాధకులున్నారు. స్వంత బంగళా, కారు, బ్యాంక్ అకౌంట్ ఏర్పడ్డాయి.

మైత్రేయకు హైద్రాబాదులో తన జీవితం గుర్తు కొచ్చింది. అక్కడా ఒంటరిగాడుగానే వుండేవాడు. తన రచనలను మెచ్చుకుంటూ చుట్టూ తిరిగే అనసూయ, ప్రేమించానంటూ మధ్యపెట్టి, పెళ్ళి చేసుకునేదాకా పోరాడింది. మైత్రేయ అసలు పేరు సుబ్బారావు ఆ రోజుల్లో.

అనసూయ అతనికన్నా పొడవులో ఆరంగుళాలు ఎక్కువ. చుట్టుకొలతలో దాదాపు పదిహేడు అంగుళాలు విశాలంగా వుంటుంది. ఆమె కంఠం, కంచు కంఠం. మాట్లాడుతుంటే మగాళ్ళు మాట్లాడుతున్నట్లుగా వుంటుంది.

తాళి కట్టింది మొదలు, అది ఎగతాళి పాలయ్యే దాకా, అంటే ఆరు సంవత్సరాల వైవాహిక జీవితంలో ప్రతి విషయంలో అతన్ని ఆమె చులకనగా చూసేది. ఆమె గతం అంత పవిత్రమైనది కాదన్న విషయం అతనికి ఆ తర్వాత అర్థమైంది. సంపాదన లేకుండా, భార్య డబ్బు పైన తిండికీ, గుడ్డకు ఆధారపడ్డ మగ వాళ్ళ జీవితం అంతా అంతేనని పించింది.

పెళ్ళయిన వెంటనే అనసూయకు ఆడ పిల్ల పుట్టింది. ఆ పిల్లకు సుశీల అని పేరు పెట్టుకున్నాడు. ఎంతో ప్రేమగా పెంచాలని తహతహలాడే వాడు భర్తను బిడ్డపై చెయ్యి గూడా వెయ్యనిచ్చేది గాదు అనసూయ.

మానసికంగా బాగా కృంగి పోయాడు సుబ్బారావు ఆ రోజుల్లో. తెలిసిన వాళ్ళు అతన్ని అవహేళన చెయ్యడం, భార్య చులకనగా చూడడంగా, కన్న బిడ్డను కనీసం ప్రేమగా కౌగలించు కోలేక పోవడం వంటి సంఘటనలు, అతన్ని బాగా కృంగ దీశాయి. విడాకులు తీసుకోవాలని నిర్ణయించుకున్నాడు.

ఆ విషయం అనసూయతో చెప్పాడు. ఆమె ఆనం దంగా ఒప్పుకొంది. కానీ కూతురు తన రక్షణలోనే వుండా లన్న మంకుపట్టు పట్టింది. దాంతో ఇద్దరూ కోర్టు కెక్కారు. కోర్టు కూడా అనసూయ కోరికనే మన్నిస్తూ, న్యాయం చెప్పడంతో, మద్రాసు చేరుకున్నాడు.

ఎప్పటి కయినా అనసూయ మారుతుందనీ, కన్న బిడ్డను తీసుకుని, తన దగ్గరకు వస్తుందనీ, అప్పటికి వీలయినంత సంపాదించి, వుంచాలన్న తపనతో, తంటాలు పడి అతనీ స్థితికి వచ్చాడు.

అతను రాసిన నవల సినిమా తీస్తామనగానే ఆనందం కలిగింది. ఇది మంచి పేరు తెస్తే త్వరలోనే తను లక్ష లకు లక్షలు సంపాదించడం సాధ్యమౌతుందన్న విష యం వూహించి ఆనందంతో ఉప్పొంగి పోయాడు మైత్రేయ.

'బాబూ !' పిలిచాడు సర్వెంట్.

"ఏమిటి?" అన్నట్లు తలెత్తి చూశాడు మైత్రేయ.

"గంట తొమ్మిదవుతుంది. భోజనం చెయ్యరా?"

"ఆకలి లేదు. నువ్వెళ్ళి తిను." అన్నాడు, లేచి బెడ్ రూంలోకి వెళ్తూ.

అతను, ఎదురుగా గోడకు వ్రేలాడుతున్న సుశీల ఫొటో వద్దకు నడిచాడు.

రెండు క్షణాలు ఆ ఫొటోలో వున్న కూతుర్ని నిశితంగా, నిదానంగా, నిర్మలమైన మనస్సుతో చూస్తూ నిల్చున్నాడు. ఆ తర్వాత చేతుల్లో వున్న చెక్ ఫొటోకు అభిముఖంగా పెట్టాడు. ఆమె కోసం తను సంపాదించిన మొత్తాల్ని అలా ఫొటోకు చూపించి, ఆ తర్వాత బ్యాంక్‌కు పంపడం అలవాటుగా పెట్టుకున్నాడు మైత్రేయ. ఆరోజు ఆ చెక్‌ను కూడా అలాగే చేశాడు.

# 2

ఆనంద్‌స్టుడియోస్ వాళ్ళ ఆఫీసు ముందు వరుసగా నిలుచున్నారు అందమైన అమ్మాయిలు. దాదాపు పాతిక మందిదాకా వున్నారు. అందరూ అందంగా తయారయి సీతాకోక చిలుకల్లా వచ్చారు.

ఒక అమ్మాయి పరుగెత్తుకుంటూ వచ్చి ఆగింది వాళ్ళ ప్రక్కన. బట్టలు ఎగుడు దిగుడుగా వున్నాయి. తలంతా రేగివుంది. కాళ్ళకు చెప్పులు గానీ, చేతిలో బ్యాగ్ కానీలేవు.

'డైరెక్టరు' అని బోర్డువున్న రూం బైట నిలుచున్న బాయ్ ఆ అమ్మాయి వైపు వెళ్ళి "ఎవరునువ్వు?" అడిగాడు.

"కనిపించలా? మనిషివి!" అంది కోపంగా.

"ఎందుకిలా పరుగెత్తుకొచ్చావ్?"

"ఎవరో రౌడీలు వెంటపడ్డారు. వాళ్ళనుండి తప్పించుకుందామని పరుగెత్తాను. వీళ్ళంతా ఎందుకు నిలుచున్నారు?" అడిగిందా అమ్మాయి.

"మా అయ్యగారు క్రొత్త సినిమా మొదలెట్టబో తున్నారు. అందులో హీరోయిన్ వేషం కోసం వచ్చారు." అన్నాడు బాయ్.

"అలాగా? అంది ఆశ్చర్యంగా.

"నువ్వేంచేస్తుంటావ్?"

"ఏదైనా పనికోసం వెతుక్కుంటూ వచ్చాను. మా అమ్మా నేనూవచ్చాము. ఆమె రాత్రి చచ్చిపోయింది. మా నాన్న ఈ ఊళ్ళోనే వున్నాడని తెలుసు. కానీ ఎక్కడున్నాడో తెలియదు. ఆయన్ను రెండు మాసాల నుండి వెతుకుతున్నాం." అందా అమ్మాయి.

"నీ పేరేమిటి?"

"రజని." చెప్పిందా అమ్మాయి.

"బావుంది!"

"ఏమిటి?"

"పేరూ, నువ్వూ, రెండూ బావున్నాయి."

"ఏదైనా పని దొరుకుతుందా ఇక్కడ" అడిగింది ఆశగా రజని.

"ఏమేం పనులు చెయ్య గలవు?"

"తిండీ గుడ్డా ఇస్తే ఏదైనాచెయ్యగలను. ప్రస్తుతం అంతే నా అవసరం." అంది రజని భయంగా వీధికేసి చూస్తూ.

లోపలినుండి బెల్ వినిపించడంతో "ఇక్కడేవుండు. వస్తాను." అంటూ లోనికెళ్ళాడు. ఒక నిముషం తర్వాత వెలుపలికొచ్చి, హాల్లో నిలుచున్న మరో అమ్మాయిని లోనికి పంపి, రజని దగ్గరకు నడిచాడు భాయ్.

"నా యిల్లు వెనుక వేపుంది. నేను ఒక్కడ్నేవుంటు న్నాను. అక్కడ ముందు స్నానంచేసి, క్యారియర్‌లో అన్నం తిని పడుకో. ఈ హడావుడి ముగిశాక వచ్చి మాట్లాడు తాను. సరేనా?" అడిగాడు భాయ్.

సరేనన్నట్లు తలూపింది రజని.

ఆమెను తీసుకెళ్ళి, వెనుకవేపు తనుంటున్న ఔట్ హవుస్‌లో దిగవిడచి మళ్ళీ ఆఫీసుకు వచ్చాడు భాయ్.

రజని హాయిగా స్నానం చేసి, అతని పాంటు, షర్టు, వేసుకుని, క్యారియర్ తెరచి అందులో వున్న, అన్నం కూర, పులుసు, పెరుగు మొత్తం తిని, గిన్నెలు శుభ్రంగా కడిగి, యథాస్థానంలో పెట్టి పడుకొంది. ఆమెకు తెలీకుండానే నిద్రపట్టింది.

"రజనీ! రజనీ!!" అన్న పిలుపు విని తలెత్తి చూసింది. ఎదురుగా భాయ్ నిలుచుని వున్నాడు.

"నీ పనంతా అయిపోయిందా!" అడిగింది రజని

లేచి కూర్చుంటూ.

"అం! అయినా అలా మొద్దులా నిద్రపోతున్నా వేమిటి?" అడిగాడు బట్టలు మార్చుకుంటూ.

"అన్నం తిన్నావా?"

"ఆఁ నేను వెళ్ళి హోటల్‌లో తిని వచ్చాను." అన్నాడు భాయ్.

"నీ పేరు!"

"నా ఉద్యోగం ఆఫీసు బాయ్ అనుకో. నీకు నేను భాయీని. అంటే అన్నయ్యను అందంగా భాయీ అని పిలువు. చాలు" అన్నాడు అతను.

"అలాగే!" అంది రజని.

మంచం మీద రజనికి కొంచెం దూరంగా కూర్చున్నాడు భాయీ. రజని కేసి కన్నార్పకుండా చూస్తుండి పోయాడు ఒక క్షణం సేపు.

"ఏంటి భాయీ! అలా చూస్తున్నావ్?"

"ఏం లేదు?"

"లేదంటూనే చూస్తావెందుకు?"

"ఇంత అందం, వయస్సు, పెట్టుకుని, ఈ ఊళ్ళో ముఖ్యంగా ఈ సినిమా కంపెనీల నడుమ, క్షేమంగా ధైర్యంగా ఎన్నాళ్ళు తిరగ గలవాని చూస్తున్నాను." అన్నాడు భాయ్.

"అంటే ఇక్కడంతా రాక్షసులున్నారా?"

'వీళ్ళ ముందు వాళ్ళు కూడా సిగ్గుతో తలవంచుకోవలసిందే!' అన్నాడు తన అనుభవాన్నంతా నెమరు వేసుకుంటూ.

"అయితే నాలాంటి వాళ్ళు బ్రతకలేరంటావ్?" అను

మానంగా చూస్తూ అడిగింది రజని.

'దానికి కొన్ని మెళకువలున్నాయి అవి తెలుసుకుంటే వీళ్ళను అండించవచ్చు. నీ చుట్టు త్రిప్పుకోవచ్చు."

"అవన్నీ నాకు నేర్పుతావా?"

'ఆఁ!'

"కొన్నాళ్ళపాటు నువ్వు ఎవ్వరికంటాపడకు. ఇక్కడే గదిలో వుండు. ముఖ్యంగా, మా ప్రొప్రయిటర్లు చూడకుండా జాగ్రత్తపడు." అన్నాడు భాయ్.

'అలాగే!' అంది రజని.

'నువ్వెంతదాకా చదివావ్?'

'పదో తరగతి.'

'నాటకాల్లో వేషాలు వేశావా?'

"ఆఁ డాన్సుకూడా వచ్చు." అంది రజని.

"అయితే నిన్ను హీరోయిన్ని చేస్తాను. ధైర్యంగా వుండు. అయితే ఒక్క షరతు నువ్వు గొప్పదానివయ్యాక నన్ను మర్చిపోగూడదు. నన్ను నీతోనే నీ అన్నయ్యగా వుంచుకోవాలి." అన్నాడు.

"నువ్వు వదలి వెళ్తానన్నా నేను వెళ్ళనివ్వను. ఇవాళ కాలేకడుపుకు గంజిపోశావ్. ఎవ్వరూ లేని నాకు, అండగా, అన్నయ్యగా వుంటానన్నావ్. ఈ మేలు మరచిపోయే దుర్మార్గురాల్ని కాదు" అంది రజని.

'రాత్రికి వంట ఇంట్లోనే చేసుకుందాం. కావలసినవన్నీ వున్నాయి. సరుకులు తెస్తాను. రొమ్మిదింటి కల్లా భోజనం కావాలి. ఆ తర్వాత నాకు పన్నెండుదాకా ఆఫీసులో పనివుంటుంది. అక్కడ్నుంచి కేకలు, అరుపులు, నవ్వులు, లాంటివి వినబడ్డా భయపడకు తలుపు మూసుకు

పడుకో. నే నొచ్చి పిలిస్తేనే తలుపు తెరువు. సరేనా ?"

సరే నన్నట్లు తలూపింది రజని.

భాయ్ సంచి తీసుకుని వెలుపలకు వెళ్ళాడు సరుకులు తెచ్చేందుకు. రజని తలుపులు మూసుకుంది.

తన్ను హీరోయిన్ చేస్తానని అతనన్న మాటలు చెవుల్లో మారుమ్రోగాయి. విమానంలాంటికారు, లంకంత బంగళా, నౌకర్లు, బోలెడుడబ్బు, చీరలు, నగలు, అన్నీ వుంటాయి. ఎక్కడికి వెళ్ళినా తన్ను చూడను ఎగబడే వేలమంది జనం. తలచుకొంటేనే ఒళ్ళు గగుర్పాటు చెందింది.

ఊహాలోకంలో విహరించిన మనస్సు తలుపు పైన ధబధబ మని శబ్దం కావడంతో రెక్కలు తెగిన పక్షిలా ఇహలోకంలోకి దిగింది.

మంచంపై నుండి దిగి, మెల్లగా వెళ్ళి తలుపు వగ్గర నిలుచుంది.

"రాజా ! రాజా !" అంటూ పిలుపు వినబడింది. భాయ్ పేరు రాజన్న విషయం అప్పుడుఅర్థమైంది రజనికి.

తలుపు తియ్యటమా ? మానటమా ? అన్న సందేహంతో బదులు చెప్పకుండా అక్కడే నిలుచుంది కాసేపు.

అవతలివ్యక్తి తలుపు బాదడం ఆపక పోవడంతో, ధైర్యం చేసుకుని తలుపు తెరచింది.

ఎదురుగా, ఎత్తుగా వున్న మనిషి నిలుచుని వున్నాడు.

'నువ్వెవరు ? రాజులేడా ?'

'లేడు !' అంది రజని.

'నువ్వెవరో చెప్పలేదు ?'

'అతవి చెల్లెల్ని'

'నీలాంటి అందమైన చెల్లెలుందన్న విషయం వాడు నాకెప్పుడూ చెప్పలేదు. వాడొచ్చేదాకా వుండొచ్చా?'

అడిగాడు అతను.

"వీల్లేదు. అన్నయ్య రావడానికి చాలాసేపు పడుతుంది. మళ్ళీరండి!" అంటూ అవతలి వ్యక్తి సమాధానం కోసం చూడకుండా తలుపులు టక్కున బిగించింది రజని.

# 3

హాల్లోనున్న ఫోన్ గణగణ మంది.

మైత్రేయవెళ్ళి రిసీవరు అందుకొని "హల్లో! మైత్రేయ మాట్లాడుతున్నాను!" అన్నాడు మెల్లిగా.

"నేను ఆనందన్‌ను. ఇవాళ రాత్రి తొమ్మిది గంటలకు మన పిక్చరు షూటింగు ప్రారంభం చేద్దామనుకుంటున్నాను. మీరు ఖాళీగానే వుంటారా?"

"ఆఁ!"

"అయితే నేను కారు పంపుతాను. వచ్చెయ్యండి. భోజనం కూడా ఆఫీసులోనే ఏర్పాటు చేస్తాను."

'అలాగే!' అన్నాడు మైత్రేయ.

'ఎనిమిదిన్నర కల్లా సిద్ధంగా వుండండి.' అంటూ అవతలవేపు ఫోన్ పెట్టేశాడు ఆనందన్.

మైత్రేయ కూడా రిసీవరు క్రెడిల్ పైన పెట్టి, అగ్నిజ్వాల నవల ఒక మారు చదువుకోవడం మంచిదని లైబ్రరీలోకి అడుగు పెట్టాడు.

వర్వెంట్ లైబ్రరీలో కొచ్చి "అయ్యగారూ!" అని పిలిచాడు.

చదువుతున్న పుస్తకంలోంచి తల పైకెత్తి చూసి 'ఏమిటి?' అని అడిగాడు మైత్రేయ.

'మిమ్మల్ని చూడాలని ఎవరో వచ్చారు. అతన్ని చూస్తారా? లేక వీలుకాదని చెప్పి పంపెయ్యమంటారా?' అడిగాడు.

'ఎందుకో చెప్పాడా?'

"లేదు!"

"సరే హాల్లో కూర్చోబెట్టు! వస్తాను." అన్నాడు పుస్తకం మూసి పెడుతూ.

మైత్రేయ హాల్లో కొచ్చేసరికి, సోఫాలో కూర్చుని వున్న పాతికేండ్ల మనిషి లేచి నిలుచుని రెండు చేతులూ జోడించి నమస్కారం చేశాడు. అతన్ని కూర్చోమని చేత్తో సంజ్ఞచేసి, తనూ అతని కెదురుగా వున్న సోఫాలో కూలబడ్డాడు.

"నా పేరు రాజు," అన్నాడు అతను కూర్చుంటూ.

'మంచిది, నాతో ఏం పని?'

'చెప్తాను. మీరు రాసిన నవల "అగ్నిజ్వాల"ను సినిమాగా తీసేందుకు ఆనంద్ స్టూడియోస్ వాళ్ళు కొన్నట్లు తెలిసింది అందులో హీరోయిన్ వేషానికి, క్రొత్త అమ్మాయిని పెట్టాలని వాళ్ళు నిర్ణయించుకున్నారు. అందు కోసం అడ్వర్టయిజ్‌మెంట్ ముందే వేశారు. చాలా మందిని ఇంటర్వ్యూ చేశారు. నాకో చెల్లెలుంది. చాలా అందంగా వుంటుంది. చదువుకుంది. నాటకానుభవం కూడా వుంది. మీరు వాళ్ళకు మట్టిగా చెబితే

హీరోయిన్ వేషం యిస్తారు." అన్నాడు రాజు ఆశగా.

'ఆ ఇంటర్వ్యూకు మీ చెల్లాయిని కూడా పంపక పోయారా?' అడిగాడు మైత్రేయ.

"పంపేవాణ్నే! ఆ అన్నదమ్ములు ముగ్గురూ నర రూప రాక్షసులు. అలా వచ్చిన అమ్మాయిల్ని ఆశపెట్టి వాళ్ళ శీలాన్ని, యవ్వనాన్ని జుర్రుకునిత్రాగి, ఆతర్వాత తరిమివేస్తారు. క్రొత్తవాళ్ళను పెట్టుకుంటామని చెప్పేది ఇందుకోసమే! కానీ ఖర్చులేకుండా, కావలసిన ఆనందం పొందడానికి అలవాటు పడ్డారు. అందుకనే పంపలేదు." అన్నాడు రాజు కోపంగా.

"ఈ విషయం నీకెలా తెలుసు?"

'నేను వాళ్ళ కంపెనీలో బాయ్‌గా పనిచేస్తూ, వాళ్ళ వెధవ పనులకు సాయం చేస్తున్నాను గనుక....'

"ఐ. సీ. అలాంటి మనుషులు నేను చెప్తే మాత్రం వింటారా? విన్నా ఆ అమ్మాయిని మోసం చెయ్యరని గ్యారంటీ ఏమిటి?"

'ఆ అమ్మాయి నా చెల్లెలని తెలిస్తే, నా అనుమతి కోసం కూడా చూడకుండా, లాక్కెళ్ళి పాడుచేస్తారు. మీలాంటి వారి అండ దొరికితే, భయంతో నన్నా కాస్త దూరంగా వుంటారని నా నమ్మకం.' అన్నాడు రాజు.

"ఆ మాత్రం అండగా వుండేందుకు మరెవ్వరూ లేరా?"

"లేరు సార్! నాకు తెలిసినవన్నీ పశువులే!" అన్నాడు రాజు.

మైత్రేయ మాట్లాడకుండా ఆలోచిస్తూ చూస్తున్నారు.

"ఏమంటారు సార్ ?" తన విన్నపం మళ్ళా గుర్తు చేశాడు.

"నాకు అంత బాగా తెలీని గొడవలు. పైగా నువ్వు నాకు పూర్తిగా తెలియదు. పరిచయం కూడా లేదు. నీ మాటలు నమ్మి, ఈ రొంపిలోకి దిగడానికి మనస్కరించడం లేదు. అసలు నాకు సినిమా మనుషులన్నా, వాళ్ళతో పరిచయాలన్నా ఇష్టం వుండదు ?' అన్నాడు మైత్రేయ.

"అయితే నాకు సాయం చేయనంటారు ! అంతేనా?"

"అంతే ననుకుంటాను." అన్నాడు ఎటో చూస్తూ.

"వస్తాను సార్. నా తిప్పలు నేను పడతాను." అంటూ రాజు లేచి నమస్కారం చేసి వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళినంతదూరం చూస్తూనే కూర్చున్నాడు మైత్రేయ. తనవల్ల ఇంతదాకా ఎవరికీ మంచిగానీ,సాయం గానీ జరగలేదన్న విషయం అర్థమైంది. అలాంటి అవకాశమేదో వస్తే, చేజేతులా దాన్ని జార విడుచుకున్నానేమో నన్న బెంగకూడా కలిగింది.

# 4

టెలిఫోన్ మ్రోగింది.

మైత్రేయ రిసీవరు తీసి "హల్లో !" అన్నాడు.

అవతలవేపు నుండి "నేను ! ఆనందన్‌ను మాట్లాడుతున్నాను. ఈ దినం మనం కలుసుకుందాం అనుకున్నాం. అది వాయిదా వేసుకుందాం." అన్నాడు.

"ఎందుకని ?"

"మా దగ్గర పనిచేసే రాజు అనే కుర్రాడు ఒకహత్య

కేసులో ఇరుక్కున్నాడు. మేమీ గొడవలో పడ్డాం."

"రాజు హత్య చేశాడా?" ఆశ్చర్యంగా అడిగాడు మైత్రేయ.

"అతను మీకు తెలుసా?"

"కొద్దిగా తెలుసు! ఎవర్ని హత్య చేశాడు?"

"ఎవరో 'రజని'అనే అమ్మాయిని గొంతుపిసికి చంపి కూం రివర్‌లో శవాన్ని పడేశాడు. దాన్ని వెలుపలకు లాగారు పోలీసులు. పోస్టుమార్టం చేయించారు. హత్యకు ముందు ఆ అమ్మాయిని ఘోరంగా మానభంగం చేసినట్లు రుజువైంది." చెప్పాడు ఆనందన్ హడావిడిగా.

"అలాగా?"

"మా దగ్గర నమ్మకంగా చాలా రోజుల్నుంచి పని చేస్తున్నాడు. ఇంతటి కర్కోటకుడన్న విషయం మాకు తెలీదు. నేరం చేసింది వాడయితే మమ్మల్ని వేధిస్తున్నారు పోలీసులు!"

"ఎందుకు!" అర్థం గాక అడిగాడు మైత్రేయ.

"వాడి పుట్టుపూర్వోత్తరాలు చెప్పమని...." అంటూ ఆపి, "ఇదేదో వదిలించుకునేందుకు దాదాపు రెండు దినాలు పడుతుంది. ఆ తర్వాత మీకు ఫోన్ చేస్తాను." అన్నాడు ఆనందన్.

"అలాగే!" అంటూ ఫోన్ పెట్టేశాడు మైత్రేయ.

అతనికి ఒళ్ళంతా చెమటలు పట్టింది. రజని అనే అమ్మాయి చెల్లెలంటూ, సాయం చెయ్యమని వచ్చి అడిగిన రాజు, అంత దారుణంగా, ఎలా హత్య చేసి వుంటాడో అర్థం కాలేదు. రాజు మాటలు, రూపు అన్నీ గుర్తొచ్చాయి. ఇందులో ఏదో నిగూఢ రహస్యం దాగి

వుందని అనుమానం వచ్చింది మైత్రేయకు.

గబగబ డ్రెస్ వేసుకుని నుంగంబాకం పోలీస్ స్టేషనుకు వెళ్ళాడు మైత్రేయ. పోలీస్ ఇన్‌స్పెక్టర్‌కు తనను తాను పరిచయం చేసుకుని, రాజును చూడాలన్నాడు. లాకప్ రూంలో వున్న రాజును చూపించాడు అతను.

మైత్రేయను చూడగానే రాజు పెద్దగా ఏడిచాడు. అతని కళ్ళు కన్నీటి సుడిగుండాల్లా మారాయి.

"ఏం జరిగింది ?" అడిగాడు మైత్రేయ.

"అనుకొన్నదే జరిగింది సార్ ! ఆ అమాయకురాల్ని వాళ్ళు అన్యాయం చేశారు." అన్నాడు రాజు.

'పోలీసులకు చెప్పలేదా!'

'చెప్పాను.'

'వాళ్ళేమంటారు?'

"దబ్బు లేని వాణ్ని కాబట్టి నా మాటలు నమ్మడం లేదు. నేనే చేశానంటారు. చెల్లెలులాంటిదాన్ని అలాంటి అవమానం పాలు చేస్తానా ? నేను మనిషిని సార్!" ఏడుస్తూ చెప్పాడు రాజు.

'బాధపడకు! నాచేతనైన సాయం చేస్తాను. ధైర్యంగా వుండు ,అంటూ ఇన్‌స్పెక్టర్ దగ్గరకు వచ్చి కూర్చు న్నాడు మైత్రేయ.

హత్య చెయ్యబడిన అమ్మాయి తాలూకు వివరాలు తెలిసినంత వరకూ చెప్పాడు ఇన్‌స్పెక్టర్. ఆ తర్వాత రజని ఫొటోలు కొన్ని చూపించాడు.

వాటిని చూడగానే మతి పోయింది మైత్రేయకు. ఆమె సుశీలేనని, తమ కన్న కూతురని తెలుసు కోవ టానికి, ఎక్కువ ప్రయాసపడవలసిన అవసరం లేక

పోయింది. గుండెల్ని చిక్కబట్టుకొన్నాడు.

'ఈ అమ్మాయి ఇతని స్వంత చెల్లెలులా లేదే?' అన్నాడు మైత్రేయ.

"అవును సార్! మేమూ విచారించాం! చెల్లెలు కాదు. ఆ అమ్మాయికో తల్లి వుండేది. ఆమె పేరు అనసూయ. ఆమె చని పోయింది. ఆ తర్వాత ఇతని పంచన చేరింది. వేషాలిమ్మంటూ చాలా మంది చుట్టూ తిరిగినట్లు సాక్ష్యాలు దొరికాయి అందరూ పిచ్చి పిచ్చి వేషాలు వెయ్య బోవడంతో, దూరంగా వచ్చేసిందట" చెప్పాడు ఇన్స్పెక్టర్.

'థాంక్స్! వస్తాను.' అంటూ శెలవు పుచ్చుకుని వెలుపల కొచ్చి కారెక్కి, తిన్నగా నుంగంబాకంలోని ఆనంద్ స్టుడియో వైపు పోనిచ్చాడు.

మైత్రేయ వెళ్ళే సరికి అన్నదమ్ములు ముగ్గురూ కూర్చుని ఏదో సీరియస్‌గా మాట్లాడు కొంటున్నారు. మైత్రేయను చూచి ఠక్కున మాటలు మానేశారు.

"ఏంటిలా వచ్చారు?" అడిగాడు ఆనందన్.

'మళ్ళీ ఫోన్ చేస్తామన్నాంగా?' అడిగాడు కుమరన్. మూడో అతను మాట్లాడకుండా కూర్చున్నాడు.

'మీతో కొద్దిగా మాట్లాడుదామని వచ్చాను.' అన్నాడు మైత్రేయ కూర్చుంటూ.

'చెప్పండి!' అన్నాడు ఆనందన్.

'అగ్నిజ్వాల నవల సినిమా తీసేందుకు మీకు ఇచ్చిన హక్కుల్ని తిరిగి తీసుకుంటున్నాను. మీ డబ్బు త్రిప్పి పంపుతాను.' అడిగాడు సీరియస్‌గా.

"ఉన్నట్టుండి ఎందుకిలాంటి నిర్ణయం తీసుకున్నారు?" అడిగాడు ఆనందన్ విస్తుపోతూ.

'కారణాలు మీ కనవసరం.' అన్నాడు మైత్రేయ.

'సారీ! మేం అన్ని ఏర్పాట్లు చేసుకున్నాం. ఇప్పుడు దాన్ని మానెయ్యడం సాధ్యం కాదు.' అన్నాడు కుమరన్.

"బాగా ఆలోచించుకోండి!' అన్నాడు మైత్రేయ.

'ఇందులో ఆలోచించవలసిందేమీ లేదు' అన్నాడు కుమరన్.

మైత్రేయ అక్కడ్నించి బయలుదేరి వచ్చేశాడు. అతని వంట్లోని రక్తం ఆవేశంతో బాగా ఎరుపెక్కిపోయినట్లు, సెగలు గ్రక్కుతూ ప్రవహిస్తున్నట్లు తోచింది. ప్రతీకారం సాధించాలనుకున్నాడు.

ఇంటికి తిరిగిరాగానే రెండు మూడు ఫోన్‌లు చేశాడు. బట్టలు మార్చుకుని, కారెక్కి, మౌంట్ రోడ్ వెళ్ళాడు. రెండు మూడు రకాల మందులు కొనుక్కొని వచ్చాడు. వాటితో కొన్ని ప్రయోగాల లాంటివి చేసి, పసుపు రంగులో వున్న మాత్రలు తయారు చేసి ఒక చిన్న సీసాలో తీసుకున్నాడు. దాన్ని కోటు జేబులో పెట్టుకున్నాడు.

హాల్లో వున్న ఫోన్ మ్రోగింది.

రిసీవరు పైకెత్తి 'హల్లో' అన్నాడు.

'నేను ఆనందన్‌ను మాట్లాడుతున్నాను. మీ లాయరు ఫోన్ చేశాడు. మన అగ్రిమెంటు చెల్లదంటూ కోర్టులో కేసు వెయ్యమన్నారట. నిజమేనా?' అడిగాడు.

'అఁ! నిజమే!'

'మమ్మల్ని ఇలా ఎందుకు ఇరుకున పెడతారు. ఇంకా

కొంత డబ్బు కావాలంటే ఇస్తాం!' అన్నాడు.

'మీరా కథ సినిమా తియ్యాలంటే నావి కొన్ని కండిషన్లు వున్నాయి. మీ అన్నదమ్ములు ముగ్గురూ ఈ రాత్రికి మా యింటికి రండి. అన్నీ వివరంగా చెప్తాను.'

'ఎన్నింటికి రమ్మంటారు?'

'ఏడింటికి రండి!'

'ఓ. కే. అలాగే వస్తాము.'

ఫోన్ డిస్‌కనెక్ట్ కాగానే, మైత్రేయ రిసీవరు క్రేడిల్ పైన పెట్టాడు.

అతని ఆలోచనల నిండా సుశీలే మెదలసాగింది. రాజు వచ్చి తనను బ్రతిమిలాడినప్పుడు సరేనని ఒప్పుకొని వుంటే, ఆమెను తను చూడగలిగే వాడు. గుర్తుపట్టాక ఆమెకు సినిమాలో చేరే అవసరం లేకుండా చేసే వాడు.

ఎవరి కోసమైతే ఇన్నాళ్ళు తపించాడో, ఆ బిడ్డ తన కళ్ళముందే దారుణంగా మానభంగం పాలై, మరణించడం, మనోవికారాన్ని, విచారాన్ని, కలిగించింది. ఆమెను తిరిగి బ్రతికించు కోవడం సాధ్యం కాదు. కనీసం పగ తీర్చుకోగలిగినా చాలనిపించింది.

# 5

ఏడు కొట్టేసరికి, కారు హారన్ వినిపించింది. మైత్రేయ పోర్టికోలో కాచ్చి నిల్చున్నాడు.

ఆగిన అంబాసిడర్ కార్లోంచి, ఆనందన్ ఒక్కడే దిగాడు. "నమస్తే సార్!" అన్నాడు ఆనందన్.

"వాళ్ళేరి?"

"వస్తుంటారు." చెప్పాడు.

ఇద్దరూ లోపికి వెళ్ళారు.

కుర్చీలో కూర్చున్నాక "చెప్పండి!" అన్నాడు ఆనందన్.

"వాళ్ళను కూడా రానివ్వండి!"

"అవసరం లేదు. అందరి తరఫున నిర్ణయాలు తీసుకునే అధికారం నాకుంది."

"రైట్! మీ కంపెనీ గురించి నేను చాలా చెడ్డ విషయాలు విన్నాను. కొన్ని కథల్ని యిష్టమొచ్చినట్లు మార్చడం, వేషాలు ఇస్తామంటూ అందమైనఅమ్మాయిల్ని నమ్మించి, వాళ్ళను మానభంగం చెయ్యడం, ఎవరైనా ప్రతిఘటిస్తే,వాళ్ళను చంపడానికైనా సిద్ధపడటం, డబ్బు బలంతో ఆ కేసులు మీ పైకి రాకుండా, తప్పించుకోవడం మొదలైనవి. అలాంటివాళ్ళు నా కథలు సినిమా తీయడం నా కిష్టం లేదు." అన్నాడు మైత్రేయ.

"ఇవన్నీ మీకెవరు చెప్పారు?"

"నేను నమ్మే మనుషులు!"

"వాళ్ళకు మా పైన ఏదైనా కక్ష వుండాలి. లేకుంటే ఇలా కల్పించి కట్టుకథలు చెప్పరు. వ్యాపారంలో మాకు చాలామంది పోటీదారులు వున్నారు. 'అగ్నిజ్వాల' మేము కొన్నాక, అయ్యో మనం కొంటే బాగుండేదన్న దృష్టితో ఇలాంటి నీచానికి పాల్పడి వుంటారు" అన్నాడు ఆనందన్.

"అయితే మీరు మంచివాళ్ళమంటారా?"

"ఖచ్చితంగా!"

"మీ ఆఫీస్ బాయ్ రాజు ఒక అమ్మాయిని మాన

భంగం చేసి చంపాడు. తెలుసు కదూ!"

"తెలుసు!"

"అంతకన్నా వేరే ఉదాహరణ ఇంకేం కావాలి?"

"అంటే...."

"మీ దగ్గర పని చేసే వాళ్ళే అంత దారుణం చేస్తుంటగా, మీరు చెయ్యరని ఎందుకనుకోవాలి!"

'వాడ్ని మేమే పోలీసులకు పట్టిచ్చాం. అవసరమైన సాక్ష్యం చెప్పాం. ఇంతకన్నా మా విజాయితీకి వేరే ఆధారం కావాలా?' అడిగాడు ఆనందన్.

సర్వెంట్ రెండు బ్రాందీ గ్లాసులు తెచ్చిపెట్టాడు బల్ల పైన.

'తీసుకోండి!' అన్నాడు మైత్రేయ.

ఆనందన్ గ్లాసు అందుకొని గటగట తాగాడు. మైత్రేయ రెండో గ్లాసు కూడా అందించాడు.

'మీరు?' అడిగాడు ఆనందన్.

'మీ దాహం తీరనివ్వండి" అంటూ బలవంతం చేసి రెండో గ్లాసు కూడా అందించాడు. ఆనందన్ అందుకుని అది కూడా ఒక గ్రుక్కలో ముగించాడు.

'ఇప్పుడేమంటారు?' అడిగాడు గ్లాసు క్రిందబెడుతూ.

"అగ్ని జ్వాలలో క్రొత్త అమ్మాయిల్ని తీసుకో కూడదు. నా కథలు నా అనుమతి లేకుండా ఏవిధమైన మార్పులు చెయ్య కూడదు. అలా ఒప్పుకుంటే మీరు దాన్ని సినిమా తీసేందుకు నా కభ్యంతరం లేదు.' అన్నాడు మైత్రేయ.

"అలాగే! మీ కండిషన్లకు ఒప్పుకుంటున్నాను." అన్నాడు ఆనందన్ కుర్చీలోంచి లేస్తూ.

" థాంక్స్ ! ' చెప్పి, పోర్టికో దాకా సాగనంపాడు మైత్రేయ అతన్ని. అతని కారు వెళ్ళాక తిరిగి లోని కొచ్చాడు.

బ్రాండీలో విషం కలిపిచ్చాడు ఆనందస్ కు. అది పని చెయ్యడం ప్రారంభించడానికి దాదాపు రెండు గంటల వ్యవధి వుంటుంది. పోస్టుమార్టమ్ చేసినా అంతకు ముందే తీసుకున్నట్లు ఋజువు అవుతుంది. అందువల్ల తన్ను ఎవ్వరూ అనుమానించరు.

ఈ విషం తయారు చేసే విధానాన్ని కొన్నాళ్ళ క్రితం ఒక అమెరికన్ మాగజైన్‌లో చదివాడు. అప్పట్లో తయారు చేశాడు. అనసూయకు దాన్ని ఇచ్చి చంపాలన్న ఊహ ఉండిందా రోజుల్లో.

విషం తయారయ్యాక తన ఇంట్లో వున్న కుక్కకు ఇచ్చి చూశాడు. ఆ పత్రికలో రాసినట్లే రెండు గంటల తర్వాత చచ్చింది. ఆ తర్వాత అతనా ప్రయత్నం విరమించు కున్నాడు. ఆ మాగజైన్ కాపీ, తన లైబ్రరీలో భద్రంగా వుంచుకున్నాడు.

ఇంక కుమరన్, రామన్, వున్నారు. వాళ్ళను చంపడ మెలాగాని ఆలోచిస్తూ కూర్చున్నాడు. ముగ్గురూ వచ్చి వుంటే ఒక్కసారే తనపని పూర్తయ్యేది. వాళ్ళు రాక పోవటం ఒక విధంగా అతనికి నిరాశ కలిగించింది. అయినా వాళ్ళను వదలడం ఇష్టంలేదు. ఎలాగైనా తన కక్ష సాధించాలని తీర్మానం చేసుకున్నాడు.

సుశీలరూపం మెదలింది. ఆ ముగ్గురిమధ్య చిక్కు కొని మానరక్షణకు, ప్రాణరక్షణకు, ఆమె ఆక్రోశించడం, అల్లాడడం, అతని కళ్ళముందు ఊహాచిత్రాల్లా మెదిలాయి.

పిడికిళ్ళు బిగుసుకున్నాయి. రక్తం కళ్ళలోకి ఉబికింది.
రాత్రంతా నిద్రలేకుండా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

# 6

తెల్లవారుతూండగా ఫోన్ వచ్చింది. రామన్ ఫోన్‌లో వాళ్ళ అన్నగారైన ఆనందన్ అకస్మాత్తుగా చని పోయాడని చెప్పాడు.

మైత్రేయ ఆశ్చర్యం ప్రకటించి, వెంటనే వస్తున్నా నని చెప్పాడు. అరగంటకల్లా ఆనందన్ బంగళాకు చేరు కున్నాడు. అప్పటికే జనం పెద్ద కోలాహలంగా మూగి వున్నారు. రామన్ మైత్రేయ దగ్గరకు వచ్చాడు.

"ఎలా జరిగింది ?" అడిగాడు అమాయకంగా.

'అర్థంకావడం లేదు!' అన్నాడు రామన్.

'ఏమైనా సుస్తీ 'చేసిందా?

'అలాటిదేమీ లేదు. రాత్రి పదింటిదాకా మేము ముగ్గురం మాట్లాడుకుంటూ కూర్చున్నాం. ఆ తర్వాత మేము వెళ్ళిపోయాం. పన్నెండింటికి ఫోన్ వచ్చింది. వచ్చి చూశాం. అప్పటికే అన్నయ్య చనిపోయాడు.' రామన్ చెప్పాడు.

'ఆత్మహత్య చేసుకున్నాడేమో?'

'అన్నయ్యకలాంటి అవసరం లేదు!'

'ఎందుకైనా మంచిది. పోలీసుల్ని పిలవకపోయారా?' సూచించాడు మైత్రేయ యధాలాపంగా.

'అవసరం లేదు! దహనానికి అన్ని ఏర్పాట్లు చేశాం' అన్నాడు రామన్.

ఇంకొంత సేపు అక్కడే వుండి, తిరిగి ఇంటికి

వచ్చేశాడు మైత్రేయ.

అతనికి చాలా ఆనందంగా వుంది. మొదట హత్య, సులభంగానే జరిగి పోయింది. తర్వాత గురి రామన్ పైపు పెట్టాడు.

ఆ సాయంత్రం ఫోన్ చేసి రామన్ను రమ్మని చెప్పాడు. వాళ్ళ అన్నయ్య చని పోవడం గురించి, తన కున్నకొన్ని అనుమానాల్ని చెప్తానని చెప్పాడు.

సాయంత్రం రామన్ వచ్చాడు.

"ఏమిటి మీ అనుమానాలు?" అడిగాడు రామన్.

'మీ దగ్గర పని చేసే రాజు తన చెల్లెల్ని మీరు అన్నదమ్ములు ముగ్గురూ బలవంతంగా అనుభవించి, ఆ తర్వాత చంపి శవాన్ని కూంరివర్‌లో పడేశారని పోలీ సులకు చెప్పాడు గదూ.' అడిగాడు మైత్రేయ.

'అవును!'

"అతని మనుషులెవరన్నా మీ అన్నయ్యను హత్య చేశారేమోనని నాకనుమానంగా వుంది." అన్నాడు మైత్రేయ.

"వాడి మొహం! ఏదో వాడు తప్పించు కొనేందుకు అలా చెప్పాడు తప్ప, ఇంత దారుణం చెయ్యగలిగిన మనుషులెవ్వరూ వాడికి అండ వుండరు." అన్నాడు రామన్.

"అంటే వాడు చెప్పింది నిజమేనా ?" అడిగాడు మైత్రేయ.

'అంతా అబద్ధాలు! డబ్బుకు అశపడి, ఎవర్నో తీసు కొచ్చి వుంటాడు. వాళ్లు ఈ దారుణం చేసివుంటారు.' అంటూ జేబులోంచి చిన్న సీసా తీసి, అందులోంచి ఒక

తెల్లటి టాబ్లెట్ నోట్లో వేసుకున్నాడు.

"ఏమిటా టాబ్లెట్?" అడిగాడు మైత్రేయ.

"నాకు బ్లడ్ షుగర్ వుంది సార్. గంట కొక టాబ్లెట్ వేసుకోవాలి." అన్నాడు రామన్.

'ఈ వయస్సులోనే ఇంత దారుణమైన జబ్బా!'

'ఖర్మ! అంత కన్నా మరేం చెప్పాలి!' అన్నాడు విస్పృహగా.

'మీలాగే నాకూ వుంది. కానీ రోజుకు ఒక్క టాబ్లెట్ వేసుకుంటాను. అది రాత్రి పడుకోబోయే ముందు. అవి ఈ దేశంలో దొరకవు. అమెరికాలో దొరుకుతాయి. నా స్నేహితుడు పంపుతూ వుంటాడు' అన్నాడు మైత్రేయ.

'అలాంటిదేదన్నా వుంటే నాక్కూడా ఇవ్వండిసార్!' అన్నాడు రామన్.

'నా దగ్గర రెండు మూడు వున్నాయి. ఒక టాబ్లెట్ ఇస్తాను. ఈ రాత్రికి వేసుకుని చూడండి. బాగా పని చేస్తూ వుంటే మీక్కూడా తెప్పించి ఇస్తాను' అన్నాడు.

తన పని ఇంత సులభంగా జరిగిపోతున్నందుకు ఆనందపడ్డాడు మైత్రేయ. లోనికి వెళ్ళి, ఐదు నిముషాల తర్వాత తిరిగివచ్చి, చిన్నపొట్లం అందిస్తు 'మా సర్వెంటు ఇంట్లో వస్తువుల్ని ఉన్నచోట ఉండనివ్వదు. వెతికేసరికి నీరసం వచ్చింది' అన్నాడు మైత్రేయ

రామన్ పొట్లం అందుకొని జేబులో వేసుకుంటూ 'థాంక్స్!' అన్నాడు.

"ఎందుకయినా మీరు జాగ్రత్తగా ఉండటం మంచిది. నా అనుమానాలు నేను చెప్పాను.'' అన్నాడు మైత్రేయ.

"వస్తాను. మీవి కేవలం ఊహలు మాత్రమే!"
అంటూ వెళ్ళిపోయాడు రామన్.

# 7

ఉదయం నిద్ర లేచి కాలకృత్యాలు ముగించుకొని, ఆనంద్ స్టూడియోకు ఫోన్ చేశాడు. అక్కడ్నుంచి రెస్పాన్స్ లేదు. దాంతో అర్ధగంటకో మారు ఫోన్ చేస్తూనే వుండిపోయాడు. గంట పదయినా ఎవ్వరూ ఫోన్ తియ్యలేదు.

డైరక్టరీ వెతికి రామన్ వుండే యింటి నెంబరుకు ఫోన్ చేశాడు. అక్కడే వెంటనే ఫోన్ తీశారు.

"రామన్‌గారున్నారా?" అడిగాడు.

"మీ రెవరు?" అవతల నుండి జవాబు ప్రశ్న రూపంలో వచ్చింది

"మైత్రేయను. ఈ దినం కలుసుకుందా మన్నాడు. ఎన్నిగంటలకు, ఎక్కడ కలుసుకోవాలో అడుగుదామని...." అన్నాడు మైత్రేయ.

"ఆయన రాత్రి చనిపోయారు. ఇక్కడంతా వాళ్ళ బంధువులు, పోలీసులు, నిండి ఉన్నారు." అంటూ జవాబు కోసం ఎదురు చూడకుండా ఫోన్ కట్ చేశాడు అవతలవ్యక్తి.

మైత్రేయ గబగబ డ్రెస్ వేసుకుని, కారెక్కి రామన్ ఇంటివేపు పోనిచ్చాడు. ఆ యిల్లు చేరేందుకు పదిహేను నిముషాలు పట్టింది.

కారు దిగి జనాన్ని తప్పించుకుని మెల్లగా లోనికి వెళ్ళాడు. కుమరన్, మైత్రేయను చూడగానే, వడివడిగా

దగ్గరకొచ్చి, "అన్నయ్యా లిద్దరూ అకస్మాత్తుగా చని పోయారు !" అన్నాడు.

'అవును. ఈ దినం కలుసుకుందా మనుకున్నాం.' అన్నాడు. మైత్రేయ కన్నీళ్ళు తుడుచుకుంటూ.

'అంతా విచిత్రంగా వుంది !'

'పోలీస్ కంప్లయింటు చేశారా ?'

"ఆఁ ! ఎందుకైనా మంచిదని నేనే చేశాను. శవాన్ని పోస్టుమార్టం చేస్తామంటున్నారు. మా అమ్మా, నాన్న వద్దంటున్నారు. నా కేమో చేయించాలని వుంది. పెద్ద న్నయ్య చనిపోతే ఏదో ప్రమాదమనుకున్నాను. ఇప్పుడు అలా అనుకోలేకుండా వున్నాను.' అన్నాడు కుమరన్.

'ఎవరో మీ మీద పగబట్టి నట్లువుంది. ఇక మిగిలింది నువ్వే. జాగ్రత్తగా వుండడం మంచిదను కుంటాను'. అన్నాడు మైత్రేయ.

'నా జోలికి వచ్చారంటే, వాళ్ళెవరైనా సరే, చిక్కిపోతారు. నా సంగతి తెలీదు.' గర్వంగా చెప్పుకొన్నాడు.

"ఇలా మీ పైన పగబట్టే అవసరం ఎవరి కన్నా వుందా?"

'మీరు వేసిన ప్రశ్నల్లాంటివే ఒక వంద వేశాడు ఇన స్పెక్టర్. మా కెవ్వరిపైనా అనుమానం లేదు.' అన్నాడు కుమరన్.

అంతలో ఇన్‌స్పెక్టర్ అక్కడికొచ్చి నిలబడి "నమస్తేసార్ !" అన్నాడు మైత్రేయను చూసి.

'వీరు మీకు తెలుసా ?' అడిగాడు కుమరన్.

"తెలుసు. రెండు రోజుల క్రితం స్టేషనుకొచ్చారు." మీదగ్గర పనిచేసే రాజుని చూడాలన్నారు. చూపించాను. అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"రాజుమీకు తెలుసా?"

'తెలుసు. అతని చెల్లెలెవరో వుందని, ఆమెను ఎవరికైనా చెప్పి, సినిమాల్లో వేషాలు ఇప్పించాలని అడిగేవాడు. మీ ఆఫీసు దగ్గరే అతనితో పరిచయమైంది. అతని తాలూకు మనుషులెవరన్నా మీ పైన పగ పెట్టుకొని, ఈ హత్యాకాండ సాగిస్తున్నారేమోనని అనుమానంగా వుంది.' అన్నాడు మైత్రేయ.

'ఇవి హత్యలని మేము అనుకోవడం లేదు. అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"కులాసాగా తిరిగే ఇద్దరూ అకస్మాత్తుగా చనిపోతే వాట్ని ఏమనాలో నాకు తెలీడంలేదు. నా దృష్టిలో హత్యలనే అనిపిస్తున్నాయి.'

'అయితే ఎవరు చేస్తున్నారంటారు?

"అది తెలుసుకోవలసింది మీరు." అన్నాడు. మైత్రేయ నవ్వుతూ ఇన్‌స్పెక్టర్‌తో.

'శవాన్ని పోస్ట్ మార్టం చేశాకగాని, నేనేటూ నిర్ణయించుకోలేను.' అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఆ చర్య అంతటితో ముగిసింది. మైత్రేయ అందరి దగ్గర సెలవు తీసుకుని ఇంటికి తిరిగివచ్చేశాడు.

ఇంతదాకా తన పైన ఎవ్వరికీ ఏ విధమైన అనుమానం రాకుండా ఇద్దర్ని హత్య చెయ్యగలిగాడు. ఇప్పుడు పరిస్థితులు చాలా వరకు తారు మారయిన విషయం గమనించాడు. మొదటిది పోలీసులు రంగం లోకి ప్రవేశించడం. రెండవది రామన్ శవాన్ని పోస్ట్ మార్టం చెయ్యడం. అది జరిగాక రామన్‌కు విష ప్రయోగం జరిగిందనీ తెలుసుకోవడం వాళ్ళకు అంత

పెద్ద సమస్య కాదు. ఆ ప్రయోగం ఎవరు చేసి వుంటారా అన్న అనుమానముతో, రామన్‌కు తెలిసిన అందర్నీ, అంటే వాళ్ళతో పాటు తననూ సందేహించ వచ్చునన్న విషయం విదితమైంది మైత్రేయకు.

పోలీసుల పరిశోధన ఎక్కువ దూరం పోయి, అనుమానం తన దాక రాకముందే కుమరన్‌ను మట్టు పెట్టాలి. అలా చెయ్యకుంటే ఆ అవకాశం, పూర్తిగా జారి పోయే ప్రమాదముందనిపించింది.

కుమరన్‌ను ఆ రాత్రికి అతని మకాంలోనే మట్టు పెట్టాలని నిర్ణయించుకున్నాడు.

# 8

రాత్రి పన్నెండయింది.

మైత్రేయ నల్ల పాంటు, కోటు ధరించాడు. నల్లటి మఫ్లర్ మెడచుట్టూ చుట్టుకున్నాడు. చేతులకు నల్లటి గ్లోవ్స్ ధరించాడు. విషం సీసా జేబులో వేసుకున్నాడు. ఆరంగుళాల బ్లేడున్న స్టెయిన్ లెస్ స్టీల్ బిచ్చువా, జాగ్రత్తగా కాగితంలో చుట్టి లోపలి వైపున్న కోటు జేబులో దాచుకున్నాడు.

ఆ రోజు సాయంత్రం తన నవల సినిమా తీసే వుద్దేశ్యం వుందో, లేదో, తెలుసు కోవాలన్న మిషతో కుమరన్ వుంటున్న యింటికి వెళ్ళి వచ్చాడు. ఆ యింటి పరిసరాలు బాగా ఆకళింపు చేసుకున్నాడు.

ఆ యింట్లో కుమరన్‌తో పాటు ఒక పనివాడున్నాడు. అతని మంచి చెడ్డలు ఆ పని వాడు చూస్తూ వుండాలని పించింది. రాత్రిళ్ళు గూడా వాడు అక్కడే వుంటాడని,

వాడి బట్టలు, మాట్లాడే తీరుని బట్టి ఊహించాడు.

మైత్రేయ, కుమరన్ ఇంటికి వెళ్ళే సరికి, పోస్ట్ మార్టం రిపోర్టు అందటంతో, అందులోని వివరాలు చెప్పాడు కుమరన్. దారుణమైన విష ప్రయోగం వల్ల రామన్ చని పోయినట్లు తేల్చారు. విషప్రయోగం ఎన్ని గంటలకు జరిగిందీ డాక్టర్లు అంచనా వేయలేక పోయా రని కూడా చెప్పాడు కుమరన్.

ఆ పాయింటుతో మైత్రేయకు కొంత ధైర్యం కలి గింది.

పోలీసులు తమ దర్యాప్తు ప్రారంభించారని కూడా తెలుసుకున్నాడు కుమరన్ ద్వారానే.

మైత్రేయ తన ఇంట్లోనించి, పనివాడికంట బడకుండా బైటకు చేరుకున్నాడు. కొంతదూరం నడచి, ఒక ఆటో మాట్లాడుకుని, నుంగంబాకం స్టేషనుకు పోనిమ్మన్నాడు. అదీగాక డబ్బులిచ్చి ఆటోని పంపించి వేశాడు.

ఆటోదూరంగా వెళ్ళిపోయాక మెల్లిగా నడచుకుంటూ బయలుదేరి, ఐదారురోడ్లు దాటి, కుమరన్ ఇంటికి చేరు కున్నాడు.

మేడమీద గదిలో మాత్రం లైట్లు వెలుగుతున్నాయి. క్రిందంతా చీకటిగా వుంది. పొట్టిగావున్న కాంపౌండ్ గోడ దూకి లోనికి చేరుకున్నాడు.

పోర్టికోలో, చాప వేసుకుని, పనివాడు పడుకుని గుర్రు పెడుతుండటం చూశాడు. లోపలి కెళ్ళేందుకు దారికోసం చూశాడు. తలుపులు మూసి తాళం వేసివున్నాయి. అంటే తాళాలు పనివాడు దగ్గర పెట్టుకొని వుండాలని పించింది.

అడుగులో అడుగు వేసుకొంటూ వెళ్ళి, అతవి తల క్రింద చెయ్యిపెట్టి వెతికాడు. రెండో చెయ్యి, లోపలున్న బిచ్వా పైన వుంది.

తాళాలగుత్తి చేతికందింది. దాని సాయంతో తాళం కప్పతీసి లోనికి అడుగుబెట్టాడు. మెల్లిగా వెతుక్కుంటూ చీకట్లోనే మెట్లవైపు నడిచాడు. రైలింగ్ ఆధారంగా ఒక్కొక్క మెట్టే పైకెక్కాడు మైత్రేయ. పై భాగం చేరగానే, లైటు వెలుగుతున్న గదివేపు నడిచాడు. నడవ లోనికి తెరచి వుంచిన ఫ్రెంచి విండో గుండా వంగి చూశాడు.

కుమరన్ మత్తుగా పడుకున్నాడు. అతని తల నగ్నమైన ఓ అందమైన సుందరి పొట్టపై నుంది. ఆమె కూడా నిద్రలో జోగుతోంది.

కుమరన్‌ను చూడగానే రక్తం ఉడుకెక్కింది. కిటికీ గుండా మెల్లిగా లోనికి దూకాడు మైత్రేయ. స్విచ్‌బోర్డు కున్న పియానో స్విచ్ నొకదాన్ని అర్పాడు. లైటు ఆరి పోయింది. గదంతా చిమ్మచీకటి కమ్ముకుంది బిచ్వాతీసి, మంచం వైపు నడిచాడు.

పడుకున్న ఆకారం పైకి లేస్తున్నట్లనిపించింది. కళ్లు చిట్లించుకుని చూశాడు మైత్రేయ. ఆ ఆకారం ఆ అమ్మాయిదని తెలుసుకున్నాడు.

క్షణం వ్యర్థం గాకుండా బిచ్వాతో కుమరన్ గుండెల్లో పొడిచాడు. కుమరన్ 'అమ్మ' అంటూ బాధగా అరిచాడు।

ఆ అమ్మాయి "దొంగ దొంగ" అంటూ అరచింది. వెనుదిరిగి చూడకుండా, కిటికీ గుండా నడవాలోకి

దూకాడు. అక్కడ్నించి మెట్లు దిగాడు. అతని వెనుక వడివడిగా లైట్లు వెలిగాయి.

ఆ కాంతి కన్నా ముందు దూసుకు పోవాలని వ్యర్థ ప్రయత్నం చేశాడు. క్రిందున్న తలుపునెట్టాడు అది తెరచుకోలేదు. అప్పటికే వెనుక నుంచి ఆ అమ్మాయి తరుముకుంటు వచ్చింది.

మైత్రేయను చూడగానే కెవ్వుమని కేక పెట్టింది. ఠక్కున ఆమె పైకి దూకి గొంతు పట్టు కున్నాడు.

'అరిస్తే చంపేస్తాను!' అన్నాడు మైత్రేయ.

అరవనన్నట్లు సంజ్ఞ చేసింది ఆ అమ్మాయి.

ఉన్నట్టుండి తలుపులు తెరచుకున్నాయి.

ఎదురుగా కుమరన్ పనివాడు, పోలీసులు కనిపించారు.

మైత్రేయ బిక్క చచ్చిపోయాడు.

ఇన్స్పెక్టర్ పైకి పరుగెత్తాడు. కుమరన్ అప్పటికే చనిపోయాడు. తిన్నగా క్రిందకు దిగివచ్చాడు.

"మిస్టర్ మైత్రేయా! నిన్ను అనుమానించాను. కానీ రావడం లేటయింది" అన్నాడు.

మఫ్లర్ తీసి పడేస్తూ 'వీళ్ళు" ముగ్గురూ నరరూప రాక్షసులు. నా కూతురి శీలాన్ని దోచుకుని, ఆమెను చంపి పారేశారు. వాళ్ళ పైన అందుకే పగ బట్టాను. కక్ష తీర్చు కున్నాను." అన్నాడు.

"ఆ విషయాలన్ని తెలుసుకున్నాం రాజును కలుసు కున్నాక అతని గదికి వెళ్ళగం, అక్కడి ఫోటోలు తీసు

కోవడం, ఆనందన్, రామన్ మీ ఇంటికి రావడం, ఇవన్నీ తెలిశాక, హంతకుడు నువ్వు తప్ప వేరే ఎవ్వరూ కాదని తెలుసుకొన్నాం. ఆ అమ్మాయి పెద్దగాఅరవడంతో వెలుపల్నించి, ఆతను తలుపులు మూశాడు. అప్పుడే మేము వచ్చాం!" అన్నాడు ఇన్‌స్పెక్టర్, మైత్రేయకు సంకెళ్ళు బిగిస్తూ.

(ఐపోయింది)

# "మృత్యు కిరణాలు"

అంధవరపు మల్లిబాబు

స్ప్రింగ్ డోర్స్ తెరుచుకున్న శబ్దమయింది.

గదిలో గంభీరంగా పచార్లుచేస్తున్న సి.బి.ఐ. డైరక్టర్ శివరామ్ చిన్నగా తలతిప్పి చూసేరు.

'గుడ్ మోర్నింగ్ సర్'

స్మార్ట్‌గా సెల్యూట్ చేస్తూ లోనికొచ్చేడు సి.బి.ఐ. ఏజంట్ విహారి.

"వెరీ బాడ్ మోర్నింగ్ మై బోయ్! ప్లీజ్ టేక్ యువర్ సీట్' అని శివరామ్ తన రివాల్వింగ్ ఛెయిర్లో కూలబడ్డారు భారంగా.

శివరామ్ కెదురుగావున్న కుర్చీలో కూర్చున్నాడు విహారి.

'వాట్ హేపెండ్ సర్? ఎనీ థింగ్ రాంగ్?' అనడిగేడు విహారి.

"యుద్ధం! మళ్ళీ యుద్ధం వస్తోంది విహారీ!" అన్నారాయన దిగాలుగా.

'యుద్ధమా? ఎవరితో ఎందుకు?' విహారికా యన మాటలు అర్థంకాలేదు.

"పాకిస్తాన్‌తో! యుద్ధ సన్నాహాలు ముమ్మరంగా సాగుతున్నాయట." అన్నారు సి. బి. ఐ. డైరక్టర్ శివరామ్ భారంగా నిట్టూరుస్తూ.

"1965 లో అనవసరంగా మనతో యుద్ధానికి తలపడి చావు దెబ్బ తిన్న విషయం పాకిస్తాన్ అప్పుడే మరిచిపోయిందా? యు. ఎన్. ఓ. కలగజేసుకున్నందువల్ల 1965 లో పాకిస్తాన్‌ని విడిచిపెట్టడం జరిగింది. లేకుంటే పాకిస్తాన్ ఈనాడు మళ్ళీ మనతో యుద్ధానికి తలపడేది కాదు. అయినా యుద్ధవార్త మనకెలా చేరింది?"

"పాకిస్తాన్‌లో వున్న మన ఏజంట్ 222 పంపిన రిపోర్ట్స్ ద్వారా అన్ని విషయాలు తెలిసాయి."

"పాకిస్తాన్ దండయాత్రకు కారణం?"

సి. బి. ఐ. డైరక్టరు శివరామ్ గొంతు సవరించుకొని చెప్పడం ప్రారంభించేరు.

"1947 వరకు అవిరామంగా పోరాడితే మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అంగ్లేయులు యిండియాని వదలి పెడుతూ ముస్లిమ్స్‌కి, మనకు చీలిక పెట్టేరు. దాంతో ముస్లిమ్స్ ప్రత్యేక దేశం కావాలన్నారు. ఎందరు నచ్చజెప్పిన వినకుండా పట్టుబట్టేరు. చేసేది లేక యిండియాలో కొంత భాగం పంచి యిచ్చేరు. అదే పాకిస్తాన్!

అప్పటికి యిండియాలో అయిదు వందలకు పైగా

సంస్థానాలుండేవి. యిండియా చీలిపోతున్న తరుణంలో ప్రభుత్వం ప్రకటించింది, ఏ సంస్థానానికి ఏ దేశంలో కలవాలనుంటే ఆ దేశంలో కలిసి పొమ్మని. కొన్ని సంస్థానాలు పాకిస్థాన్‌లోనూ, కొన్ని సంస్థానాలు యిండియాలోనూ కలిసేయి.

యిండియాలో కలిసిన సంస్థానాల్లో కాశ్మీర్ ఒకటి. కాశ్మీర్ యిష్టపూర్వకంగా కలిసి పోవడానికి అంగీకరిస్తూ రాసియిచ్చిన కాయితం యిప్పటికీ మన దగ్గరే వుంది.

ఆనాటి సంస్థానాల్లో అతి పెద్దది, ముఖ్యమైనది కాశ్మీర్. అంతేగాకుండా యిండియాలోకెల్ల అత్యంత సుందరమైన ప్రదేశం. దేశదేశాల నుండి ప్రతిరోజూ వేలకొలది యాత్రికులు కాశ్మీర్‌ని సందర్శించడానికి వస్తుంటారు. దీనివల్ల దేశానికి ప్రతిఏటా కొన్నికోట్ల విలువజేసే విదేశీ మారకద్రవ్యం లభిస్తోంది.

కాశ్మీర్ పళ్ళతోటలకు ప్రసిద్ధి. పళ్ళు విస్తారంగా పండి దేశంలో నలుమూలలకు పంపగా, కొంతభాగం విదేశాలకు ఎగుమతి చేయడం జరుగుతోంది. ఈ రకంగా కూడా కొంత విదేశీ మారకద్రవ్యం లభిస్తోంది.

ముఖ్యంగా కాశ్మీర్ తేయాకు పంట ఉత్పత్తిలో ఒక ఉన్నతమైన స్థానాన్ని ఆక్రమించింది. తేయాకు ఉత్పత్తి భారతదేశపు ఆర్థిక వ్యవస్థలో ప్రధమస్థానాన్ని ఆక్రమించుకుంది. ప్రస్తుతం తేయాకు ఎగుమతుల్లో మనదే అగ్రస్థానం. అంతేగాకుండా ప్రపంచ మార్కెట్‌లో మన దేశపు తేయాకుకి-అందులోనూ కాశ్మీర్‌లో పండిన తేయాకుకి మంచి గిరాకీ వుంది. ప్రతి ఏటా తేయాకు

ఎగుమతుల వల్ల మనం ఎంతో విదేశీమారక ద్రవ్యాన్ని ఆర్జిస్తున్నాం.

కాశ్మీర్ మన దేశంలో కలిసి పోవడం వల్ల పాకిస్తాన్‌కి కన్నెర్ర అయింది ఈర్ష్యాసూయలు రగిలి, కాశ్మీర్ వలన మనకనేక విధములుగా లాభిస్తుండడం భరించలేక 1965 లో హఠాత్తుగా దండయాత్ర చేసి కాశ్మీర్‌లో కొంత భాగాన్ని ఆక్రమించుకుంది. హఠాత్తుగా మొదలైన దండయాత్ర అవి వెనుకాడక పాక్ సైన్యాన్ని చీల్చి చెండాడింది భారత సైన్యం.

ఆ పరిస్థితుల్లో యు.ఎన్.ఓ. కలగజేసుకుని, యుద్ధాన్ని నిలిపి, సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకోమనీ, చర్చలు జరపమనీ కోరింది. యుద్ధం ఆగిపోయింది.

అప్పట్నుండీ పాకిస్తాన్‌లో రాజకీయ పరిస్థతులు, సాంఘిక పరిస్థితులు అస్తవ్యస్తంగా ఉన్నందున సరయిన చర్చలు జరగలేదు. పాకిస్తాన్ ఆక్రమించుకున్న కాశ్మీర్ భాగం మనకు తిరిగి యివ్వనూలేదు. ఆ సమస్య అపరిష్కృతంగానే మిగిలి పోయింది.

ఇప్పుడు మళ్ళీ దండయాత్ర తప్పదని పాకిస్తాన్ నుండి వచ్చిన వార్తలు వింటుంటే గుండెల్లో బాంబులు బద్దలౌతున్నాయి. ఏం చేయాలో తోచడం లేదు...." ఆయాసంగా వూపిరి తీసుకున్నారు శివరామ్‌గారు.

'పాకిస్తాన్‌తో యుద్ధానికి మనమెందుకు భయపడాలి? 1965 లో తరిమి కొట్టినట్టుగానే మళ్ళీ తరిమేస్తాం. మన శక్తి సామర్థ్యాలు మరోసారి రుచి చూపించడమే గాకుండా 965 లో పాకిస్తాన్ ఆక్రమించుకున్న కాశ్మీర్ భూభాగం మనం వశపరచు కుందాం" అన్నాడు విహారి

ఆవేశంగా.

సి. బి. ఐ. డైరక్టర్ శివరామ్ నిర్జీవంగా నవ్వేరు. 'మునుపటిలా పాక్ సైన్యాన్ని తరిమికొట్టడం ఇప్పుడు అంత సులువు కాదు' అన్నారు శివరామ్.

'ఏం ? పాకిస్తాన్‌కి ఏ దేశమన్నా వెనుక వుండి మద్దతు నిస్తుందా ?'

"కాదు ! మృత్యుకిరణాలు పేరెప్పుడైనా విన్నావా?"

'మృత్యుకిరణాలా ! నేనెప్పుడూ వినలేదే ! !'

"నువ్వేకాదు ఎవరూ వినలేదు. ఇది పాకిస్తాన్ చేస్తున్న సరికొత్త ప్రయోగం. పాకిస్తాన్‌లో ఎక్కడో పరిశోధనలు జరుపుతున్నారట. ఈ కిరణాలను రివాల్వర్‌లోనూ, రైఫిల్స్‌లోనూ, టాంక్స్‌లోనూ ప్రవేశపెట్ట వచ్చునట. ఒక్కసారి ట్రిగ్గర్ ప్రెస్ చేస్తే సుమారు అయిదు వందల అడుగుల దూరం ప్రసరితమై, దావాపు వేయిమందిని హతమారుస్తుంది. పాకిస్తాన్‌లోని మన ఏజంట్ 222 ఈ విషయాన్ని రిపోర్ట్ పంపించేడు."

'మైగాడ్ !' అన్నాడు విహారి ఆశ్చర్యపోతూ.

'ఈ లెక్కన చూస్తే మన భారత సైన్యం నామ రూపాల్లేకుండా అయిపోవడానికెంతోసేపు పట్టదు. రెండు సార్లు మన చేతిలో చావుదెబ్బ తిన్నా మళ్ళీ మన మీద పాకిస్తాన్ యుద్ధాన్ని ప్రకటిస్తుందంటే, ఆ మృత్యు కిర ణాలే కారణం !'

విహారి ఆలోచిస్తూ మౌనంగా తలూపేడు.

"దేశం కోసం మరో సారి తెగించి పాకిస్తాన్ వెళ్ళ గలవా విహారీ !" అడిగేరు సి. బి. ఐ. డైరెక్టర్ శివ రామ్.

'నా దేశంకోసం ఏం చేయడానికైనా, ఎక్కడికి వెళ్ళ డానికైనా వెనుకాడను. పాకిస్తాన్ వెళ్ళడానికి నేను సిద్ధం. నేనేం చేయాలో చెప్పండి.'

'పాకిస్తాన్ వెళ్ళి, 'మృత్యుకిరణాలు' పరిశోధన ఎక్కడ జరుగుతున్నాయో తెలుసుకుని, ఆ లేబరేటరీని నాశనం చేసిరావాలి. నువ్వు పాకిస్తాన్‌కి విహారిగా కాక అన్వర్ హుస్సేన్ పేరుతో ఓ యాత్రికుడిగా వెళతావ్. పాస్‌పోర్టు వగైరా ఏర్పాట్లు ఈ క్షణమే ప్రారంభిస్తాను. ఒన్ థింగ్ యు మస్ట్ నో. పాకిస్తాన్‌లో ఏం జరిగినా భారతదేశం నుంచి ఎటువంటి సహాయం లభించదు. యు మస్ట్ టేక్ యువర్ ఓన్ రిస్క్ యిన్ పాకిస్తాన్" అని ముగించేరు డైరెక్టర్ శివరామ్.

"ఆల్‌రైట్! ఎప్పుడు బయల్దేరాలి?"

"ఆలస్యం చేస్తే, ఎప్పుడే ప్రమాదం ముంచు కొస్తుందో! మరో రెండు గంటల్లో నీకు కావలసిన ఏర్పాట్లన్నీ చేయబడతాయి. బైదిబై, నువ్వు పాకిస్తాన్ వస్తున్న విషయం మన ఏజంట్ 222 కి తెలియజేస్తాను. అతన్ని కలుసుకుంటే ఆ లేబరేటరీ ఎక్కడున్నదీ, దాని వివరాలూ నీకు క్షుణ్ణంగా తెలిసే అవకాశముంటుంది."

విహారి తలూపేడు.

"పాకిస్తాన్ గూఢచారులు గుంటనక్కలు. పరమ కర్కోటకులు. జాగ్రత్త. ఈ ప్రయత్నంలో అనుకోనిది జరిగితే యు. ఎన్. ఓ. ముందు యిండియా అపరాధిలా నిల్చోవాల్సి వుంటుంది. కనుక నువ్వు ఎట్టి పరిస్థితుల్లోనూ పట్టుబడరాదు. నౌ, యు కెన్ గో"

విహారి ఉత్సాహంగా బయటికి నడిచేడు.

# 2

ఇస్లామాబాద్!

పాకిస్తాన్ రాజధాని!!

ఎయిర్ పోర్ట్‌లో రాజహంసలా వాలింది యిండియన్ బోయింగ్. లాడర్ ఎటాచ్ చేయబడింది. తలుపు తెరవబడ్డాక, ఎయిర్ హోస్టస్ లాడర్ స్టెప్స్ ముందు నిల్చుని దిగిపోయే ప్రయాణీకులకు చిరునవ్వుతో వీడ్కోలు చెప్తోంది.

విహారి బ్రీఫ్‌కేస్ తీసుకుని స్టెప్స్ మీదుగా క్రిందికి దిగి, కస్టమ్స్ ఆఫీసులో అడుగుపెట్టేడు. అది అంతర్జాతీయ విమానం కావడంవల్ల అరగంట పాటు 'సివియర్' చెకింగ్ జరిగింది.

చెకింగ్ పూర్తయ్యేక, బయటికి వచ్చి చుట్టూ చూస్తూ నిలుచున్నాడు. ఏజంట్ 222 అతనికెక్కడా కనిపించ లేదు. ఏమయ్యేడు? ఎందుకు రాలేదు? తను వస్తున్న వార్త అతనికి చేరలేదా? లేక అతనేదైనా ప్రమాదంలో యిరుక్కున్నాడా?

"హల్లో హుస్సేన్‌జీ!" అని పిలిచేరెవరో.

వెనక్కి తిరిగేడు విహారి.

ఎదురుగా పాకిస్తాన్ యింటలిజెన్స్ డిపార్ట్‌మెంట్‌లో ప్రముఖుడు, ఆరితేరిన గూఢచారి అయిన ముబర్దర్ ఖాన్! అదిరిపడ్డాడు, అతన్ని గుర్తు పట్టి!

విహారి గుండె దడదడలాడింది.

ముబర్దర్ ఖాన్ తనను పోల్చుకున్నాడా? ఎలా? తను విహారిగా కాక ముస్లిమ్ వేషంలో వున్నాడు.

పైజామా, షర్వానీ, పిల్లిగడ్డం, తురక వాళ్ళు ధరించే టోపీ, గిల్టుఫ్రేమున్న కళ్ళజోడు, ఫ్రెంచ్‌కట్ మీసాలు-ఈ వేషంలో తననెవరూ గుర్తుపట్టలేరు. మరి తననెందుకు పిలిచినట్టు? మొదటి మెట్టులోనే తను పట్టుబడి పోతున్నాడా? అనేక ప్రశ్నలు కదిలేయి విహారి మస్తిష్కంలో.

తన ఆందోళనను, మస్తిష్కంలో కదులుతున్న ఆలోచనల్ని బయటికి కనిపించనివ్వకుండా 'హల్లో!' అన్నాడు విహారి.

"అయామ్ ముఖద్దర్‌ఖాన్:" అన్నాడతను క్లుప్తంగా 'మీ పేరుతో నాకో ఫ్రెండ్ వుండేవాడు. అందుకే ఎయిర్‌పోర్ట్ ఆఫీస్ లిస్టులో మీ పేరు చూసి మిమ్మల్ని పిలిచేను. ఐయామ్ వెరీ హేపీ టూ సీ యూ' అన్నాడు ముఖద్దర్ ఖాన్ చెయ్యి చాచుతూ.

"అయామ్ ఆల్ సో వెరీ హేపీ టు సీ యూ సర్. ఇక నుండి నేను కూడా మీ స్నేహితుడ్నే-" షేక్ హేండిస్తూ అన్నాడు విహారి.

"మీరు పాకిస్తాన్ రావడం యిదే తొలిసారా?" అనడిగేడు ముఖద్దర్ ఖాన్.

"అవున్సార్? నా పూర్వీకులందరూ ఈ పాకిస్తాన్‌లోనే బ్రతికేరు. వాళ్ళు వున్నటువంటి పాకిస్తాన్ ఎలా వుంటుందో చూడాలని వచ్చేను," అన్నాడు.

"అచ్ఛా! హుస్సేన్‌జీ.....మిమ్మల్నెక్కడో చూసినట్టుంది. మీరిదివరకు పాకిస్తాన్ రాకపోవడం నిజమేనా?"

విహారి గుండె దడదడలాడింది. తనను పోల్చినట్టు నాటక మాడుతున్నాడా?

'లేదు సార్! పాకిస్తాన్ నేనింతకు ముందెప్పుడూ రాలేదు. మనిషిని పోలిన మనుషులుంటారంటారు. మీ విషయంలో అదే జరిగివుంటుంది.'

'ఆల్‌రైట్! సీ యూ ఎగైన్ హుస్సేన్‌జీ?' అని చెప్పి వెళ్ళిపోయేడు ముఖ్దర్‌ఖాన్.

ఎయిర్‌పోర్ట్ బయటికి రాగానే టాక్సీ డ్రైవర్స్ చుట్టుముట్టేశారు విహారిని.

"మంచి హోటల్ ఏది?" అడిగేడు విహారి, ఓ టాక్సీ డ్రైవర్‌ని పాకిస్తాన్ భాషలో.

"గుల్‌బర్గ్!" టక్కున సమాధాన మిచ్చేడతను.

విహారికి 'గుల్‌బర్గ్' గురించి తెలుసు. ఆ మాటకొస్తే పాకిస్తాన్‌లో ఎక్కడేం వుందో విహారికి తెలియని విషయం కాదు. కాని తొలిసారిగా పాకిస్తాన్ చూడ్డానికి వచ్చినట్టుగా వుండాలంటే, తన మీద కన్ను వేసివుంచిన పాకిస్తాన్ ఏజంట్స్‌కి అనుమానం రాకుండా వుండాలంటే ఆ మాత్రం నటించక తప్పదు.

స్తంభం చాటున నిలబడి తనను గమనిస్తున్న ముఖ్దర్ ఖాన్‌ని గమనించేడు విహారి.

"గుల్‌బర్గ్! అయితే, ఆ హోటల్‌కి పద!" విహారి డోర్ తెరిచి, లోపల కూర్చున్నాడు.

టాక్సీ కదిలింది. ఇస్లామాబాద్ వీధులు విశాలంగా వున్నాయి. అక్కడి ప్రజలు, వాతావరణం విచిత్రంగా వుంది. భుట్టో మరణం తర్వాత అక్కడకూడా చిన్న సైజు తిరుగుబాట్లు లేస్తున్నాయి. వాటిని అణచివేయడానికి ప్రభుత్వం మిలటరీని దించి, నలుమూలలా వుంచి తగిన జాగ్రత్తల్ని తీసుకుంటోంది. ఎక్కడేది జరిగినా

వెంటనే కాల్చిపారేయమని ప్రభుత్వ ఉత్తర్వు.

హోటల్ 'గుల్‌బర్గ్' ముందాగింది టాక్సీ.

# 3

"వెల్ మిస్టర్ విహారీ! నువ్వు పాకిస్తాన్ వస్తున్నట్టు శివరామ్‌గారు పంపిన మెసేజ్ అందినది. పాకిస్తాన్ ఏజంట్ల కన్నుగప్పి, ఈ మట్టిమీద అడుగు పెట్టడం మృత్యువుతో పోరాటం వంటిది. అయినా, అది నీకు మంచినీళ్ళ ప్రాయమే! నిన్ను అభినందించక తప్పదు" ప్రశంసాపూర్వకంగా భుజం తడుతూ అన్నారు భారత రాయబారి.

విహారి యిప్పుడు ముస్లిమ్‌వేషంలో లేడు. ఎందుకైనా మంచిదని రిటైర్డ్ మిలటరీ ఆఫీసర్‌గా వేషం మార్చుకున్నాడు. బొద్దుమీసాలు, సిగార్ పైప్, హేండ్ స్టిక్, ఖాకీరంగు యూనిఫారమ్, తలపైనున్న కేప్-పొరపాటున కూడా ఎవరూ పోల్చలేరు.

"మృత్యువుతో పోరాటం అయినా, ప్రాణాలతో చెలగాటమైనా దేశం కోసం రాకతప్పదు కదా?" అన్నాడు విహారి చిరునవ్వుతో.

"అయ్ నో మై బోయ్! నా వలన నీకు కావలసిన సహాయమేమిటి?" అడిగేరు భారత రాయబారి.

"మృత్యుకిరణాలు గురించి విన్నారా?"

"ఏజంట్ 22! రెండు మూడుసార్లు నాతో వాటి గురించి మాట్లాడేడు. కాని వాటి గురించి అతనికి తెలిసినంత బాగా నాకు తెలియదు"

"మృత్యు కిరణాలు లాబరేటరీ ఎక్కడుందో కూడా తెలియదా?"

తల అడ్డంగా వూపేరాయన. "నాకే కాదు. ఏజంట్ 222 కూడా నిర్దిష్టంగా తెలిసినట్టులేదు."

"ఏజంట్ 222 ఎక్కడ? అతనికి నేను వస్తున్న వార్త తెలుసా?"

"తెలియకేం. నువ్వు వస్తున్నట్టు వార్త అందిన రోజునే మా యిద్దరం కలుసుకున్నాం. నీ రాక అతనికి చెప్పేను. చాలా ఆనందపడ్డాడు. నువ్వు రావడానికి పూర్వమే మృత్యుకిరణాలు 'లాబ్' ఎక్కడుందో తెలుసుకుని, ఆ తర్వాత పనిని నీ చేతిలో పెట్టి తను నిశ్చింతగా నిద్రపోతానని బయల్దేరేడు. కానీ, ఆ రోజు తర్వాత అతను మళ్ళీ నన్ను కలియలేదు."

"కారణం ?"

"అతను శత్రువులకు చిక్కిపోయి వుంటాడు! రెండురోజుల కోసారి కలుసుకునే ఒప్పందం మా మధ్య ఉంది. అతను వెళ్ళి రెండ్రోజులు దాటింది. అతనిప్పటికీ రాకపోతే అలాగే అనుకోవాల్సి వస్తుంది."

మై గాడ్! ఏజంట్ 222 శత్రువులకు చిక్కిపోయేడా? పాకిస్తాన్ ఏజంట్ల చేతిలో చిక్కుకోవడమంటే ప్రత్యక్ష నరకమన్నమాట. యిప్పుడెలా? మృత్యు కిరణాల లాబ్ ఎక్కడుందో తెలుసుకోవడమెలా?

"ఏజంట్ 222 ఎక్కడ వుండేవాడు?"

"అతను చేసే ప్రతిపని డైరీలో వ్రాసుకుంటాడు. ఆ డైరీ నా దగ్గరే వుంటుందెప్పుడు. తను తెలుసుకున్న ప్రతి విషయాన్నీ అందులో రాసుకుని, తర్వాత నాకు

డైరీ తిరిగి యిచ్చి వెళ్ళాడు. ఇదే ఆ డైరీ!" జేబు లోంచి తీసి విహారి చేతిలో పెట్టేరు భారత రాయబారి.

విహారి డైరీ అందుకుని, పేజీలు తిరగేసేడు.ఏజంట్ 222-

'మృత్యుకిరణాలు' లాబ్ తెలుసుకోవడాన్ని గురించి అతను చేస్తున్న ప్రయత్నాలన్నీ కోడ్‌లో ఉన్నాయి. కాని అతని ప్రయత్నం ఫలించినట్టు ఎక్కడా లేదు.

"విహారీ! ఎక్కువసేపు మనం మాట్లాడుతూ కూర్చోవడం బాగుండదు. శివరామ్‌గారు నీకివ్వమన్న పాకిస్తాన్ కరెన్సీ యిదిగో. అవసరమైతే మళ్ళీ అడుగు" అని జేబులోంచి కొంత కరెన్సీని అందించేరు.

విహారి జేబులో పెట్టుకున్నాడు. ఏజంట్ 222 గాని మళ్ళీ కలిస్తే తన ఉనికిని తెలియజేసి కలవమని చెప్పమని చెప్పాడాయనతో.

# 4

మధ్యాహ్నం.

టాక్సీలోంచి దిగి, గుల్‌బర్గ్ లోనికి నడిచేడు విహారి

'హాయ్ స్వీటీ!' అంటూ రిసెప్షనిస్టు రాజీని విష్ చేసేడు.

"హుస్సేన్ జీ! ఎలావుంది మా హోటల్? సదుపాయాలన్నీ బాగున్నాయా?" రాజీ పలకరిస్తూ అడిగింది ఫార్మాలిటీగా.

నవ్వుతూ తలూపి, మెట్లు మీదుగా పైకి వెళ్ళసాగేడు విహారి. రూమ్ 'కీ' చైను గిర్రున తిరుగుతూ అతని చూపుడు వేలిని చుట్టుకుంటోంది.

మెరు మెట్లు అంతమయ్యేయి. కారిడార్ మీద నడుస్తూ రూమ్ ముందుకి వచ్చేడు విహారి.

రూమ్ తలుపులు తీసివున్నాయి.

లోపల లైటు వెలుగుతోంది.

తాళం చెవి తన దగ్గరుండగా రూమ్ తలుపెవరు తెరిచేరు? తన అనుమతి లేకుండా అందులో అడుగు పెట్టడానికంత ధైర్యం ఎవరికుంది?

తలుపు తట్టి మెల్లగా లోనికి నెట్టేడు.

శబ్దం లేకుండా తలుపు వెనక్కి వెళ్ళి పోయింది.

మనిషి మాత్రుడెవడూ కనిపించలేదు రూమ్‌లో.

ఆశ్చర్యపోయేడు.

అంతకు ముందు ఆ రూమ్‌లో ఎవరో తిరిగినట్లుగా గుర్తులు కనిపిస్తున్నాయి. బ్రీఫ్‌కేస్ తెరిచి వుంది. అందులోని బట్టలు బయట మంచం మీద పడివున్నాయి. ఒకటి రెండు సిగరెట్ పీకలు మంచం క్రింద చోటు చేసుకున్నాయి. అంటే లోనికి వచ్చిన వాళ్ళు దేనికోసమో వెదికేరన్న మాట. తనను అనుమానించేరా? తనెవరో తెలిసి పోయిందా? బహుశా తనను పట్టిచ్చే వివరాలేవీ వారికి దొరికి వుండవు. ఉంటే తననీ పాటికి పాకిస్తాన్ బలగం చుట్టిముట్టి వుండేది.

లోనికి వెళ్ళి, బాత్ రూమ్ తలుపులు తెరిచి చూసేడు.

బాత్ రూమ్ శూన్యంగా కనిపించింది వెక్కిరిస్తూ.

లోనికొచ్చిందెవరు? పాకిస్తాన్ అధికారులా? దొంగ తనానికెవరేనా లోపల ప్రవేశించేరా?

దొంగ తనానికైతే తన బ్రీఫ్‌కేస్‌లో వున్న విలువైన బట్టలేవీ ఎందుకు తీసుకెళ్ళ లేదు? సందేహం లేదు.

ఎవరో తనను అనుమానించేరు. ఎవరు? ముఖద్దర్ ఖానా!

ఆలోచిస్తుండగానే వెనుక చప్పుడయింది.

గిర్రున తిరిగేడు.

ముఖద్దర్ ఖాన్!

డోర్ దగ్గర విలాసంగా నిలబడి, చిరునవ్వునవ్వుతూ చూస్తున్నాడు.

'హలో హుస్సేన్ జీ! ఏమిటలా వున్నారు?' అనడిగేడు ముఖద్దర్ ఖాన్.

'నా గదిలో ఎవరో దొంగలు పడ్డారు. తాళం చెవులు నా దగ్గరుండగా, వేరొకరు గదిలోనికెలా వచ్చేరో తెలియడంలేదు. రిసెప్షనిస్టు రాజీ ఏం సంజాయిషీయిస్తుందో చూడాలి'

"రాజీకి మాత్రం ఏం తెలుస్తుంది హుస్సేన్ జీ! ఈ రోజుల్లో దొంగ ఎవరో దొర ఎవరో తెలియడంలేదు. కాస్త వేషం మారిస్తే చాలు-"

విహారి గతుక్కుమన్నాడు.

ముఖద్దర్ ఖాన్ తనను గుర్తించేడా?

"పరదేశీయుని రూమ్‌లో యిలాంటి దొంగతనం జరగడం, అనుమతి లేకుండా డూప్లికేట్ 'కీ' తో గదిలో ప్రవేశించడం పాకిస్తాన్ ప్రభుత్వానికే అవమానం. నేను ఈ విషయాన్ని రేపే పాకిస్తాన్ ప్రధానికి తెలియజేస్తాను"

పగలబడి నవ్వేడు ముఖద్దర్ ఖాన్.

అతనెందుకు అంతగా నవ్వుతున్నాడో, తన మాటల్లో అంతగా నవ్వాల్సిందేముందో తెలియలేదు విహారికి ముఖద్దర్ ఖాన్ వేపు విస్మయంగా చూసేడు.

'గుడ్! పులి నేరుగా బోనులోకే వస్తుందంటే ఎవరికి

మాత్రం సంతోషం కాదు. బట్, నాకో చిన్న సందేహం. మీరు మా ప్రధానిని కలుసుకునేది అన్వర్ హుస్సేన్ గానా? యిండియన్ ఏజంట్ విహారి గానా?"

అదిరి పడ్డాడు విహారి.

ముఖద్దర్ ఖాన్‌కి యీ రహస్యం ఎలా తెలిసింది? తను పాకిస్తాన్ బయల్దేరిన విషయం డైరెక్టర్ శివరామ్ గారికి తప్ప వేరొకరికి తెలియదు. అంత రహస్యంగా ఏర్పాట్లు జరిగినా, తన గురించి తెలుసుకున్నారంటే ఏదో జరిగి వుండాలి.

'ఎలా తెలిసిందని బుర్ర బద్దలు కొట్టుకుంటున్నావా విహారీ?' అదేదో పెద్ద జోకులా పెళ్లున నవ్వేడు మళ్లీ।

"పాకిస్తాన్ ఏజంట్లు చచ్చుదద్దమ్మలు కారు. దేశంలో ఎక్కడ, ఏది జరిగినా వెంటనే తెలుసుకుని వార్తలు పంపిస్తూ వుంటారు. ఇండియాలో వున్న మా ఏజంట్లు ఢిల్లీలో నువ్వు బయల్దేరినవెంటనే సమాచారాన్ని అందించేరు. అయితే, నువ్వు దిగిన ఫ్లైట్‌లో నుండి నీలాగే ముస్లిం వేషంలో ముగ్గురు దిగేరు. ఆ ముగ్గురులో ఎవరు "విహారి'' అన్నది తేల్చడం నాకు కూడ కష్టమై పోయింది. మా ఏజంట్లు ముగ్గురినీ ఫాలో అయ్యేరు. ఆఖరికి ఈరోజు నువ్వు భారత రాయబారిని కలుసుకోవడంతో 'నువ్వే యిండియన్ స్పై' అని తేలిపోయింది" ముఖద్దర్ ఖాన్ కేప్ సర్దుకుని, జేబులోంచి చటుక్కున రివాల్వర్ తీసి పట్టుకున్నాడు.

అప్పుడే లోపలికి వచ్చిన నలుగురు పోలీసులు కూడా తనకేసి తుపాకులు గురిపెట్టి నిలుచున్నారు.

విహారి గుండె దడదడ లాడింది.

అప్పుడే తను పట్టుబడి పోతున్నాడా ? శత్రువుల చేతికి చిక్కిపోయినట్టేనా ? పాకిస్తాన్‌కి చిక్కితే తన శవం కూడా యండియా చేరదు.

మెరుపులా దూకి పారిపోవాలనుకున్నాడు. కానీ, విహారి ఆలోచనలు ముఖద్దర్ ఖాన్ చదివినట్లుగా వుంది.

'ఠైరో !' దిక్కులు పిక్కటిల్లేలా అరిచేడు. ఇక సహించలేక పోయేడు విహారి. సాహసిస్తే ఒళ్ళు తూట్లు పడక తప్పదని తెలుసతనికి.

'పారిపోవాలని ప్రయత్నించకు. నీ ప్రాణాలు తీయడం మాకు పెద్ద సమస్య కాదు. కానీ, నిన్ను యు. ఎన్. ఓ. ముందు హాజరు పరచి....'

"హరికధలు చెప్పకు ముఖద్దర్ ఖాన్. నీ పనికానియ్!'

శత్రువు మృత్యువులా ఎదుట నిలబడివున్నా చెక్కుచెదరని గుండెనిబ్బరంతో మాట్లాడుతున్న విహారిని చూస్తుంటే ముఖద్దర్ ఖాన్‌కి ఒళ్ళు మండుకొస్తోంది.

పోలీసులకు సైగచేసేడు ముఖద్దర్ ఖాన్. ముగ్గురు పోలీసులు విహారిని చుట్టుముట్టి సంకెళ్ళువేసి జీపెక్కించేరు.

# 5

ఎత్తయిన ఘాటీ!

కొండ చుట్టూ తిరుగుతూ కిందకు దిగుతోంది పోలీస్ జీప్. జీప్‌లో డ్రైవరు ప్రక్కన ముఖద్దర్ ఖాన్ కూర్చు న్నాడు. కానిస్టేబుల్స్ విహారికి రెండు ప్రక్కలా సర్దుకున్నారు.

టైమ్ ఆరు గంటలయింది. శీతాకాలం కావడంవలన తొందరగానే చీకటిపడింది.

కొండమీదునుంచి విద్యుద్దీపాల వెలుగుతో సుంద రంగా కపిపిస్తోంది ఇస్లామాబాద్ నగరం. చెట్లు చిన్నవిగా మనుషులు చీమల్లా కపిపిస్తున్నారు. వాహనాలు అగ్గి పెట్టెల్లా కదులుతున్నాయి.

విహారి ఆలోచనలో పడ్డాడు.

ముఖద్దర్ ఖాన్ తనను చంపాలనుకోవడం లేదు. అతని ఆలోచనేమిటో అంతుపట్టడం లేదు. తనను యు. ఎన్. ఓ. ముందు ఏదో నేరంమోపి నిలబెట్టడాని కేనా? లేక ఇంకేదైనా ప్రయోజనాన్ని ఆశించి చేస్తు న్నాడా? పై అధికారుల నుంచి అనుమతిలేదా?

సి బి.ఐ. డైరక్టర్ శివరామ్‌మాటలు గుర్తుకొచ్చాయి విహారికి.

యస్! తను పట్టుబడ కూడదు. ఎలాగైనా తప్పించు కోవాలి. కాని ప్రాణాలతో పట్టుబడ కూడదు. తనను ఆసరాగా తీసుకుని, తన దేశంమీద దుమ్మెత్తి పోయా లని వీరుచేస్తున్న కుట్ర కొనసాగడానికి వీల్లేదు.

కాని, తప్పించుకోవడం ఎలా?

తనకు రెండు ప్రక్కలా కూర్చున్న కానిస్టేబుల్స్ అప్రమత్తతతో మెలగుతున్నారు. చిన్నశబ్దం అయినా చటుక్కున పసిగడుతున్నారు. దానికితోడు తనప్రత్యర్థి ముఖద్దర్ ఖాన్ ముందున వుండనే వున్నాడు. అతన్ని మోసగించి తప్పించుకోవడం చిన్నవిషయంకాదు.

జీప్ మలుపు తిరుగుతున్నప్పుడు దూకితే!

గుండె జల్లుమంది విహారికి, ఆ ఆలోచన రాగానే. పొరపాటున రోడ్డు అంచుకు జారితే పోల్చుకోడానికి ఎముకలు కూడా మిగలవు. ఎలా? పోనీ, ఘాటీ పూర్త య్యేక దూకాలనుకుంటే జనసంచారం వున్నచోట అసలే వీలుపడదు.

ఏదో చేసేయాలి! తప్పించుకుని తీరాలి!!

జీప్ టాప్ వేపు చూసేడు. ఆ జీప్‌కి టాప్ లేదు.

తప్పించుకునే మార్గం కోసం ఆలోచించేడు. బూటు అడుగున దాచిన మినీ గ్యాస్ బాంబు గుర్తుకొచ్చింది.

చేతులు కదిపితే అనుమానిస్తారేమో!

కాలు మీద కాలు వేసుకుని బూటు అడుగున వున్న డిప్ప మీద 'లయ' వేస్తున్నట్లుగా శబ్దం చేయసాగేడు. కానిస్టేబుల్స్ ఓమారు చూసి దృష్టి మార్చు కున్నారు. అదే అవకాశాన్ని ఉపయోగించుకున్నాడు విహారి

ఒక వేపు శబ్దం చేస్తునే మినీగ్యాస్ బాంబు బయటకి తీసి చటుక్కున పళ్ళతో బిడిపెను బయటకు లాగి, ఊపిరి బిగించేడు విహారి.

గ్యాస్‌బాంబు తన పని కానిచ్చింది.

జీప్‌నిండా గ్యాస్ అలుముకుంది.

"వాటీజ్ దిస్?" అంటూ వెనక్కి తిరగ బోయిన ముఖద్దర్ ఖాన్‌కి స్పృహతప్పింది.

అందరు స్పృహ తప్పి పోతుండగా, విహారి జీప్‌లో నుంచి క్రిందకి దూకేడు. కాని డ్రైవర్ చేత నుండి స్టీరింగ్ కంట్రోల్ తప్పి పోవడం వలన, జీప్ అటు యిటూ, ఊగుతున్న సమయంలో విహారి దూకడంతో రోడ్డు మీదకు దూకాలన్న అతని అంచనా తప్పింది.

రోడ్డు మీద దొర్లాల్సిన శరీరం గాలిలో తేలుతూ లోయ లోకి జారిపోయింది.

జీప్ కొంచెం ముందుకు వెళ్ళి, మలుపులో కొండకు ఢీకొని ఆగిపోయింది.

# 6

కళ్ళు తెరిచేడు విహారి.

అటు యిటూ చూసేడు. తనిప్పుడు ఎక్కడున్నది గుర్తుకు రాలేదు. కాని క్షణాల తర్వాత జ్ఞాపకం వచ్చింది తను కొండమీద నుంచి లోయలోకి జారిపోవడం.

అది గుర్తు రాగానే ఒళ్లు ఝల్లుమంది. అంత ఎత్తు నుంచి పడినా తనింకా బ్రతికి వున్నాడంటే ఆశ్చర్యమే. ఎవరు తననిక్కడకు తీసుకువచ్చేరు ?

ముజుద్దర్ ఖాన్ తనను బంధించి, జీప్‌లో తీసుకు రావడం... మిసీగ్యాస్ బాంబు తీయడం.... జీప్‌లో నుంచి దూకడం.... అన్నీ ఒకొక్కటీ గుర్తుకొస్తు న్నాయి విహారికి.

మంచం మీద నుంచి లేవబోయేడు. కాని కాళ్లూ, చేతులు అతనికి సహకరించలేదు. తలకు బాండేజ్ వుంది. కాళ్ళకు చేతులకూ వుంది. అంటే బలమైన గాయాలు తగిలి వుండాలి. తనను ఎవరు కాపాడేరు? ఎవరు చికిత్స చేసేరు ? అసలెవరూ కనిపించరేం ?

అడుగుల చప్పుడు వినిపించింది.

తలతిప్పి చూసేడు విహారి.

ఓ యువకుడు నిలబడి వున్నాడు

'హమ్మయ్య ! ఇప్పటికి స్పృహ వచ్చిందన్నమాట

మీకు' అన్నాడతను లోనికొస్తూ.

అతను దృఢంగా వున్నాడు. పంచె, లాల్చీ ధరించేడు. లాల్చీపైన చేతులులేని ఉన్నికోటు వేసుకున్నాడు. వయసు ముప్పై దాటుతుంది.

విహారి అతని వేపు చూసి 'మీ రెవరు? నేనిక్కడికెలా వచ్చేను' అనడిగేడు.

'భయపడకండి. నేను మీకు మిత్రుడ్నే!' అని చెప్పేడతను.

విహారికి అంతా అయోమయంగా వుంది. అతనెవరో, అంత ఎత్తునుంచి దూకిన తనెలా బ్రతికాడో ఏమీ అర్ధంగావడంలేదు. చేతులు చూసుకున్నాడు. సంకెళ్ళులేవు.

'నా చేతికున్న సంకెళ్ళు....'

'ఆ సంకెళ్ళే మీ ప్రాణాలు కాపాడేయి'

అదిరి పడిపోయేడు విహారి. 'సంకెళ్లు నా ప్రాణాలు కాపాడేయా? అదెలా?'

'నూటికి నూరుపాళ్లూ నిజం. నేను మూలికల ద్వారా ఔషధాలు తయారు చేస్తుంటాను. నా పేరు రహమత్ ఖాన్. రెండ్రోజుల క్రితం మూలికలను ఘాటీల్లో అన్వేషిస్తుంటే రాళ్ళమీద నుండి జరజర జారుతున్న చప్పుడు వినబడి పైకి చూసేను. ఓ మానవ దేహం పైనుండి దొర్లుతూ వచ్చి ఓ చెట్టుమీద బడింది. సంకెళ్లు చెట్టు కొమ్మల్లో చిక్కుబడి పోయినందువల్ల అక్కడితో దొర్లడం ఆగిపోయింది. నేను పరిగెత్తి కెళ్ళి మిమ్మల్ని అతికష్టం మీద నేల మీదకు దించి, యింటికి తీసుకు వచ్చేను. మీకు బలమైన గాయాలు తగలడంవల్ల రెండ్రోజులున్నండీ స్పృహ లేదు" చెప్పాడతను.

'మీకు నా కృతజ్ఞతలు ఎలా తెలియ జేయాలో తెలియడంలేదు. దయ, జాలి లేనిదో మానవజాతే అంత రిస్తుంది. పాకిస్తాన్ ప్రజలలో దయ, జాలి అనేవి ఉంట వనుకున్నాను. మీ మేలు ఎన్నటికీ మరువలేను,' విహారి పొగిడేడు.

'ఎక్కువ పొగడకండి తోటి మానవుడు కష్టాల్లో వుంటే ఆదుకోవడం గొప్ప విషయంకాదు. నా ధర్మం నిర్వర్తించినందుకు నాకెంతో సంతోషంగా వుంది. మీ రెవరు ?' అడిగేడతను.

'నేను భారతీయుణ్ణి'

'ఎందుకీ దేశం వచ్చేరు ?"

విహారి సందేహించేడు.

'చెప్పండి. పర్వాలేదు. నేను పాకిస్తాన్ మనిషయినా నా పూర్వీకులు ఇండియాలోనే పెరిగేరు. వలస వచ్చిన వారి సంతతివి నేను. నాలోనూ మీ దేశం రక్తం ప్రవహిస్తోంది. చేతనయితే మీకు సహాయం చేస్తాను' అని చెప్పాడతను.

'నేను యిండియన్ సి. బి. ఐ. ఏజంట్. నా పేరు విహారి' చెప్పేడు.

విహారి వూహించినట్టు అతను ఆశ్చర్యపోలేదు "మీరు ఎందుకు ప్రమాదంలో చిక్కుకున్నారు?"

విహారి అంతా చెప్పాడు.

# 7

విహారికి గాయాలు తగ్గుముఖం పట్టేయి. లేచి నిలబడ గలుగుతున్నాడు. కాని, కాస్త నీరసంగా వున్నాడు.

అతను వెళ్ళిపోతానన్నా, రహమత్‌ఖాన్ ఒప్పుకోలేదు.

"ఒంట్లో ఎలా వుంది భాయ్ ?" కాఫీ అందిస్తూ అన్నాడు రహమత్‌ఖాన్.

"బాగానేవుంది. కానీ ప్రశాంతంగా సాగుతున్న నీ బ్రతుకులో అల్లకల్లోలాన్ని సృష్టిస్తానేమో అని అనుమానంగా వుంది. ప్రత్యర్థులు అఖండమైన తెలివి గల వాళ్ళు. లోయలో నాశవం కనబడక పోవడంతో, వాళ్ళు తప్పకుండా నేను బ్రతికివున్నట్టు తెలుసుకుంటారు. ఏదో విధంగా వాళ్ళు తెలుసుకుని ఇక్కడికి వస్తే నా వలన నువ్వు చాలా కష్టాలకు గురికావలసి వుంటుంది. అందుకే నేను ఈ రోజు వెళ్ళిపో దలచుకున్నాను.' అన్నాడు విహారి.

'పూర్తి స్వస్థత చేకూరకముందు ఎక్కడికి వెళ్ళగలవు ? నీకా భయం అక్కర్లేదు. నువ్వు యిక్కడున్న సంగతి ఎవరూ తెలుసుకోలేరు.' ధైర్యం చెబుతూ అన్నాడు రహమత్‌ఖాన్.

విహారి కాఫీ త్రాగి, సిగరెట్ వెలిగించేడు.

అంతవరకూ ప్రశాంతంగా వున్నవీధి కోలాహలంగా మారింది.

"ప్రతి ఇంటినీ సోదా చేయండి. అనుమానం తగిలితే కాల్చిపారేయండి." ఉరుములాంటి గొంతు వినిపించింది రహమత్‌ఖాన్‌కి.

విహారికి ఆ గొంతు వినగానే గుండె దడదడలాడింది. ఆ గొంతును గుర్తుపట్టలేని అమాయకుడు కాదు విహారి. అది పాకిస్తాన్ యింటలిజన్స్ ఏజంట్ ముజఫర్‌ఖాన్ గొంతు !

రహమత్ ఖాన్ కిటికీతలుపు తెరిచి బయటకి చూసి, మళ్ళీ వెంటనే తలుపు మూసి పరిగెత్తుకొచ్చేడు.

'బాప్ రే! పదిమంది సోల్జర్స్!! వాళ్ళతో పాటు ఓ ఆఫీసరు వున్నాడు. వాళ్ళు నీ గురించే వచ్చేరేమో?' అన్నాడు రహమత్ ఖాన్.

అవునన్నట్లు తలూపేడు.

"ఇప్పుడేం చేద్దాం?'

"వెనుక వేపు నుండి పారిపోతాను. నాకేం ప్రమాదం లేదు. నువ్వు జాగ్రత్త!"

'నై! సోల్జర్స్ అన్ని వేపులా వున్నారు. ఏ మూల ఎవరి కంట బడినా కుక్కను కాల్చినట్టు కాల్చి పారేస్తారు," అంటుండగానే బయటి నుండి ముఖద్దర్ ఖాన్ గొంతు వినిపించింది.

"దర్వాజ్ ఖోలో!"

రహమత్ ఖాన్ కి చెమటలు పట్టేయి. విహారి లేచి నిలబడ్డాడు. వెంటనే విహారిని ప్రక్కగదిలోకి తీసికెళ్ళేడు. నేల మీద చెక్కబల్లలాటిది వుంది. దాన్ని పైకి తీసేడు. "భాయ్! నేను పిలిచే వరకూ యిక్కడ దాక్కో!" అన్నాడు.

విహారి సరేనన్నాడు.

రహమత్ ఖాన్ బల్లను మూసేసి, బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటునట్టు, ఆవలింతలిస్తున్నట్లు నటిస్తూ వెళ్ళి తలుపు తీసేడు.

ముఖద్దర్ ఖాన్, మరో యిద్దరూ సోల్జర్స్ యింట్లో ప్రవేశించారు.

ముఖద్దర్ ఖాన్ నీ, సోల్జర్స్ ని, చూసి షాక్ తిన్నట్లుగా

నటించేడు రహమత్ ఖాన్.

"యిండియన్ ఏజంట్ పాకిస్తాన్‌లో అడుగు పెట్టేడు. మాకందిన సమాచారం ప్రకారం అతనీ ప్రాంతాల్లోనే ఎక్కడో వున్నాడు. మీ యిల్లు సోదాచేయాలి," అన్నాడు ముఖద్దర్ ఖాన్.

రహమత్ ఖాన్ అడ్డు తొలగి దారి యిచ్చాడు. ముఖద్దర్ ఖాన్ లోనికి నడిచేడు. సోల్జర్స్ లోపల వెదుకుతున్నారు.

విహారివున్న గదిలో మంచం దగ్గర ఆగేడు ముఖద్దర్ ఖాన్. దుప్పటి నలిగివుంది. అంతవరకూ దానిమీద ఎవరో పడుకున్న ఛాయలు కనిపిస్తున్నాయి.

"దీని పైన పడుకున్నదెవరు?"

'నేనే!' జంకకుండ సమాధాన మిచ్చేడు రహమత్ ఖాన్. వచ్చిన ఆఫీసర్ ఆవులిస్తే పేగులు లెక్క పెట్టే రకమని అప్పుడే గ్రహించేడు.

ముఖద్దర్ ఖాన్ తల పంకించేడు. విహారి కాల్చి పడేసిన సిగరెట్టు పీకలు ముఖద్దర్ ఖాన్ దృష్టిలో పడ్డాయి.

అతని చూపుల్లోని భావం గ్రహించేడు రహమత్ ఖాన్.

వెంటనే టీపాయ్ మీదున్న సిగరెట్ పాకెట్, అగ్గిపెట్టె తీసి, ఓ సిగరెట్ వెలిగించుకున్నాడు.

ముఖద్దర్ ఖాన్ మరే ప్రశ్నలూ వేయలేదు.

"యిండియన్ ఏజంట్ ఒకవేళ యిక్కడికి వస్తే తెలియజేయండి. లేకపోతే మీరు ప్రమాదంలో పడతారు," హెచ్చరించి తిరుగుమొహం పట్టేడు. సోల్జర్స్ అతన్ని అనుసరించేరు.

మరో పదినిమిషాల తర్వాత, ఆ వీధిలో నుండి ముఖ

ద్దర్ ఖాన్ జీపు కదిలింది. తృప్తిగా వూపిరి విడిచి, గబగబ
విహారిని దాచిన సొరంగం దగ్గరికి నడిచేడు.

చెక్కబల్ల తీసి "రా, భాయ్!" అని పిలిచేడు.

విహారి బయటికి వచ్చేడు. జరిగిందంతా చెప్పేడు
రహమత్ ఖాన్.

"వెల్ మిస్టర్ విహారీ! సొరంగంలో దాచిపెట్టేడా నిన్ను?"
అన్న ముఖద్దర్ ఖాన్ మాటలు వినిపించి చివ్వున తలెత్తి
చూసేరిద్దరూ.

తలుపువగ్గర విలాసంగా నిలబడి రివాల్వర్ చేతిలో
వూపుతూ, చిరునవ్వు నవ్వుతూ చూస్తున్నాడు ముఖద్దర్
ఖాన్. అతని వెనుక ఇద్దరు సోల్జర్స్.

రహమత్ ఖాన్ నోట మాట రాలేదు.

విహారి మొహంలో రంగులు మారేయి.

"ఒకేచోట పడివున్న నాలుగైదు సిగరెట్ పీకలను
బట్టి, నలిగివున్న దుప్పటిమీద తలగడ ప్రాంతంలోవున్న
రక్తపు మరకను బట్టి, యీ యింట్లో ఇంకెవరో వ్యక్తి
వుంటున్నాడని వూహించేను. రహమత్ ఖాన్ నుదిటి మీద
గాయంలేదు కాబట్టి ఆ మంచం పడుకునేది అతనుకాదని
నిర్ధారణ అయింది. అందుకే వెళ్ళినట్టేవెళ్ళి తిరిగొచ్చేను..."

రహమత్ ఖాన్ కి ముచ్చెమటలు పోస్తున్నాయి.

'మిస్టర్ రహమత్ ఖాన్! యిండియా నుంచి వచ్చిన
సి.బి.ఐ. ఏజంట్ ఉనికిని గురించి తెలిసీ ప్రభుత్వానికి
తెలియజేయక పోవడం ఒక నేరమైతే అధికారులు వెర్రి
వేసినపుడు అతన్ని రహస్యంగా దాచిపెట్టడం రెండవ
నేరం. ఇవి క్షమించరాని నేరాలు. నీకు శిక్ష తప్పదు,"
అంటూ రహమత్ ఖాన్ గుండెకి గురిపెట్టి కాల్చేడు.

'ఢాం! ఢాం!!' మని పేలింది ముఖద్దర్ ఖాన్ చేతి లోని రివాల్వర్.

రహమత్ ఖాన్ కెవ్వుమని అరుస్తూ విరుచుకు పడి పోయేడు. కొంతసేపు కాళ్లూ, చేతులు గిలగిల కొట్టుకుని ప్రాణాలు విడిచేడు.

తనవలన ప్రాణాలు పోగొట్టుకున్న రహమత్ ఖాన్ శవంవేపు జాలిగా చూసేడు విహారి. ఆవేశం ముంచు కొస్తున్నా, తప్పించుకునే దారి కనిపించడంలేదు విహారికి.

"విహారీ! తప్పించుకునే ప్రయత్నంచేసి, అనవస రంగా ప్రాణాలు పోగొట్టుకోవద్దు. ఈ యింటికి చుట్టూ సోల్జర్స్ వున్నారు"- అని సంకెళ్లు వేయనున్నట్టు సైని కులకు సైగజేసేడు. ఇద్దరు సోల్జర్స్ గబగబ ముందుకు వచ్చి విహారి చేతులకు సంకెళ్ళు వేసేరు.

'విహారీ! బయటికి నడు. ప్లీజ్, డోంట్ ప్లే ఎనీ ట్రిక్స్!"

విహారి బయటికి నడిచేడు. సోల్జర్స్ అతని వెంట ఎలర్ట్‌గా కదిలారు. రోడ్డుమీద అడుగు పెడుతుండగా విహారి నెత్తిమీద పడింది బలమైన దెబ్బ! కళ్ళముందు చీకటి తెరలు దిగుతుండగా చూసేడు విహారి. ముఖద్దర్ ఖాన్ చేతిలోని యినపరాడ్!

రహమత్ ఖాన్ యింటి చుట్టూ వున్న సోల్జర్స్ పరి గెట్టుకొచ్చి, విహారిని ఎత్తి జీపులో పడేసేరు. ముఖద్దర్ ఖాన్ ఫ్రెంట్ సీట్‌లో కూలబడ్డాడు.

జీప్ కదిలింది.

# 8

విహారి కళ్లు తెరిచేడు. నేల మీద అచేతనంగా పడి వున్నాడు. చుట్టూ చూసేడు. ఓమాదిరి వెలుతురు! గదిలో ఒకే ద్వారం వుంది. దాని తలుపులు బంధించబడ్డాయి.

రహమత్ ఖాన్‌ని కాల్చి చంపడం - తన నెత్తిమీద బరువుగా ఏదో పడడం - తనకు స్పృహ తప్పడం - ఒక్కొక్కటీ గుర్తు రాసాగింది విహారికి.

"మిస్టర్ ఏజంట్ 222 నువ్వు మా దేశంలో తెలుసుకున్న విషయాలేమిటి? ఇండియన్ ఏజంట్స్ మా దేశంలో ఎంతమంది ఉన్నారు ఇంకా?'

ప్రక్క గదిలోంచి వినిపిస్తున్నాయా మాటలు. అది ముఖద్దర్ ఖాన్ గొంతు.

ఏజంట్ 222! భారత రాయబారి, తనూ ఊహించినట్లు ఏజంట్ 222ని శత్రువులు బంధించేరా!

ఏజంట్ 222 జవాబు చెప్పలేదేమో, అతని గొంతు వినిపించలేదు.

'మిస్టర్ 222! ఈ రోజు సాయంత్రం వరకు వైట్ చేస్తున్నాను. నేనడిగిన ప్రశ్నలకు సమాధానాలు రాకపోతే, నిన్నూ మీ సి.బి.ఐ. ఏజంట్ విహారిని కాల్చిచంపి, యు.ఎన్.ఓ. ముందు నిలబెట్టడం ఖాయమన్నది తెలుసుకో!'

ఆ తర్వాత గది తలుపులు మూసిన చప్పుడు, నలుగురైదుగురు నడిచి వస్తున్న చప్పుడు వినిపించేయి.

నడిచివస్తున్న చప్పుడు క్రమంగా దగ్గరౌతోంది.

తలుపులదగ్గర ఆ శబ్దం ఆగిపోయింది.

మరుక్షణం తలుపులు తెరుచు కుంటున్నట్లు కిర్రు మని చప్పుడైంది.

విహారి చటుక్కున కళ్ళుమూసుకుని పడుకున్నాడు.

తలుపులు తెరుచు కున్నాయ్. గదిలోకి వెలుగు వచ్చింది.

ముఖద్దర్ ఖాన్, అతని వెంట మరో నలుగురు సోల్జర్స్ గదిలో ప్రవేశించేరు. విహారి ఊపిరి బిగపట్టి పడుకుని వున్నాడు.

'విహారి! ఇక నువ్వు కళ్ళు తెరవ్వచ్చు. నీకింకా స్పృహ రాదనుకునేంత ఫూల్ని కాను' అన్నాడు ముఖద్దర్ ఖాన్.

విహారి గతుక్కుమని కళ్ళు తెరిచేడు.

అందరి చేతుల్లోనూ రివాల్వర్స్ వున్నాయి. అవి విహారి కేసి గురిపెట్టబడి వున్నాయి. ముఖద్దర్ ఖాన్, సోల్జర్స్ విహారి ముందుకు వచ్చేరు వరుసగా నిలబడ్డారు.

"విహారీ మర్యాదగా అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పు. లేకపోతే నీ చేత ఎలా చెప్పించాలో నాకు బాగా తెలుసు. మొండి కేసే మనషుల చేత చెప్పించే రాక్షస పద్ధతులెన్నో మా దేశం నేర్పింది మాకు. అవసరమైతే వాటిని ప్రయోగించయినా సరే నీచేత చెప్పిస్తాను," అన్నాడు ముఖద్దర్ ఖాన్.

విహారి పడుకుని లేవలేదు. "ముఖద్దర్ ఖాన్! మీ దేశం మీకు హింసించడం మాత్రం నేర్పింది. కాని మా దేశం మాకు హింసల్ని భరించడం కూడా నేర్పింది. నువ్వెన్ని విధాల ప్రయత్నించినా మా చేత ఏమీ చెప్పించ లేవు. నీ అహంకారాన్ని విడిచిపెట్టు."

'నువ్వు చెప్పక పోయినంత మాత్రాన తెల్సుకోలేము అనుకోకు. మీరిద్దరు పాకిస్తాన్ ఎందుకు వచ్చారో తెలిసి పోయింది. ఎన్నివేల మంది వచ్చినా మా "మృత్యు కిరణాలు'' లాటివి ఏమీ చేయలేరు. మా ప్రశ్నలకు సమాధానాలు చెప్పక పోయినంత మాత్రాన నష్టం లేదు. మీతో పని పూర్తయింది. సాయంకాలం వరకూ ఆగడం అనవసరం. ఇప్పుడే మిమ్మల్ని పైకి పంపేస్తే సరి!' అనంటూ విహారి గుండెలకు గురిపెట్టేడు ముఖద్దర్ ఖాన్. మిగిలిన సోల్జర్స్ అదే పని చేసేరు.

విహారి గుండె దడదడ లాడింది. నోటిలో తడారి పోయింది. ఒళ్ళంతా కంపిస్తోంది.

ఒక్క పొర్లింపు పొర్లేడు. ఆ పొర్లింపులో అనూహ్యమైన బలముంది. పొర్లగానే రివాల్వర్ గన్స్ మెరిగేయి. గుళ్ళు నేలను చిల్లు పెట్టేయి. దొర్లుతూనే విహారి ఇంకా బలాన్ని కూడ గట్టుకుని వరుసగా నిలబడ్డ ప్రత్యర్థుల కాళ్ళను భయంకరంగా ఢీకొట్టు కున్నాడు.

రోడ్ రోలర్ కుమ్మిన్నట్లయింది. నలుగురూ తూలి పడ్డారు. ఆ అదును చాలు. ప్రత్యర్థులు రివాల్వర్స్ పేల్చే అవకాశమీయకుండా స్ప్రింగ్‌లా లేచాడు. లేచినదే తడవు వారి చేతుల్లోని ఆయుధాలని ఎగరకొట్టేశాడు. ముఖద్దర్ ఖాన్ మొహంలో రంగులు మారిపోతున్నాయి. ఏం జరుగుతుందో అర్థం గాకముందే విహారి అతని మీదకు దూకేడు.

ముఖద్దర్ ఖాన్ వెనుకంజ వేయలేదు. చటుక్కున లేచి విహారిని ఎదుర్కొన్నాడు.

పిడికిలిబిగించి ముఖ్దర్‌ఖాన్ డొక్కలో పొడిచేడు విహారి.

ముఖ్దర్‌ఖాన్ ప్రేపులు తెగినంత బాధ కలిగింది. అతని మొహంలో బాధ స్పష్టంగా కనిపించింది విహారికి.

అంతలో సోల్జర్స్ తేరుకుని విహారిమీదకు దూకేరు.

నలుగురిని ఒకేసారి ఎదుర్కోవడం సామాన్యం కాదు. నలుగురూ దృఢమైన వాళ్ళు. కండలు తిరిగిన శరీరాలు. తనకింకా పూర్తిగా ఆరోగ్యం చిక్కలేదు. నీరసం ముంచుకొస్తోంది.

ఇక లాభం లేదనుకుని, ఆవేశంగా పిడికిలి బిగించి గడ్డంక్రింద ఒక్కటిచ్చేడొక సోల్జర్‌కి. కెవ్వుమని అరుస్తూ వెల్లకిలా పడిపోయేడు.

మరొకడి పొట్టలో గుద్దేడు. దాంతో ఉండచుట్టుకు పోయేడు. రెట్టించిన కోపోద్రేకంతో తన మీదకొస్తున్న ముఖద్దర్‌ఖాన్ మొహంమీద అరచేత్తో చరిచేడు బలంగా। ముఖద్దర్‌ఖాన్ తల గోడకు గుద్దుకుని తల చిట్లి రక్తం కారసాగింది. మరుక్షణంలోనే అతనికి స్పృహ తప్పింది.

ఓ సోల్జర్‌ని రెండుచేతులతో పైకెత్తి అప్పుడే లేవ బోతున్న ఇద్దరి సోల్జర్స్ మీదకి విసిరేసేడు. ముగ్గురుకీ నడుములు విరిగినంత పనయింది. చకచక ముగ్గురి మెడ నరాలమీద దెబ్బతీసి స్పృహ తప్పించేడు.

తర్వాత గదిలో నుండి బయటకు పరిగెత్తి తలుపు మూసి గొళ్ళెం పెట్టేసేడు. ఏజంట్ 222 ని బంధించిన గదికేసి పరిగెత్తేడు

ఇనపచువ్వల తలుపులు బలంగా వున్నాయి. లాక్ ఎక్కడుందో కనిపించడం లేదు. భుజాలతో ఢీ కొడితే

విరిగే తలుపుల్లా లేవు.

'మిస్టర్ ఏజంట్ 222 ! నా పేరు విహారి. ఇండియా నుండి వచ్చేను' అన్నాడు తలుపుల ముందు నిలబడి.

ఏజంట్ 222 కళ్ళు ఆనందంతో మెరిసేయి.

అతను విహారి దగ్గరకు పరిగెత్తుకొచ్చాడు.

'మిమ్మల్ని విడిపించాలనివుంది. కానీ....'

'ఇవి ఆటోమేటిక్ డోర్స్. నా అనుమానం ప్రకారం ఎక్కడో స్విచ్ వుంటుంది. ప్రయత్నిస్తే...." అప్పుడే విహారి కళ్ళు అన్ని గోడలూ వెదికేస్తున్నాయి గోడపైన ఓ ఇనుపరేకు తగిలుంది. ఆ రేకును పైకెత్తి చూసేడు ఏజంట్ 222 పూహ తరక్టు, స్విచ్‌వుంది.

విహారి స్విచ్ నొక్కేడు. ఏజంట్ 222 వున్న గది తలుపుపైకి వెళ్ళిపోయింది. ఏజంట్ 222 బయటికొచ్చేడు ఉత్సాహంగా!

"బ్రదర్! నువ్వెలా పట్టుబడ్డావ్ వీళ్ళకి?" అడిగాడు విహారి.

'మీరు పాకిస్తాన్ వస్తున్నవార్త విని చాలా సంతోషించేను. మీరు వచ్చేలోపలే మృత్యుకిరణాలు' లాబ్ గురించి పూర్తి వివరాలు సేకరించి మీకివ్వాలని నిర్ణయించుకున్నాను. వెంటనే రంగంలోనికి దిగేను. మృత్యుకిరణాల లేబరేటరీ ఎక్కడుంటుందో తెలుసుకోగలిగాను.'

'ఎక్కడ?'

"కారకోరమ్ హైవే మీకు తెలిసేవుంటుంది. ఆ హైవే మీద అఫ్ఘనిస్తాన్ సరిహద్దుకు ఏభై కిలోమీటర్ల దూరంలో అడవుల మధ్య వుంది లేబరేటరీ దానిచుట్టూ ఎత్తైన

బౌండ్రీ. లోపల ప్రవేశించాలని నేను చేసిన ప్రయత్నం ఫలించలేదు. బౌండ్రీలో అడుగు పెట్టిన మరుక్షణం సోల్జర్స్ తుపాకులతో సహా ప్రత్యక్షమయ్యేరు. మరి కొన్ని నిమిషాలకు ముఖద్దర్ ఖాన్ రావడం, నన్నిక్కడ బంధింపడం జరిగింది," అని చెప్పేడు ఏజంట్ 222.

'బౌండ్రీ దాటి లోనికెవరు అడుగు పెట్టినా, వాళ్ళ రూపం లోపల స్క్రీన్ మీద కనిపించే ఏర్పాటు చేసి వుంటారు. అందుకే నిన్ను వెంటనే సోల్జర్స్ చుట్టు ముట్టేరు.'

'అయితే మన మిప్పుడేం చేద్దాం ? సాహసంగా 'లాబ్' లో ప్రవేశిస్తామా ?' అడిగేడు ఏజంట్ 222.

'సాహసిస్తే తుపాకి తూటాలతో మన ఒళ్ళు తూట్లు పడడం మినహా మరేం జరగదు. యిప్పుడు మనకూకావల సింది ఉపాయం. నాకో ఉపాయం కనిపిస్తోంది. కాని...." సందేహించేడు.

'ఏమిటది ?'

"ముఖద్దర్ ఖాన్కి స్పృహ రాగానే నేను నిన్ను విడి పించుకు పోయిన సంగతి గ్రహిస్తాడు. నీ ద్వారా 'మృత్యుకిరణాలు' లేబరేటరీ గురించి నేను తెలుసు కుంటాననీ వూహిస్తాడు. అ వెంటనే తన వాహనంలో బయల్దేరి లేబరేటరీకి వెళ్ళి అందర్నీ హెచ్చరిస్తాడు. పటిష్టమైన కట్టుదిట్టాలు ఏర్పాటు చేస్తాడు. అందుకని నేను అతని కారు డిక్కీలో దాక్కొని అతనితో లేబరే టరీకి వెళ్తాను. నీవు ఆఫ్ఘనిస్తాన్ సరిహద్దు దాటి ...." అంటూ ఏదో చెప్పాడు.

# 9

అరగంట తర్వాత స్పృహవచ్చింది ముఖద్దర్ ఖాన్ కి.

"ఎక్కడ? వాడెక్కడ?" అంటూ రంకెలు వేస్తూ లేచేడు. తన చుట్టూ స్పృహతప్పి పడివున్న సోల్జర్స్‌ని చూసేక పరిస్థితి సూచాయగా అర్థమైంది. ఏజంట్ 222ని విడిపించుకు పోయేదని తెలిసేక గుండె గుభేల్ మంది.

ముఖద్దర్ ఖాన్ మస్తిష్కంలో ఆలోచనలు బయలు దేరాయి. విహారి అఖండుడు. అత్యంత ప్రతిభాశాలి. ఎటువంటి క్లిష్టమైన పనయినా అవలీలగా చేసుకుపోగలిగే ధీశాలి. ఏజంట్ 222 ని లేబరేటరి వివరాలడిగి తెలుసుకుంటాడు. దాన్ని నాశనం చేయడానికి యిద్దరూ బయలుదేరి వుంటారు.

అయినా వాళ్ళు లోపల ప్రవేశించడం అంత సులభం కాదు. దారిలో ఎన్నో చెక్ పోస్టులున్నాయి. ఎక్కడో ఒకచోట పట్టుబడిపోతారు. ఏదేవే, తను బయల్దేరాలి.

గబ గబ బయటికి నడిచేడు. కారిడార్ మెట్లు దిగువన కారు కనిపించింది.

కారెక్కి స్టార్ట్‌చేసి బయటికి దూకించేడు ముఖద్దర్ ఖాన్.

రోడ్డును మింగేస్తూ రెండు చెక్ పోస్ట్‌లను దాటి పోయింది కారు. కారులో వున్నది. ముఖద్దర్ ఖాన్ కావడం వల్ల చెక్ పోస్ట్లోని అధికారులు కారుని ఆపే ప్రయత్నం చేయలేదు.

మూడవ చెక్ పోస్టు దగ్గిర గేటువేసి వుండడంతో కారాపక తప్పిందికాదు ముఖద్దర్ జాన్ కి.

కారు దగ్గరికి పరిగెత్తుకొచ్చి లోనికి చూసేడు అధికారి. "నంబర్‌ప్లీజ్" అడిగేడు.

"అన్ని అంకెలూ మనవే!" చెప్పేడు ముఖ్ధర్‌ఖాన్.

"సారీ సార్ !" వెనక్కి తప్పుకున్నాడు. గేటు పైకి లేచింది.

కారు రయ్ మని దూసుకు పోయింది.

లాబరేటరీ గేటు ముందు కారుని ఆపేరు మళ్ళీ. మొదటి మూడు చెక్‌పోస్టుల దగ్గరకంటే సెక్యూరిటీ గార్డ్సు ఎక్కువ వున్నారక్కడ.

ఒక అధికారి పరిగెట్టుకు వచ్చి "కోడ్ వర్డ్ ప్లీజ్" అని అడిగేడు.

'మృత్యుకిరణాలే మా ఆయుధం!' చెప్పేడు ముఖ్ధర్‌ఖాన్

'జీ సాబ్!' అని గేటుతెరవమని సైగజేసేడు.

గేటులేచింది. కారు తిన్నగాలోనికి దూసుకుపోయింది. ముఖ్ధర్‌ఖాన్ కారుదిగి చకచక లాబరేటరీవేపు అడుగులేసేడు.

లాబ్‌లో ప్రతి ఒక్కరి సెల్యూట్ అందుకుంటూ వెళ్ళి డైరక్టర్ని కలుసుకున్నాడు.

'హలో డైరక్టర్ సాబ్! మన పరిశోధనలు ఎంత వరకు వచ్చేయి?' అడిగేడు అతన్ని కలుసుకున్నాక.

'ఈ రోజుతో మన పరిశోధనలు ముగిసినట్టే. మన ప్రయోగాలు ఫలించేయి. ఈ సారి విజయం మనదే. కాశ్మీర్, దానితోపాటు భారతదేశం మన పరంగాక తప్పదు."

'థాంక్యూ డైరక్టర్! బైదిబై, ఇద్దరు యిండియన్

ఏజెంట్స్ పాకిస్తాన్‌లో అడుగుపెట్టేరు. ఈ లేబరేటరీని నాశనం చేయడమే వారిధ్యేయం!'

'మైగాడ్!' అదిరిపడ్డాడు.

'గనుక సెక్యూరిటీ బలగాన్ని అప్రమత్తతో వ్యవహరించమనండి. అనుక్షణం రక్షణఏర్పాట్లును సరిచూసుకోవాలి. బి కేర్ ఫుల్!'

తలూపేడు డైరక్టర్.

బయటికి నడిచేడు ముఖ్దర్ ఖాన్. లేబరేటరీ అంతా ఓసారి తిరిగి కట్టుదిట్టమైన ఏర్పాట్లుచేసి, సెక్యూరిటీ గార్డ్స్‌ని గట్టిగా హెచ్చరించి కారెక్కేడు.

ముఖ్దర్ ఖాన్ కారు కనిపించడంతో గేటులేచింది.

కారు బయటికి దూసుకుపోయింది.

# 10

ముఖ్దర్ ఖాన్ కారు డిక్కీలో దాగి లేబరేటరీ చేరుకున్న విహారీ, అతను వెళ్ళి పోగానే చటుక్కున డైరెక్టర్ గదిలోకి దూకి అతని పీక పట్టుకున్నాడు.

విహారి చేతిలో విల విల లాడిపోయేడు డైరక్టర్. గింజుకుంటూ విడిపించుకోవాలని ప్రయత్నిస్తున్నాడు.

విహారి అరచేయి చాచి మెడ నరాల మీద కొట్టేడు బలంగా! కిక్కురు మనకుండా తల వాల్చేసేడు డైరక్టర్.

అతన్ని రివాల్వింగ్ ఛెయిర్లో సరిగ్గా కూర్చోబెట్టేడు. ఎవరేనా అతన్ని చూస్తే కుర్చీలో కూర్చుని నిద్ర తీస్తున్నాడనుకుంటారు.

ఫోన్ మ్రోగింది.అప్రయత్నంగారిసీవరందుకున్నాడు.

"నమస్తే సర్! ఈరోజుతో మా పరిశోధనలు ముగిశాయి. యికనైనా మేము మా యిళ్ళకు పోవచ్చా?"

అన్నది అవతల కంఠం.

అతను మృత్యుకిరణాలు పరిశోధకుల్లో ఒకడని గ్రహించిన విహారికి ఓ ఆలోచన వచ్చింది.

'మిస్టర్। లేబరేటరీలో టైమ్ బాంబు పెట్టేరెవరో. లోపలున్న వాళ్ళందర్నీ బయటికి పరిగెత్తమను. హరి యప్।" అరిచేడు విహారి ఫోన్‌లో.

క్షణంలో బిలబిల మంటు మనుషులు లోపల్నుంచి రాసాగేరు. విహారి అందర్నీ తప్పించుకుని వెళ్ళి, ఎవరూ చూడకుండా టైమ్ బాంబ్‌లు ఐదు నిమిషాల్లో పేలేట్టు లేబరేటరీలో ఎరేంజ్ చేసి బయటికొచ్చేరు.

'హేండ్సప్।"

గిర్రున తిరిగేడు విహారి.

ముఖద్దర్‌ఖాన్।।। అతను అంత తొందరగా తిరి గొస్తాడని వూహించలేదు.

అతని చేతిలో రివాల్వర్ నిగనిగ లాడుతూ మెరు స్తోంది.

విహారి ఆలస్యం చేయ దలచుకోలేదు. స్పీడుగా కాళ్ళు ఝాడించేడు. ముఖద్దర్‌ఖాన్ కడుపులో తగిలిందా దెబ్బ. మూడడుగుల దూరంలో పడ్డాడా దెబ్బకి.

కోలాహలం వినిపించింది. తలెత్తిచూసేడు. సోల్జర్స్ మిషన్‌గన్స్‌తో రంగంలోనికి దిగేరు. విహారి పరిగెత్తేడు.

పదడుగుల దూరంలో ఒక మిలటరీ జీప్ ఆగివుంది. జీప్‌లో ఎవరూ లేరు. చంగున దూకి, జీప్ స్టార్టుచేసేడు. ముందుకు వురికించేడు.

వెనుక సోల్జర్స్ పరిగెత్తు కొస్తుండడం గమనించేడు విహారి.

చుక్ ....చుక్ ....చుక్ ....

మిషన్ గన్స్ ప్రేలు తున్నాయి.

జీప్‌వి రాచుకుంటూ పోతున్నాయి బులెట్స్.

జీప్ వేగాన్నందుకుంది.

ఎదురుపడిన సోల్జర్స్‌వి కాల్చి పారేస్తున్నాడు. గేటు విరిగిపడింది, మిలటరీ జీప్ బలానికి.

జీప్ గేటు దాటుతుండగా కళ్ళు మిరుమిట్లు గొలిపే వెలుగు కనిపించింది విహారికి. లేబరేటరీ వుండే ప్రదేశంలో మంటలు ఆకాశాన్నంటుతూ లేచాయి. ప్రేలుళ్ళ పెద్దగా వినిపిస్తున్నాయి.

విహారి వెనుకనే మరో రెండు జీప్‌లు వెంటపడ్డవి.

విహారి జీప్‌ని వేగంగా నడుపుతున్నాడు. అది అంతా అడవిప్రదేశం. రోడ్ చాలా బాగుంది. జీప్ వురకలు తీస్తూ పరిగెత్తుతోంది.

చుక్ ....చుక్ ....చుక్ ....

వెనుక జీపుల్లో నుండి మిషన్‌గన్స్ ప్రేలుస్తున్నారు సోల్జర్స్.

'అమ్మో !' విహారి జబ్బలో బుల్లెట్ దిగింది. నిప్పు కణం పెట్టి కాల్చినట్టుగా వుంది. రక్తస్రావం అవుతోంది. నీరసం ముంచుకొస్తోంది.

అయినా లెక్కచేయడం లేదు విహారి. జీప్‌ని ఆఫ్ఘనిస్తాన్ బోర్డర్ వేపు పరిగెత్తిస్తున్నాడు.

బోర్డర్ దగ్గర పడింది.

అంతలో ఏదో చప్పుడు వినిపించింది. గిరగిరా తిరిగే ప్రొఫెల్లర్స్ గాలిని చీలుస్తున్న చప్పుడు. హెలికాప్టర్ ఎగురుతున్నపుడు వినపడే శబ్దం. విహారిలో నూతనో

త్సాహం కలిగింది.

. చటుక్కున తల పైకెత్తి ఆకాశంలోకి చూసేడు. హెలికాప్టర్ జీప్‌తో పాటేపస్తోంది. దానిమీద యిండియన్ ఎయిర్ ఫోర్స్ గుర్తులు కనిపిస్తున్నాయి.

'కమాన్ బ్రదర్!' హెలికాప్టర్‌లోనుండి తలబయటకు పెట్టి అరిచేరు ఏజంట్ 222.

విహారికి పెర్రిగా అరవాలనిపించింది. పిచ్చిగా ఆనందం కలిగింది.

హెలికాప్టర్‌లో నుంచి త్రాటి నిచ్చెన దిగ సాగింది జీప్‌లోకి.

వెనుక మిషిన్ గన్స్ నిర్విరామంగా ప్రేలుతున్నాయి.

త్రాటి నిచ్చెన చాలా కిందకి దిగింది. విహారి జీప్ స్టీరింగ్ కంట్రోల్ చేస్తూనే నిచ్చెన అందుకున్నాడు.

మరుక్షణము హెలికాప్టర్ వేగాన్ని పుంజుకుంది.

మిలటరి జీప్ తిన్నగా వెళ్ళి ఓ చెట్టును గుద్దుకుని ఆగిపోయింది.

చుక్....చుక్....చుక్....

మిషీన్ గన్స్ హెలికాప్టర్ నిచ్చెనకు వేలాడుతున్న విహారి వేపు తిరిగేయి. కాని అప్పటికే హెలికాప్టర్ మిషిన్ గన్స్ రేంజికి అందనంత ఎత్తుకు వెళ్ళిపోయింది.

మెల్లగా హెలికాప్టర్ లోనికి చేరుకున్నాడు విహారి. అతని కళ్ళు మగతగా మూత బడుతున్నాయి.

విహంగంలా ఎగురుతూ ఢిల్లీ వేపు పయనించ సాగింది హెలికాప్టర్.

(ఐపోయింది)

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మం



వసుంధర

(గతసంచిక తరువాయి)

ఆ ప్రాంతంలో ఒక ప్రవేశద్వారం ఉంది. ద్వారం వద్ద ఇద్దరు మహా కాయులైన ఆటవికులు కాపలాగా ఉన్నారు. కొత్త మనుషులను చూసి వాళ్ళిద్దరూ ముందుకు వచ్చారు. వాళ్ళు పెదవివిప్పి మాట్లాడక పోయినా చూపుల్లో చాలా ప్రశ్నలు కనబడుతున్నాయి.

"వీళ్లు మన మిత్రులు. గంగాపురం ప్రెసిడెంటు పంపించాడు-" అని చెప్పాడు లక్ష్మణుడు. కాపలా వాళ్ళిద్దరూ వాళ్ళను లోపలకు వెళ్ళనిచ్చారు.

గురువులు ఆశ్చర్యంగా ఆ ప్రాంతాన్ని తిలకిస్తు

న్నాడు. పచ్చని చెట్లమధ్యన గుడిసెలు. గుడిసెల మీద లతలు. నార బట్టలు, జంతుచర్మాలతో పాటు మామూలు బట్టలు ధరించిన మనుషులు కూడా ఆ ప్రాంతంలో తిరుగుతున్నారు. అందరూ దృఢంగా ఉన్నారు. ఆరోగ్యంగా అగుపడు తున్నారు. ప్రకృతి సహజమైన ఆహారం తినడం అందుకు కారణం కావచ్చును.

మామూలు అరణ్యాలకీ ఆ ప్రాంతాలకీ తేడా ఉంది. చూస్తూంటే నగరాలు కూడా ఈ పద్ధతిలో కడితే ఎంతో బాగుంటుందని గురువులుకు తోచింది.

లక్ష్మణుడు ఒక గుడిసెముందు ఆగాడు. అది చాలా పెద్ద గుడిసె. గుడిసెముందు ఎత్తైన అరుగులున్నాయి.

"ఇది మా నాయకుడి ఇల్లు. ఎవరు నాయకుడైతే వాళ్ళ ఇంట్లో ఉంటారు-" అన్నాడు లక్ష్మణుడు. లక్ష్మణుడా ఇంటికి వచ్చేముందు తన్ను పలకరించిన కొంత మందితో మాట్లాడాడు.

"అంటే ఇది రాజ్‌భవన్ లాంటిదన్న మాట!" అన్నాడు రామం.

నాయకుడి ఇంటిముందు అందమైన ముగ్గులున్నాయి. అరుగులకు అందమైన రంగులున్నాయి. అలంకరణ తమాషాగా వుంది. లక్ష్మణుడు మెట్లు ఎక్కి తలుపు తట్టాడు.

దృఢంగా ఉన్న ఓ ఆటవికుడు తలుపులు తీశాడు. లక్ష్మణుడు గురువుల్ని, రామాన్ని పిలిచి- 'ఈయనే మా నాయకుడు!' అని చెప్పాడు.

ఇద్దరూ నమస్కరించారు. గోపీ, శంకరం తాము

కూడా ముందుకువచ్చి ఆటవికునికి నమస్కారించారు. ఆటవికుడు ముద్దుగా వారి తలమీద చేయి పెట్టాడు.

'విశేషాలు చెప్పు!' అన్నాడు నాయకుడు, లక్ష్మ ణుడి వంక తిరిగి.

"వీరిని గంగాపురం ప్రెసిడెంటుగారు పంపారు. మన మిత్రులు ...." అన్నారు లక్ష్మణుడు.

"అలాగా!" అని తలపంకించి– "ఈ పిల్లలెందుకు వచ్చారు!" అన్నారు నాయకుడు.

"మన ప్రాంతాలు చూడాలని మనసుపడితే తీసుకుని వచ్చాను. ఇతను గంగాపురం ప్రెసిడెంటు మనవడు శంకరం, ఇతను గంగాపురం కరణం మనవడు గోపీ–" అన్నాడు లక్ష్మణుడు.

"అయితే వాళ్ళకు గూడెం చూపించు...." అన్నాడు నాయకుడు. అది ఆజ్ఞగా భావించి ఆ పిల్లల్ని తీసుకుని వెళ్ళిపోయాడు లక్ష్మణుడు.

'కూర్చోండి' అన్నాడు నాయకుడు.

అంతా అరుగులమీద కూర్చున్నారు. అప్పుడు గురు వులు తన దగ్గరున్న కాగితాన్నితీసి నాయకుడికిచ్చాడు. దానిమీద గురువులు, రామంల ఫొటోలు అ తి కిం చి ఉన్నాయి. క్రింద మిత్రులుగా వాళ్ళను పరిచయం చేస్తూ రాసిన వాక్యాలున్నాయి. ఆ క్రింద ఊరిపెద్దల సంతకాలున్నాయి.

ఆటవిక నాయకుడు వారిద్ద వంకా ఆ ఫోటోల వంకా మార్చి మార్చి చూశాడు. తర్వాత లేచి నిలబడి— "ఇప్పుడే వస్తాముండండి!" అంటూ లోపలకు వెళ్ళాడు. రెండు నిమిషాల్లో వెనక్కు తిరిగి వచ్చి–'మిమ్మల్ని మా

అతిథులుగా స్వీకరిస్తున్నాను....' అన్నాడు.

'అపూర్వనిధికి దారి తెలుసుకుందా మని వచ్చా....' అన్నాడు గురువులు.

"ఆ విషయం ఆతిథ్యం అయ్యేక మాట్లాడుకుందాం. ఈ రాత్రితో కలిసి మొత్తం మూడు రాత్రులు మా గూడెంలో మీకు మరపురాని ఆతిథ్యం ఇవ్వబడుతుంది-' అన్నాడు నాయకుడు.

రామం గుండెలు దడదడలాడాయి. తాతయ్య చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది. ఆయనకు ఇదే విధంగా మూడు రాత్రుల ఆతిధ్యం ఇవ్వబడింది. తరువాత....

"తరువాత....?" అనడిగాడు గురువులు.

"మేము చేయబోయేది ముందుగా చెప్పం। మా గూడెం లోకి ప్రవేశించిన వారు మా ఆచారాలను పాటించా ల్సిందే-సకల మర్యాదలతో మీకు అతిధ్యాన్ని ఇవ్వడం మా బాధ్యత....' అన్నాడు నాయకుడు.

గురువులు కూ్కా అనుమానం వచ్చింది. తమకు కూడా రామేశానికి జరిగినట్లే జరుగదు గదా! కానీ అలా జరగడానికి వీల్లేదు.

గంగాపురం నుంచి తాను తీసుకవచ్చిన కాగితం మీద స్పష్టంగా మిత్రులమని రాయించాడు. మిత్రులనూ, శత్రు వులనూ కూడా ఒకేరకంగా ఆతిధ్యమివ్వడం ఈ అటవి కుల ప్రత్యేకత అయుండవచ్చు.

'ఆ చిన్న పిల్లలిద్దర్నీ మేముగంగాపురం పంపిస్తాము. వారి గురించి మీకు చింత అవసరంలేదు-' అన్నాడు నాయకుడు.

*  *  *

'అందానికి నిర్వచనం నువ్వు. నువ్వు గనుక మా నగరం వస్తే....' అన్నాడు గురువులు. అతడింకా మాట్లాడకుండనే అతని నోరు మూసిందామె.

'ఏం?' అన్నాడతను.

"మాకు నగరాలంటే భయం. అక్కడి కృత్రిమ జీవితం గురించి చాలా విన్నాం-" అందామె కంగారుగా.

గురువులు నవ్వి-"నీ పేరు?" అన్నాడు.

"మలయ।" అందామె.

'నగరంలో కృత్రిమ వాతావరణమన్నమాట నిజమే। కానీ ఆ జీవితం కూడా ఎంతో బాగుంటుంది. చూడ్డానికిష్టం లేక పోయినా వినడానికి భయపడాల్సిన విషయం కాదది' -అంటూ గురువులా యువతికి నగరంలోని విశేషాల గురించి చెప్పాడు.

నగరవాసులకున్న ఒకొక్క వదుపాయం గురించే అతను చెబుతూంటే ఆమె విని ఆశ్చర్యపడి- "మేమనుకునే స్వర్గంలో ఇవన్నీ ఉంటాయి. నగరాల్లో ఇవన్నీ ఉంటాయంటే నేను నమ్మలేను....' అంది.

"అవన్నీ ఉండడంలో స్వర్గం లేదని నగర జీవితం తెలియజేస్తుంది-"అన్నాడు గురువులు తన జీవితాన్ని తలచుకుంటూ.

అతను మలయా నుంచి అటవికులకు సంబంధించిన చాలా విశేషాలడిగి తెలుసుకున్నాడు. రామేశం చెప్పిన విశేషాలతో అవన్నీ సరిపోయాయి.

'వృధా ప్రశ్నలతో కాలయాపన చేయవద్దు. జీవితం హాయిగా అనుభవించు-' అంది మలయ, గురువులతో.

'ఎందుకనీ ?'

'బ్రతికున్నన్నాళ్ళే కదా సుఖాలు !' అంది మలయ.

'నీకు చాలా ఆయుష్షు ఉంది-' అన్నాడు గురువులు.

"నీ ఆయుపు సంగతి నీ కంటే నాకే బాగా తెలుసు' అంది మలయ.

గురువులు ఉలిక్కిపడి - "నీ మాటలకు అర్థం ?" అన్నాడు.

"ఇప్పుడు చెప్పను. మూడోరాత్రి చెబుతాను...." అంది మలయ.

"ఇప్పుడే చెప్పాలి !" అన్నాడు గురువులు.

'అలా కుదరదు. నాతో గడిపిన అంతకాలమూ నువ్వు సంతోషంగా ఉండాలి. అందుకే ఆఖరురాత్రి చెబుతాను" అంది మలయ.

' ఇప్పుడు చెప్పకపోతే నాకు చాలా విచారంగా ఉంటుంది. చెబితే నాకు సంతోషం కలుగుతుంది !" అన్నాడు గురువులు.

"నేను చెప్పబోయేది నీకు సంతోషం కలిగించే విషయం కాదు....

"మీ వాళ్ళు నన్ను ఏ దేవతకైనా బలిఇస్తారా ?"

"అలాగని ఎందుకనుకుంటున్నావు ?" అంది మలయ

"ఆటవికుల్లో ఇలాంటివుంటాయని విన్నాను...."

"తప్పు చేసిన వాళ్ళ విషయంలో తప్ప ఇంకెవ్వరి శరీరం నుంచీ రక్తం చిందడాన్ని మా జాతి సహించదు, అంది మలయ.

'అయితే!' అని అగి పోయాడు గురువులు. మృత్యు లోయ సంగతి తనకు తెలుసు నన్న విషయం ఆమెకు తెలియజేయడం ప్రమాదం అనిపించింపతనికి. రామేశం

తప్పించుకుని తన మనషులను పంపించేదని తెలిస్తే వాళ్లు తనని బ్రతకనివ్వరు.

'ఏదో అడగబోయి మానేశావ్!' అంది మలయ.

"ఏమిలేదు. నేను మీ మిత్రుణ్ణి. మిత్రులకు ఆతిధ్యం ఇచ్చేక మీ జాతి ఏం చేస్తుందో తెలియకుండా వుంది...." అన్నాడు గురువులు.

'నువ్వు మా అతిధివి. కానీ మిత్రుడివి కాదు." అంది మలయ.

గురువులు మళ్ళీ ఉలిక్కిపడ్డాడు. ఆమె మాటలో అర్ధమేమిటి? గంగాపురం ప్రెసిడెంటు తన విషయంలో ఏమైనా మోసం చేశాడా?

చేస్తే ఎలాచేశాడు? అప్పుడు గురువులుకు ఆటవికుడైన లక్ష్మణుడి విషయం గుర్తుకు వచ్చింది.

'మలయా! నేనో ప్రశ్న అడుగుతాను. వాయిదా అడక్కుండ జవాబు చెప్పాలి!"

'చెబుతాను. కానీ మూడ్రోజుల తర్వాత నువ్వేమవుతావని మాత్రం ఇప్పుడడక్కు"

"అది కాదు.... గంగాపురం ప్రెసిడెంటు స్నేహితుణ్ణి నేను. ఆయన నన్నిక్కడకు పంపాడు. నువ్వన్న మాటల్ని బట్టి నాకెప్పుడో అనుమానం కలుగుతోంది. లక్ష్మణుడు నీ మనిషి కదా- ఎదురుగా మిత్రుడని చెప్పి తర్వాత మేము మిత్రులము కాదనీ శత్రువులమనీ చెప్పి ఉండవచ్చు..."

మలయ నవ్వి-'మా ఆటవికుల సంగతి మీకు తెలియదు. మాకు రెండు మాటలుండవు. లక్ష్మణుడు మీ ఎదుట ఒక మాటా చాటుగా ఒక మాటా చెప్పేడు. అతడుగనుక మీరు

మాకు మిత్రులని నాయకుడికి చెప్పివుంటే నిజంగావే మీరు మాకు మిత్రులని అర్థం! ఆ నమ్మకం కోసమే మీతో పాటు లక్ష్మణుడిని పంపి వుండాలి...కానీ" అని ఆగిపోయింది.

'కానీ....?' అన్నాడు గురువులు కుతూహలంగా.

"లక్ష్మణుడు మీరు ఎదురుగా ఉండగా నాయకుడికి మీరు మిత్రులని చెప్పాడా? అతను ఏం చెప్పాడో బాగా గుర్తు చేసుకొండి-' అంది మలయ.

"మిత్రులమనే చెప్పాడు" అన్నాడు గురువులు నిశ్చయంగా.

"అయితే నిస్సందేహంగా మీరుమాకు మిత్రులయ్యుండాలి.... కానీ....'

"మళ్ళీ కానీ ఏమిటి?" అన్నాడు గురువులు.

"మిత్రులకిచ్చే అతిథ్యం ఇలా ఉండదు!'' అంది మలయ.

'మరి....?' అన్నాడు గురువులు.

'నన్నింకేమీ అడగొద్దు....' అంది మలయ.

గురువులు తీవ్రాలోచనలో పడ్డాడు. లక్ష్మణుడు నాయకుడికి చెప్పినమాటలు సూటిగానే ఉన్నాయి. అతనిలో మోసంలేని పక్షంలో తను అటవికులకు శత్రువుగా ఎలా గుర్తించబడతాడు? మలయ పొరబడుతోందా?

జీవితం సుఖంగా గడిచిపోయింది అక్కడున్నంత కాలమూ. మూడోరాత్రి అతను మలయను అసలు విషయం చెప్పమని అడిగాడు.

'విన్నా, నీ మిత్రుణ్ణి మృత్యులోయలోకి పంపుతారు- రేపు ఉదయం.....'

గురువులు గుండె ఓ క్షణంపాటు ఆగిపోయింది- 'అంటే.... నేనుమీకు మిత్రుణ్ని కాదన్నమాటః' అన్నాడు.

'కాదు. గంగాపురం ప్రెసిడెంటు ముందే మీఫొటో లిచ్చి ఓ మనిషి ద్వారా సమాచారం పంపించాడు. మీరు గంగాపురానికి పీడగా తయారయ్యారట. ఆటవిక ప్రాంతానికి దారి చెప్పమని వాళ్ళప్రాణాలు తోడేస్తున్నా రుట. గత్యంతరం లేని పరిస్థితుల్లో దారి చెప్పాల్సి వచ్చిందనీ- మిమ్మల్నేదో విధంగా అంతంచేయమనీ ఆయన సమాచారం పంపాడు. తను లక్ష్మణుడి ద్వారా పంపే సమాచారం గత్యంతరంలేని పరిస్థితుల్లో పంపు తున్నదని కబురంపాడాయన....' అంది మలయ.

తన ఫొటోలు చూడగానే ఆటవిక నాయకుడు లోప లకు వెళ్ళిరావడం గుర్తువచ్చింది గురువులుకు. అయితే అంతేజరిగి ఉంటుంది। ఇప్పుడేంచేయాలి?

'మృత్యులోయ అంటే ఏమిటి?'

మలయ వివరించింది.

'తప్పించుకునే అవకాశాలేమైనా ఉన్నాయా?' అన్నాడు గురువులు.

'ఏమీలేవు....' అంది మలయ.

'రహస్యద్వారాలేమీ ఉండవా?" అన్నాడు గురువులు ఆశగా ఆమె వంకచూస్తూ-

'ఉండవు-' అని ఓ క్షణం ఆగి - "ఎలాగూ చని పోతావు కాబట్టి ఓ రహస్యం చెబుతాను. మృత్యులోయకు ఒక ద్వారం ఉంది. దాన్ని మృత్యులోయలోంచి తెరవ డం ఎవ్వరికీ సాధ్యపడదు. బయట్నించి మా వాళ్ళ

ఏడాదికో పర్యాయం తెరుస్తూంటారు. మృత్యులోయ లోంచి బయటపడడానికి అదొక్కటే అవకాశం. ఆ అవ కాశం కూడా మీకు లేదు. వారం రోజుల క్రితమే ఆ ద్వారం తెరిచి మూసేయడం జరిగింది-మళ్ళీ ఏడాదిదాకా అది తెరుచుకోదు-' అంది మలయ.

గురువులు శరీరం చల్లబడినట్లయి పించింది-'తప్పిం చుకోడానికింకేదైనా మార్గముందా?' అనడిగాడు.

'మృత్యులోయ నుంచి తప్పించుకోడానికింకే మార్గాలూ లేవు....' అంది మలయ.

'మృత్యులోయ నుంచి కాదు. ఈ గూడెం నుంచి....' అన్నాడు గురువులు.

మలయ నవ్వి-'ఈ గూడెం నుంచి తప్పించు కోవడం ఆ దేవుడికూ్కడా సాధ్యపడదు. గుడిపై చుట్టూ పటి ష్టమైన కాపలా ఉంది.గూడెంలో మేటి విలుకాళ్ళున్నారు. ఎగురుతున్న పక్షిని కూడా గురిచూసి కొట్టగల సమర్థులు వాళ్ళు....' అంది.

గురువులు బాగా ఆలోచించాడు. ఏదో దైవశక్తి సాయపడితే తప్ప తను బ్రతికి బయటపడే అవకాశం లేదు. గంగాపురం ప్రెసిడెంటు గట్టి వాడు. మొత్తానికి తన మీద చావు దెబ్బ తీశాడు.

గురువులు మలయ వంక చూసి-'మలయా! నామీద నీకు ప్రేమలేదా! నువ్వునన్ను రక్షించలేవా?' అనడిగాడు.

'నువ్వలా నీళ్ళు కారిపోతుంటే నాకు చాలా ఆశ్చ ర్యంగా ఉంది. నీ గురించి చాలా విన్నాను. నీకసలు భయమేలేదనీ-ఎలాంటి ఇబ్బందినుంచైనా బయటపడ గల శక్తి సామర్థ్యాలు నీకున్నాయనీ విన్నాను....'

'ఎవరు చెప్పారు?'

'నాయకుడు....' అంది మలయ-

'అయితే నా అంతం సమీపించిందన్న మాట!'

'అవును - సమీపించింది. కానీ నీలో నేను విన్న ధైర్యం కనబడ్డం లేదు....'

'నాకు ధైర్యముంది కానీ అది నాకు వివేకం ప్రసాదించిన ధైర్యం. నిప్పుల మంటల్లో దూకమంటే ప్రాణాలతో బయట పడగలననుకునే అవివేకం నాకు లేదు-నా శక్తి, తెలివి తేటలు ఇంతవరకూ నన్ను కాపాడాయి. ఇక మీదట అవి నన్ను కాపాడలేవని తెలిసి నాధైర్యం నన్ను వదిలిపెడుతోంది-'

"అలాంటప్పుడు ఇక్కడికెందుకొచ్చావ్ ?"

'నా ధైర్యం నన్నిక్కడకు రప్పించింది...'

'నీ ధైర్యం నిన్ను మృత్యులోయలోకి నడిపిస్తోంది.' అని నవ్వింది మలయ.

"మలయా-నా ఆశ నువ్వే! నువ్వే నన్ను రక్షించాలి...." అన్నాడు గురువులు.

'ఇప్పటికిలా నన్ను చాలామంది అడిగారు. ఇందులో నేను చేయగలిగినదేమీ లేదు నీ ఆత్మ శాంతికి భగవంతుణ్ణి ప్రార్థించడం తప్ప!' అంది మలయ.

గురువులు భారంగా నిట్టూర్చాడు.

"అలా దిగాలు పడకు. పుట్టిన ప్రతిజీవికీ మరణం తప్పదు. చావు ఇలా తెలిసి రావడం చాలా తక్కువ మంది విషయంలో జరుగుతుంది. ధైర్యవంతుడినంటు

న్నావు కాబట్టి ధైర్యంగా చావుకు సిద్ధపడు-" అంది మలయ.

*　　　*　　　*

"నేనెప్పుడో చచ్చిపోయాను...." అన్నాడు రామం. ఆపుకుందామన్నా ఆగకుండా అతని కళ్ళవెంబడి అశ్రు ధారలు కారుతున్నాయి.

ఇద్దరూ ఆటవిక యువతుల వద్ద ఆఖరి ముద్దు తీసుకున్నారు. ఈ జన్మకు తాము పొందబోతున్న ఆఖరి సుఖమది అని ఇరువురికీ తెలుసు. రాబోతున్న చావు భయంకరంగా ఉంది. ఆ ఆలోచన వారిని అన్ని సుఖాల నుంచీ దూరం చేస్తోంది.

వారికి చుట్టూ బాణాలు ధరించిన ఆటవిక యువకు లున్నారు. వారి బాణాలు ఈ ఇద్దరిమీదకు ఎక్కు-పెట్ట బడి ఉన్నాయి.

ఇద్దరికీ మత్తుపానీయాలు అందించబడ్డాయి. కొద్ది సేపట్లోనా అతనూ,రామం బుట్టలో కూలబడి పోయారు.

వారికి స్పృహ వచ్చేసరికి ఇద్దరూ మృత్యులోయలో ఉన్నారు. అక్కడి పరిస్థితి అంతా రామేశం వర్ణించిన విధంగానే వుంది. అక్క-డి వాసన భరించ శక్యం గాకుండ వుంది.

గురువులు, రామం బెల్టులు విప్పారు. ఆ బెల్టులో వారొకపల్చటి గుడ్డను దాచారు. ఆ గుడ్డనుతీసి ముక్కు-కు అడ్డుగా కట్టు కున్నారు. ఇప్పుడు వారికి దుర్గంధ సమస్య లేదు.

"ఒక సమస్య తీరింది కానీ...ఇలా ఎన్నాళ్ళు?'

అన్నాడు రామం.

"చాలా లోతున ఉన్నాం- ఎగిరి తప్పించుకోవడం సాధ్యంకాదు. ఏమైనా రహస్య మార్గాలున్నా యేమో వెదకాలి. అంతకుమించి వేరేదారిలేదు...." అన్నాడు గురువులు.

ఇద్దరూ చుట్టూఉన్న గోడను అణువణువూ శోధించారు. మృత్యులోయను ప్రకాశవంతంచేస్తున్న మణుల నైతే చూడగలిగారు కానీ రహస్య మార్గమేమీ వారికి గోచరించలేదు. రామేశం చెప్పినమాటలు గుర్తుచుకుని వాళ్ళు మణుల జోలికివెళ్ళలేదు.

తమ బుట్టలోని ఆహారాన్ని చూసుకున్నారు వాళ్ళు. ఇద్దరు మనుషులకు మూడు రోజులకు సరిపడ ఆహార ముంది అందులో.

'పొదుపుగాతింటే ఇదేభోజనంతో ఆరురోజులు గడుప వచ్చు-" అన్నాడు రామం.

'ఎన్నాళ్లున్నా చావుతప్పదు. అందుకని నాదోసలహా. ఇద్దరం ఒకసారే చావడమెందుకు? నా ఆహారం కూడా నీకే వదిలేస్తాను. ఆ విధంగా నువ్వింకో ఆరురోజులు బ్రతుకవచ్చు- ఏమంటావు?" అన్నాడు గురువులు.

'అలా ఎందుకు?' అన్నాడు రామం ఆశ్చర్యంగా.

'మీ తాతగారికి నేను మాటిచ్చాను. నా కంఠంలో ప్రాణమున్నంత వరకూ నీ ప్రాణాలు కాపాడుతానని! ఇప్పుడు నీ గురించి నేను చేయగలిగినదింకేమీ లేదు. నా ఆహారాన్ని నీకు వదిలిపెట్టడం ద్వారా కనీసం నా మాట నిలబెట్టుకున్న తృప్తి ఉంటుంది నాకు....'

అన్నాడు గురువులు.

"గురువులూ!" అన్నాడు రామం. అతనికి ఏడుపువచ్చింది- 'నువ్వు నాకు అన్నలాంటి వాడివి. ఏ పరిస్థితుల్లోనూ నిన్ను నేను వదులుకోలేను. ఇంత వరకు కలిసి వచ్చాం. మనం కలిసి జీవిద్దాం. కలిసి మరణిద్దాం. అన్నీ సమంగా పంచుకుందాం. ఆహారంకూడా-' అన్నాడు రామం.

ఆఖరికి ఇద్దరూ కలిసి- ఆకలి వేసినప్పుడు కొంచెం కొంచెంగా తింటూ వీలైనన్నాళ్ళు ఆ ఆహారాన్ని దాచుకోవాలని నిర్ణయించారు. అయితే తమ కంత్యకాలం సమీపించిందన్న నిరాశ ఇద్దరికీ కలిగింది.

మృత్యులోయలో ఒక రోజు గడిపారు. మర్నాడు లేవగానే గురువులు మళ్ళీ తన ప్రయత్నం కొనసాగించాడు. గోడలు పట్టుకుని పైకి పాకడానికి వీలుపడుతుందేమోనని అతడి ఆశ.

కానీ గోడలు నున్నగా ఉన్నాయి. అక్కడక్కడ రాళ్ళు పొడిగినట్లున్నప్పటికీ ఏవీ కదలడం లేదు. పట్టు దొరకడం లేదు. ఆ విధంగా బయట పడడం అసాధ్యమని అతను గ్రహించాడు.

తన వల్ల ఏమీ ప్రయోజనం లేదనీ గురువులు వల్లనే తను రక్షించబడాలనీ రామానికి తెలుసు. అందువల్ల అతను గురువులు చేసే ప్రతి ప్రయత్నమూ ఫలించాలని భగవంతుడ్ని ప్రార్థించుకుంటున్నాడు.

చూస్తూండగా మృత్యులోయలో ఐదు రోజులు గడిచాయి. ఆహారపదార్థాలు బాగా తరిగిపోయాయి. తమ

పరిస్థితి తల్చుకుంటూంటే రామానికి ఏడుపొస్తోంది.

గురువులుకు కూడా క్రమంగా ధైర్యం నీళ్ళు కారి పోతోంది. అతను దిగులుగా రామం చేయిపట్టుకుని- 'చావంటే నాకు భయం లేదు. కానీ ఇలా చావాలని ఎన్నడూ అనుకోలేదు....' అన్నాడు.

ఇద్దరికీ ఇప్పుడు బాగా ఆకలి వేస్తోంది. ప్రస్తుతం మిగిలిన ఆహారపదార్థాలు ఏ ఒక్కరి ఆకలినీ తీర్చేవి కావు. వాటితో ఈరోజే గడవదు. తర్వాత ఏం చేయాలి?

రామం చేతులు పైకెత్తి-'భగవంతుడా - మాకు తిన డానికి ఏమైనా పంపించు' అన్నాడు. గురువులు హేళనగా నవ్వి-'చూద్దాం ఆ భగవంతుడేమైనా పంపిస్తాడేమో-' అంటూ తల ఎత్తి పైకి చూసి ఆశ్చర్యపోయాడు. "రామం! అలా పైకి చూడు...." అన్నాడతను అప్రయత్నంగా!

రామం కూడా పైకి చూశాడు. ఆనందాశ్చర్యాలతో అతని ముఖం వెలిగింది.

పైనుంచి ఏదో వస్తువు క్రిందకు దిగుతోంది. దగ్గరవుతున్న కొద్దీ అది ఒకపెట్టెలా ఉంది. బాగా దగ్గరయ్యాక అది ఒక కర్రపెట్టె అని ఇద్దరూ గ్రహించారు. వాళ్ళు పక్కకు తప్పుకోగానే ఆ పెట్టె నేలకు అనుకుంది. ఇద్దరూ ఆ పెట్టెను సమీపించారు. అటవికులు తమ గురించి మరిన్ని ఆహారపదార్థాలు పంపి ఉంటారని ఇద్దరూ భావించారు.

ఆ పెట్టెమీద ఒక కాగితం అంటించిఉంది.- "ఇంకా మీరు జీవించిఉంటే ఈ పెట్టెలోని ఆహారపదార్థాలు

భుజించండి. అప్పటికీ జీవించిఉంటే ఇదిక్కడ ఇంకొక్క రోజుఉంటుంది. అప్పుడు మీరీ పెట్టెలో కూర్చుని పైకి రావచ్చును...." అని వ్రాసిఉండా కాగితంమీద.

గురువులు అనుమానంగా- 'నాకు మలయ చెప్పింది. నేను ప్రమాదకరమైన మనిషినని ఆటవిక నాయకుడను కుంటున్నాడు. నన్ను నిశ్చయంగా అంతం చేయాలను కుంటున్నాడు. ఇందులో విషదార్థాలుండి ఉంటాయని నా అనుమానం-' అన్నాడు.

రామానికి బాగా ఆకలిగా ఉంది - "అలా ఎందుకను కోవాలి? ఆటవికులు అనాగరకులే గాని అమానుషంగా ప్రవర్తించరు. మనం ఆకలి బాధకు చావడం ఇష్టం లేక మంచి ఆహారం పంపి ఉంటారు. అనవసరపు టనుమానాలు పెట్టుకోవద్దు. అది విషభోజనం అనుకో -ఎలాగూ చస్తాం-ఆకలికి మాడిపోకుండా ఒక్క క్షణంలో ప్రాణం పోతుంది-"

"బహుశా ఆటవికుల ఉద్దేశ్యమూ అదే అయుంటుంది ........ " అన్నాడు గురువులు-"తేలికగా మన ప్రాణాలు పోతాయనే ఉద్దేశ్యంతో ఈపని చేసిఉంటారు. కొద్దిగా తెలివితేటలుపయోగిస్తే ఇప్పుడు మనం తప్పించుకుని బయట పడవచ్చు. ఇందులోని ఆహార పదార్థాలు మనం నోట బెట్టవద్దు. పెట్టెలోకి వెళ్ళి కూర్చుందాం. ఒకరోజు ఆకలిబాధ భరించామంటే మనం ప్రాణాలతో తప్పించుకోవచ్చు...."

ఆకలికి ఆగడం కష్టమనిపించినా రామానికి గురువులు మాటల్లో నిజముందని పించింది. ప్రస్తుత పరిస్థితుల్లో

అది చాలా మంచి ఉపాయమని అతను గ్రహించాడు.

గురువులు పెట్టె తలుపులు తెరవబోయాడు. పెట్టె చాలా పెద్దదిగా ఉంది. పెట్టెపైన మేకులు కొట్టబడి ఉన్నాయి. దాని మీద కూర్చునేందుకు అవకాశం లేదు. పెట్టెకు ఓ పక్కగా తలుపులున్నాయి.

గురువులు తలుపులు తెరవబో తూండగా రామం 'హాచ్' అని తుమ్మాడు.

గురువులు ఆగిపోయాడు.

రామం ఆత్రుతగా గురువులు వంక చూసి 'తలుపులు తెరూ' అన్నాడు.

"నా మనసు కీడును శంకిస్తోంది. నీ తుమ్ము నాకు అపశకునం...." అన్నాడు గురువులు.

"ప్రాణాపాయ స్థితిలో ఉన్న మనకింకా భయమేమిటి'

అయితే గురువులు తలుపులు తీయలేదు. 'నా సెంటిమెంటు నాది. సలసల మరిగే నూనెలో వేయిస్తా నన్నా నా సెంటిమెంట్లు నేను వదలు కోలేను. కాసేపాగి తలుపు తీస్తాను...." అన్నాడు గురువులు.

'ఈలోగా కీడు పోతుందా?' అన్నాడు రామం.

'కీడు సంగతి నాకు తెలియదు. నా మనసు ధైర్యాన్ని పుంజు కోవడానికా వ్యవధి నాకు చాలా చాలా అవసరం' అన్నాడు గురువులు.

'నాకే సెంటిమెంట్లు లేవు. నేను వెళ్ళి తలుపు తీస్తాను...." అన్నాడు రామం.

"నీ ఇష్టం!" అన్నాడు గురువులు.

రామం విసురుగా వెళ్ళి పెట్టెతలుపు తీశాడు. అంతే,

నిలువెత్తు పెద్దపులి ఒకటి గాండ్రుమని అరుస్తూ పెట్టెలోంచి బయటకు దూకింది.

రాముం ప్రాణాలు పైనేపోయాయి. అతను చటుక్కున పెట్టెలోకి దూరి తలుపులు వేసుకున్నాడు.

• • •

"నమస్కారమండీ!" అన్నాడాయువకుడు.

"ఎవర్నువ్వు?"

"మీరు నాకో సాయంచేయాలి...."

'ఏమిటో చెప్పు...."

'గురువులు గురించి చెప్పాలి—'

గురువులు గురించి నాకేంతెలుసు?' అన్నాడతను.

'మీకు తెలుసు. బాగాతెలుసు. ఏదోపనికోసం మీరు గురువుల్ని జైలునుంచి తప్పించారు. . . .'

'ఇంతకీ నువ్వెవరు?'

'నా పేరు ఈశ్వరి. అబ్బాయిని కాదు. అమ్మాయిని. గురువులూ నేనూ ప్రేమించుకున్నాం-' అన్నాడా యువకుడు.

అతను ఆశ్చర్యంగా యువకుడి వంక చూసి- 'నీ మాటల్లోనిజాన్ని నేను పరీక్షించు కోవచ్చా?'అన్నాడు.

'శ్రీ కృష్ణపరమాత్మ ఆ మాత్రం తెలుసుకోలేరా?' అని నవ్వింది ఈశ్వరి.

'గురువుల్ని నేను జైలునించి తప్పించానని ఎలా గనుకున్నావు?'

'నేను కొద్దికాలంగా గురువులున్న జైలుప్రాంతాలే తిరుగుతున్నాను. మీరు గురువుల్ని కలుసుకున్న రోజునే

అతను హాస్పిటల్‌కి వెళ్ళాడు. ఆ తర్వాత అక్క-డ్నించి మాయమయ్యాడు ....' అంది ఈశ్వరి. శ్రీకృష్ణ పరమాత్మ జవాబుకోసం ఆమె చాలా ఆత్రుతగా ఎదురు చూస్తోంది.

"పోలీసులు కూడా ముందు అలాగే అనుకున్నారు. కానీ ఇప్పుడు వారు నిజం గ్రహించి నామీద నిఘా తగ్గించారు...." అన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ.

"పోలీసులు నిఘా తగ్గించారు కానీ నేను తగ్గించలేదు. నేను పోలీసుల మనిషిని కాను. గురువులు మనిషిని. అతనికోసం నేను తపించిపోతున్నాను. అసలు వేషంలో బయటపడితే నన్నూ పోలీసులు పట్టుకుంటారు". అంది ఈశ్వరి.

"నన్ను నమ్మి ఇవన్నీ చెబుతున్నావు. నేను నిన్ను పోలీసులకు పట్టిఇస్తే...."

"పరవాలేదు. గురువులు సంగతి తెలియకపోయాక నేను జైలుకుపోయినా బాధలేదు.''

"శభాష్-నువ్వు నాకు నచ్చావు...." అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ—''గురువు ఎక్కడున్నాడో నాకు తెలుసు. అక్కడికి చేరుకోవడం చాలాకష్టం. కానీ ధైర్యముంటే సాధ్యపడుతుంది. ప్రాణాలకు తెగించిన వాళ్ళే అక్కడికి వెళ్ళగలుగుతారు..."

"గురువుల్ని కలుసుకోవడం కోసం నేను దేనికైనా తెగిస్తాను....''

"అయితే విను...." అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ— "గంగాపురమనే గ్రామానికి సమీపంలో ఓ కొండ ఉంది,

ఆ కొండనుంచి సన్నవికాలిబాట ఉంది. ఆ బాట ఒక అరణ్యంలోకి దారితీస్తుంది. ఆ అరణ్యంలో ఒకచోట ఒక భయంకరాకారం ఎదురవుతుంది. అది నిజానికి ఒక బొమ్మ. ఆ బొమ్మ చేతితో ఒక మార్గాన్ని సూచిస్తూ ఉంటుంది. ఆ మార్గంలో వెడితే ఓ కొండగుహ వస్తుంది. ఆ కొండ గుహలోంచి బయల్దేరితే....ఒక శిధిలాలయానికి దారితీస్తుంది. ఆ శిధిలాలయంలో అపూర్వమైన నిధి ఉంది. దాన్ని సాధించడానికి వెళ్ళాడు గురువులు ...."

"ఒస్-ఇంతేగదా!" అంది ఈశ్వరి.

"ఇంతే అంటే చాలదు. హేమాహేమీలు ఆదారిన వెళ్ళి ప్రాణాలుకోల్పోయారు. ఎవ్వరూ ఇంతవరకూ ప్రాణాలతో తిరిగిరాలేదు. గురువులు కూడా వస్తాడని నాకు తోచదు...." అన్నాడు పరమాత్మ.

ఈశ్వరి కళ్ళలో రవంత భయం కనబడింది కానీ అంతలోనే తమాయించుకుని—"గురువులు అందరి లాంటి వాడుకాదు..." అంది

"ఆ ఆశతోనే గురువుల్ని పనికి పురమాయించాను. ఇంతవరకూ అతడివద్దనుంచి సమాచారంలేదు. ఏమ యాదో తెలియదు...." అన్నాడు పరమాత్మ.

'నేనక్కడికి వెడతాను ....' అంది ఈశ్వరి.

'నిజంగానా?' అన్నాడు శ్రీకృష్ణ పరమాత్మ- 'నేనూ అక్కడికెవర్నయినా పంపాలని చూస్తున్నాను...,"

'నేనే వెడతాను....' అంది ఈశ్వరి.

'అక్కడికి వెళ్ళేమనిషి గురువుల్ని ప్రేమించేద యుండడం చాలా అవసరం. అందుకే నువ్వెళ్ళడం

నాకిష్టంగానే ఉంది....' అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

'నేనేం చేయాలో చెప్పండి!' అంది ఈశ్వరి.

'నీకు ఒక ట్రాన్స్‌మిటర్ ఇస్తాను. ఎప్పటికప్పుడు నీకు తెలిసిన సమాచారం నాకు చేరవేస్తుండు. ఇప్పుడున్న పురుషవేషంలోనే ఉండు. నీ మకాం అడవిలోనే ఉంటుంది. ఎవరికంటా బడకుండా ఉండడానికి ప్రయత్నించాలి. ముఖ్యంగా నువ్వీ దారిలో వెడుతున్నట్లు గంగాపురం గ్రామపౌరులకు తెలియకూడదు. వెయ్యికళ్ళతో నీ పరిసరాలను గమనించు కుంటూ ఉండాలి.....' అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

'ఆ కోటకు కాపలా ఉండదా?'

"పెద్దగా ఉంటుందనుకోను. కానీ ఆ మార్గంలో అడుగు పెట్టినవాళ్ళు ప్రమాదాల్లో ఇరుక్కోక తప్పదు...' అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

'ఎందుకని?'

'అనిపిని ఎవరో తెలియని మనుషులు వశపర్చుకున్నారని అనుమానం. ఆమనుషులు చాలాబలవంతులు. వాళ్ళెవ్వరో తెలుసుకోవడమే చాలా కష్టంగా ఉంది. వాళ్ళ ప్రాంతానికి చేరడంఇంకా కష్టంగాఉంది..... తెలివితేటలుంటేతప్ప వాళ్ళను సాధించడం కష్టం....'అన్నాడు పరమాత్మ.

'సరే–నేను బయల్దేరుతాను ...' అంది ఈశ్వరి.

'అలాకాదు. నీకు ఓ నాలుగు రోజులపాటు శిక్షణ ఇవ్వాలి. రివాల్వర్ చేత్తోపట్టుకోవడం రావాలి. మనుషుల్నించి తప్పించుకునేందుకు కొన్ని ట్రిక్కులు తెలియాలి. అత్యవసర పరిస్థితుల్లో చేతుల్నుపయోగించి

ఎదుటి వాళ్ళని పడగొట్టే సులువు తెలియాలి. కొన్ని విపరీత పరిస్థితుల్లో కొందరు ఎలా తప్పించు కుంటారో సినిమాలు చూసితెలుసుకోవచ్చు. అన్ని సదుపాయాలూ నా దగ్గరున్నాయి. నాలుగురోజుల శిక్షణ ముగిసిందంటే నువ్వు నాకే మస్కాకొట్టి పారిపోగలవు...."

"సరే అలాగే!' అంది ఈశ్వరి.

'పద-' అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ. ఈశ్వరి అతడి ననుసరించింది.

*    *    *

గంగాపురంసమీపం వరకూవచ్చి ఆగిపోయిందిఈశ్వరి.

పరమాత్మ చెప్పిన ప్రకారం తన గ్రామంలో అడు గిడకూడదు ఆమె జేబులోంచి మ్యాపు తీసింది. మ్యాపు చూసి స్థలాలనెలా గుర్తు పట్టాలో ఆ కృష్ణపరమాత్మ తనకు శిక్షణ ఇప్పించాడు.

ఆమె ఆ మ్యాప్‌ను జాగ్రత్తగా పరిశీలించి కొండ చేరుకుంది. అక్కడున్న కాలిబాటనామె సులభంగానే గుర్తించ గలిగింది. ఎక్కడా ఎవ్వరూ ఆమె కంటబడ లేదు. ధైర్యంగా ముందడుగు వేసిందామె.

సుమారు మూడు కిలోమీటర్ల దూరం నడిచేక ఆమెకు భయంకరావతారం కనబడింది. అదిచూసి ఆమె ఏమాత్రం భయపడలేదు. ముందుగానే శ్రీకృష్ణపరమాత్మ హెచ్చ రించడం వల్ల.

అయితే అతను చెప్పినట్లుగా ఆ బొమ్మ చేయి ఏ వైపూ చూపడంలేదు. రెండు చేతులూ పొట్టమీద వేసు కుని ఉన్నదా ఆకారం.



# క్రైమ్‌లో తమాషాలు

**ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు, 'అవన'లో ప్రచురించబడే ప్రతి జోక్‌కు రు. 5/- లు పారితోషికం పంపబడుతుంది. —ఎడిటర్.**

## పోయిన పర్సు?

శివానందం పరధ్యానంగా ఫుట్‌పాత్ మీద నడుస్తూ-వెళుతున్నాడు. సాయంత్రం సమయం కావడం వల్ల రోడ్లు చాలా రద్దీగా ఉన్నాయి. ఉన్నట్టుండి శివానందాన్ని ఎవరో తాకుతూ వెళ్ళారు. పరధ్యానంలో శివానందం ఆ విషయం గమనించనే లేదు.

శివానందం ఓ కిళ్ళీషాపు ముందాగి సిగరెట్లు కొందామని డబ్బుకోసం జేబులో చెయ్యివేసాడు. జేబు ఖాళీగా ఉంది. అన్ని జేబులూ వెతికి చూసాడు. పర్సులేదు.

శివానందం నిరాశ పడిపోయాడు ఉన్న అయిదు రూపాయలు పర్సుతో సహా ఎవరో కాజేశారని.

ఇంతలో ఎదురుగా ఎవరో పరుగెత్తుకొస్తున్నట్టు శివానందం గమనించాడు. అతడి వెనక చాలామంది జనం పరిగెత్తుకొస్తున్నారు. ఆ పరిగెత్తుకొస్తున్న మనిషి శివానందాన్ని తాకుతూ వెళ్ళిపోయాడు. వెనకే పరిగెత్తుకొస్తున్నవారు శివానందాన్ని దాటి దొంగ దొంగ అని అరుస్తూ ఆ పరిగెత్తుతున్న మనిషి వెంట పరిగెత్త సాగరు.

శివానందం ఏమీ పట్టించుకోని వాడిలా-అక్కడ్నించి వెళ్ళిపోయాడు.

నడుస్తూ పరధ్యానంగా శివానందం జేబులో చేయి వేశాడు. చేతికి ఏదో తగిలినట్టనిపించి బయటికి తీశాడు.

పర్సు!

శివానందం పరీక్షించి చూసాడు. ఆ పర్సు తనదికాదు. దాన్ని తెరిచి చూసాడు. దాంట్లో ఉన్న అయిదు వందల రూపాయలు శివానందాన్ని మతి పోగొట్టాయి.

ఆ పర్సు తన జేబులో కెలా వచ్చిందా అని శివానందం బుర్ర బద్దలయ్యేట్టు ఆలోచించాడు. జవాబు దొరకలేదు।

- పి. లక్ష్మిరాజ్, నిజామాబాద్.

## నైపుణ్యం-?

బస్తీలో చదువుకుంటున్న మైనర్ బాబు సెలవులకు వచ్చి ఊరి నడి బజారులో సైకిల్ తొక్కడంలో తనకు ఉన్న నైపుణ్యాన్ని ప్రదర్శించడానికి నిశ్చయించుకున్నాడు.

ఐదు నిమిషాల పాటు మామూలుగా తొక్కిన తరువాత చేతులు వదిలేసి "ఇప్పుడు నాకు చేతులు లేవు చూడండి" అని హుషారుగా తొక్కాడు.

జనం వింతగా చూడడం ప్రారంభించారు.

తరువాత కాళ్లు రెండూ ముందు చక్రం మీద పెట్టి "ఇప్పుడు నాకు కాళ్లు లేవు చూడండి" అని కొంతసేపు నడిపించాడు.

జనం చప్పట్లు కొట్టారు.

అబ్బాయికి హుషారు ఎక్కువయి "ఇప్పుడు నాకు కళ్ళు లేవు" అంటూ కళ్లు మూసుకొని సైకిల్ తొక్కాడు. అయితే బాలన్స్ తప్పి ఎదురు గుండా ఉన్న వస్తాదును ఢీకొట్టాడు.

ఇద్దరూ క్రిందపడ్డారు.

మైనర్‌ను లేవనెత్తి ఆ వస్తాదు చంప పగలగొట్టాడు. పళ్ళు గవ్వల్లా రాలాయి. అవి మైనర్ చేతిలో పెట్టి "ఇప్పుడు ఇతనికి పళ్ళు లేవు. చూడండి" అని దుమ్ము దులుపుకొని చక్కాపోయాః

-డాక్టర్ ప్రభాకర్, తిరుచ్చి-14.

## మేలుకొలుపు ?

భర్త : మన ప్రక్కింటి మీనాక్షి ఉదయం ఐదింటికే లేచి, ఎంచక్కా పాటపాడుతూ భర్తని నిద్ర లేపుతుంది. అలా నువ్వెప్పుడైనా పాట పాడి నన్ను నిద్రలేపావటే ....?

భార్య : లేవగానే ఆయనలా మీరు వంట చేస్తానంటే పాటేం ఖర్మ ! డాన్స్ కూడా చేస్తాను !!!

-యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

Edited and Published by S. Damodar Reddy
3-4-554 Narayanaguda Hyderabad-500 029,
and Printed at Graphic Seva
Hyderabad-500004.

